# నిర్వచన అధ్యాత్మ రామాయణం

(బాల, అయోధ్య, అరణ్య కాండలు)

గ్రంథకర్త

**విద్వత్కవి ఆకుండి వేంకటశాస్త్రి**



తిరుమల తిరుపతి దేవస్థానంవారి
ఆర్థిక సాయంతో ప్రచురింపబడిన గ్రంథం

ప్రచురణ కర్త

**ఆకుండి రామశర్మ**

శ్రీకాకుళం

గ్రంథం : **నిర్వచన అధ్యాత్మ రామాయణం**
(బాల, అయోధ్య, అరణ్య కాండలు)

ముద్రణ : ఉషాకిరణ్ ఆఫ్‌సెట్ ప్రింటర్స్, శ్రీకాకుళం.

డి.టి.పి. ఆపరేటర్ : శ్రీ చౌదరి శ్రీనివాసరావు

ప్రచురణ : **ఏప్రిల్, 1999.**

ప్రతులు : **750**

వెల : **రూ. 100-00**

ప్రచురణ కర్త చిరునామా:
ఆకుండి రామశర్మ,
'సాహితి' ప్లాట్ నెం.77
బ్యాంకర్స్ కోలనీ,
దీపామహల్ వెనుక,
శ్రీకాకుళం - 532 001.



గ్రంథకర్త

శ్రీ ఆకుండి వేంకటశాస్త్రి



గ్రంథకర్త భార్య

శ్రీమతి ఆకుండి లక్ష్మిదేవమ్మ



ప్రచురణ కర్త

ఆకుండి రామశర్మ దంపతులు



గ్రంథకర్త అల్లుడు

మధురా పంతుల సీతారామస్వామి దంపతులు

ఉభయ భాషాప్రవీణ
పండిత ఆకుండి సూర్యనారాయణ శాస్త్రి

# స్పందన

శ్రీ మదధ్యాత్మరామాయణమును - నిర్వచన పద్యకావ్యముగా అనువదించిన. కీర్తి శేషులు విద్వత్కవి శ్రీ ఆకుండి వేంకటశాస్త్రిగారు నాకు బాంధవమున పూజ్య పితృవ్యులు. శిష్య భావమున పూజ్య గురుపాదులు. అట్టి శ్రీ శాస్త్రిగారిని గూర్చి. వారు అనువదించిన అధ్యాత్మ రామాయణ పద్యకావ్యమును గూర్చి కొన్నిమాటలు వ్రాయవలసినదిగా-శ్రీ శాస్త్రిగారి కనిష్ఠ పుత్రుడు నా సోదరుడు శ్రీ రామశర్మ కోరుట అది నాభాగ్యముగా భావించుచున్నాను. ఏదేని రామాయణమును గూర్చి వ్రాయునపుడు శ్రీమద్రామాయణమును స్మరింపకుండ అద్దానిని గూర్చి కొన్ని మాటలు వ్రాయకుండ ఎవ్వరును ఉండజాలరు. అయ్యది ఆదికావ్యము. వాల్మీకి మునికోకిలము కవితా శాఖను అధిరోహించి మధురాతి మధురముగా మొట్టమొదటగా శ్రీరామచరితమును గానము చేసినది. అదియే శ్రీమద్రామాయణము. సంస్కృత వాఙ్మయమున అదియే ఆదికావ్యముగా కీర్తింపబడినది. అదియొక మధురసుధామయరసగుళిక.

శ్లో॥ "కూజంతం రామ రామేతి మధురం మధురాక్షరమ్ ।
ఆరుహ్య కవితా శాఖాం వందే వాల్మీకి కోకిలమ్ ॥"

అని ఆకవి కోకిలమునకు లోకమంతయు అంజలి ఘటించినది. పద్మసంభవుని ప్రేరణమున అతని రాణి వాణి వాల్మీకి మహర్షి ముఖ కమలమున ప్రవేశించి ఆముని పుంగవుని జిహ్వాపై నర్తించి శ్రీమన్నారాయణుని అవతారమగు శ్రీరామచంద్రుని చరితమ్మును మధురాతి మధురమ్ముగా గానము చేసినది. ఆరామాయణ మహాగంగానది ముల్లోకముల ప్రవహించి త్రిలోకములను పవిత్రము గావించినది.

శ్లో॥ "వాల్మీకి గిరిసంభూతా రామసాగర గామినీ !
రామాయణ మహాగంగా పునాతి భువనత్రయమ్ ॥"

అని బహుధా కీర్తింపబడినది. ఆ రామాయణమే అనంతర కాలమున అనంతముఖముల అనంత విధములుగా గానముచేయబడినది.

శ్లో॥ "చరితం రఘునాధస్య శతకోటి ప్రవిస్తరమ్ "

గీర్వాణ భాషలోనే శతకోటి గ్రంథముగా విస్తరించినది. ఇంకా దేశభాషలందునన్న - పద్యాత్మకముగా - గద్యాత్మకముగ - గద్యపద్యాత్మకముగా - కావ్యములుగా - నాటకములుగా - గేయములుగా ఎన్నెన్ని విధములుగా ఎంతగా వ్యాపించినదో శేషునకైన ఎన్నతరముగాదు. ఆగాథ అంతరమణీయమైనది. అంత మధురమైనది. అది మధురాక్షరము - అక్షరమధురము. మన దేశ భాషలలోనేగాదు. విదేశ భాషలలోను ఇయ్యది ఎంతగనో విస్తరించినది. ఎందరు ఎన్ని విధములుగా మలచి వ్రాసినను దాని మాధుర్యము తరుగలేదు. అదియొక మధుర సుధా పాథోనిది. ఎంత వినిన ఎంత చదివిన తనివితీరనిది.

శ్లో॥ "యః పిబన్ సతతంరామ చరితామృతసాగరమ్ !
అతృప్తస్తం మునిం వందే ప్రాచేతస మకల్మషమ్ !!"

ఆరామచరితామృత సాగరమును - ఆ వాల్మీకి మహర్షియే సతతము పానము చేయుచున్నను తృప్తినందలేదట. అది అంతటి మధురమైనది. ఆనాటికి ఈనాటికి ఏనాటికిని గూడ దాని మాధుర్యము తరుగనిది. తనివితీరనిది - రామాయణము. నిత్యము తిన్న అన్నమునే తిన్నను దాని యందు అరుచి పుట్టనట్లు చదివిన దానినే చదివినను విన్నదానినే విన్నను వ్రాసినదానినే వ్రాసినను దాని యందు అరుచి యన్నది పుట్టదు.

సంస్కృత భాషలో వెలసిన రామాయణములలో - ముఖ్యమైనవి రెండు. అందొకటి శ్రీమద్రామాయణము రెండవది అధ్యాత్మ రామాయణము. శ్రీమద్రామాయణమును వాల్మీకి మహర్షి రచింపగా - అధ్యాత్మరామాయణమును విశ్వామిత్రమహర్షి రచించెనందురు. రెండును ఆర్షప్రోక్తములే, రెండును అతి పవిత్రమైన పారాయణ గ్రంథములే ! ఆ ఋషి పుంగవుల అంశ లేనిది రామాయణ రచనమే సాగదని ఆర్యోక్తి.

అట్టి ఆ రామాయణములలో - అధ్యాత్మరామాయణమును కీర్తిశేషులు ఋషితుల్యులు - విద్వత్కవులు నయిన శ్రీ ఆకుండి వేంకటశాస్త్రిగారు నిర్వచన పద్యకావ్యముగా ఆంధ్రభాషలోనికి అనువదించినారు. వారు ఏతత్కావ్య రచన గావించి ఇంచుమించు మూడు పుష్కరముల కాలము గడచిపోయినది. ఇంతవరకు అయ్యది వెలుగులోనికి రాదయ్యెను. అద్దానిని అతని కనిష్ఠ పుత్రరత్నమగు శ్రీరామశర్మ భగీరథ ప్రయత్నముగావించి తిరుమల తిరుపతిదేవ స్థానమువారు విరాళముగా అందజేసిన

ఆర్థిక సహాయము తోడను, శ్రీ శాస్త్రిగారి కుటుంబ సభ్యులు అందజేసిన ఆర్థిక సహాయముతోడను అందలి ఆది మూడు కాండలు (బాల - అయోధ్య - అరణ్య కాండలు) ముద్రాపించి వెలుగులోనికి గొనివచ్చినారు. అది యొక శుభపరిణామము. అనతికాలములోనే తక్కిన మూడు కాండలును వెలుగులోనికి రాగలవని ఆశించుచున్నాను.

శ్రీ శాస్త్రిగారి పితామహులు మాకు ప్రపితామహులు నగు వేంకటకవిగారు ఇంచుమించు 150 సంవత్సరములకు పూర్వము తత్త్వ సంగ్రహ రామాయణమును రచింపగావారి ప్రౌత్రులగువీరు అధ్యాత్మ రామాయణమును పద్యకావ్యముగా రచించినారు. తత్త్వమన్నను, అధ్యాత్మమన్నను ఒక్కటే గదా! తాతగారి అంశ వీరిలో పూర్తిగా ప్రతిఫలించినట్లు గోచరించును. తాత - మనుమలు ఇరువురును పేరులోనే గాదు పేరుకెక్కిన సాహితీ వైభవమున - కవితా సౌరభమున ఒకరినొకరు తీసిపోరు. వారికి వారేసాటి.

## శ్రీ శాస్త్రిగారి వ్యక్తిత్వము :

శ్రీ శాస్త్రిగారు ఋషితుల్యులు. సచ్చరిత్రులు శాంతమూర్తులు. సత్యవాగ్రతులు సాత్త్విక భావ సంపన్నులు. విశేషించి శ్రీరామ భక్తులు. నిరంతరము శ్రీరామనామగాన లోలురు. నిరాడంబరులు. నిత్య సంతుష్టులు. వారి మనస్సు వెన్నకంటే మెత్తనిది. వారి హృదయము తేనెకంటె తీయనిది. అమృత హృదయులు, శిష్యవత్సలులు.

## పరిచయము :

విపుల విఖ్యాతిగన్న శ్రీ శాస్త్రిగారిని లోకమునకు పరిచయముచేయుట - భాస్కరుని దివ్వెలతో చూపించుట వంటిది. వారు నిఖిల విద్యలకు నిలయమైన విజయనగర వాస్తవ్యులు. శ్రీశ్రీ విజయనగర మహారాజులు. విజయనగరములో నెలకొల్పిన సంస్కృత మహావిద్యాలయమున ఆంధ్ర శాఖలో ప్రధానాచార్యులుగా బహుకాలము ఛాత్రకోటికి విద్యాదానము గావించిన ఆచార్య వర్యులు.

## పాండిత్యము :

శ్రీ శాస్త్రిగారు - ఉద్దండ పండితులు - ఆంధ్ర సంస్కృత భాషార్ణవముల గండూషించిన

మహా మనీషులు. సాహితీ కోవిదులు. ఆబాల్య లబ్ధకవితా విశేషులు. విద్వత్కవి బిరుదాంచితులు. అసాధారణ ప్రజ్ఞాధురీణులు సంగీతము - సాహిత్యము - కవిత్వము వారి సొత్తు ఆమూడింట వారు పరిణత ప్రజ్ఞులు.

## కవిత్వము :

పద్య కవిత్వము - గద్య కవిత్వము ఉభయ కవిత్వములలోను వీరు సిద్ధహస్తులు. ఉభయ భాషాకవులు. బహుగ్రంథకర్తలు. వీరి కవిత ధారాళమైనది. ధారాశుద్ధిగలది. రసవత్తరమైనది. సౌకుమార్యము - పదలాలిత్యము - మాధుర్యము వీరి కవితలోని ముఖ్య లక్షణములు.

## పద్య కవిత :

ప్రౌఢ నిర్భర వయః పరిపాకముననే వీరు - 'జానకీప్రియా' ఆదిగా గల కొన్ని శతకములు - 'శ్రీవిలాసము' ఆదిగా గల కొన్ని హృద్య పద్య కృతులు రచించియున్నారు. వార్ధకమున వ్రాసినది - ఈ అనవద్య అధ్యాత్మ రామాయణము. ఇందు 'మచ్చునకై కొన్ని పద్యములు ఉదహరింపవలెనన్న అన్నియు రసగుళికలే ! అన్నియు సానలుదీరిన జాతిరత్నములే ! దేనిని విడువ గలను ? అందుచే ఆ ప్రయత్నమును విరమించు కొంటిని. అన్ని పద్యములు హృద్యములు - అనవద్యములే ! తాతగారి వలె వీరును శబ్దాలంకార ప్రియులు - కందపద్యములందభిరుచిమెండు. దురవగాహములగు వేదాంత విషయములను వీరు - తేటగీత మాలికలలో - తేటతెల్లమగు మాటలతో వాకొనిరి. రసోచితమగు శైలితో - సందర్భోచితమగు పదగుంభనతో వీరి కవిత ఒకే తీరున తుది వరకు సాగినది.

## గద్య కవిత :

శ్రీ శాస్త్రిగారు అనువదించిన గద్యకృతులను వారే ఈ పద్య కావ్యమున ఈ తీరున వాకొనిరి.

క. వ్రాసితి మార్కండేయము
వ్రాసితి కూర్మమ్ము దేవి భాగవతమ్మున్
వ్రాసితి భారత భాగము
వాసిగ వావిళ్లవారి వచన రచనలన్ !

మరియు ధనంజయ కవికృతమగు "తిలకమంజరిని" అనువదించిరి బుద్ధ చరితలను వాకొనిరి.

ఆ మహా మహుని గూర్చి - వారి కావ్యమును గూర్చి కొన్ని మాటలు వ్రాయు అవకాశము లభించుట అది నా భాగ్యముగా భావించుచున్నాను. వారి శిష్యకోటిలో నేనొక శిష్యుడనని చెప్పికొనుట నాకది గర్వకారణము. శ్రీ శాస్త్రిగారిని గూర్చి - వారి కావ్యమును గూర్చి వ్రాయుటకు ఎంతేని గలదు. కాని గ్రంథ విస్తరభీతిచే విపులముగా వ్రాయలేకపోవు చున్నందులకు (క్షంతవ్యుడను) చింతించుచున్నాను.

'శీతాంశోరమ్యతార్పణమ్మను క్రియన్'. నా యీ స్పందనమును గురు దేవులకు అభినందన పూర్వకముగా అందజేయుచున్నాడను. ధన్యోస్మి.

శ్లో॥ అజ్ఞాన తిమిరాంధస్య జ్ఞానాంజన శలాకయా !
చక్షురున్మీలితం యేన తస్మైశ్రీ గురవేనమః !!"

ఇట్లు
శ్రీ శాస్త్రిగారి పుత్రప్రాయ ఛాత్రుడు
విద్వజ్జన విధేయుడు
పండిత ఆకుండి సూర్యనారాయణ శాస్త్రి

జమ్‌షెడ్‌పూర్
12.02.1999

# ప్రచురణకర్త ప్రతిస్పందన

ఆదికవి వాల్మీకి విరచిత శ్రీమద్రామాయణానంతరం రామకథకు దర్పణములై భాసించిన ఆర్షసాహితిలో "అధ్యాత్మ రామాయణం" విభిన్న సారస్వత ప్రక్రియలలో రచింపబడి ప్రముఖ స్థానము సంతరించుకొన్నది. ఇహపర సాధనాశ్రయ కల్పతరువు అయిన అధ్యాత్మ రామాయణ పఠనానంతర ఫలశ్రుతి - మానవాళిలో ఆధ్యాత్మికతను ప్రోదిచేసే ఒక మధుర శ్రుతి. ఆస్తిక జనావళికి రామాయణ కావ్య రసాస్వాదన మొక మధురస్మృతి. సకల పాపహారిణి, సమస్త సంపదల సాదనకాలవాలం, భవ బంధ విమోచన ఫలప్రదాయిని అగు 'అధ్యాత్మమును' పఠించువారలు విద్యానిధులు కాగలరు, ధన యశః పాండిత్య ప్రతిభలను గాంచగలరు. భవాబ్ధితారకం, భయవిదారకం, దుఃఖవారకం అయిన రామచరిత సకల సన్మంగళాలను సమకూర్చు ఆధ్యాత్మిక విజ్ఞాన భాండాగారం. అట్టి ఉత్తేజకరమైన ఉజ్జ్వల తాత్త్విక పవిత్రతరంగిణి అగు అధ్యాత్మ రామాయణ సుధామాధురిని తనివితీరా పాఠకులు గ్రోలగలరను భావన, తపన ఈ ప్రచురణకర్త ఆశయం ఆకాంక్ష

నాలుగు దశాబ్దాల క్రితం డెబ్బది ఏండ్ల వార్ధక్యదశలో కాచి వడబోసిన ఆధ్యాత్మికానుభూతికి పరాకాష్ఠగా రూపుదిద్దుకొని ఇంత దనుక అముద్రితంగా అలమటించి ప్రచురణా భాగ్యమునకు నోచుకోని ఈ కావ్యమణి దీపంలో బాల, అయోధ్య, అరణ్య కాండలను మూడింటిని ప్రథమ సంపుటముగా ప్రచురించే భాగ్యము - నా పురాకృత సుకృతం. చరమాంకంలో మరణశయ్యపై కూడ ఈ గ్రంథం వెలుగులోనికి రానందులకు పరితపించి, తపించిన మా తండ్రిగారి అంతిమ మనోరథ సఫలతకు సంకేతం ఈ గ్రంథ ప్రచురణ ఈ మహత్కార్య సాధనలో ఈ కావ్యజ్యోతి ప్రజ్వలనములో భక్తి ప్రపత్తులతో ఆర్థికసాయం అందించిన దౌహిత్రులు, పౌత్రులు సర్వదా సర్వథా అభినందన పాత్రులు భువినుండి దివికేగిన కవితల్లజుని ఆత్మశాంతి ప్రదాతలు అనిర్వచనీయ ఆనంద సంధాతలు అనవరతం ఈ నవతరం అందించిన వితరణకు బహుధా ఆశీర్వచన పాత్రులు.

హృద్యమైన గద్యరచనతోబాటు, అనవద్యమైన ఆంధ్ర పద్యసలలితా కవితా పారిజాతాల్ని అందించిన ఉభయభాషా ప్రవీణ ప్రత్యక్షరామాయణ పద్యకావ్యకర్త , శ్రీమదధ్యాత్మరామాయణ గద్యకావ్యకర్త శ్రీ ఆకుండి

సూర్యనారాయణ శాస్త్రిగారు నా అభీష్టం మేరకు అనతికాలంలో అవలీలగా స్పందించి గురుదేవుల పట్ల తమకు గల భక్తి తాత్పర్య నివేదనకు ప్రతీకగా సమర్పించుకొన్న 'స్పందన'కు ప్రచురణ కర్తగా నా హృదయ పూర్వక కృతజ్ఞతాంజలులు. పౌత్రుని వివాహ సందర్భంలో బంధువుల సమక్షంలో మహోదార విరాళం ప్రకటించి అన్న మాటను నిలుపుకొన్న అన్నగార్కి శత సహస్ర కృతజ్ఞతాభి వందనములర్పించుట నా విహిత కర్తవ్యం, విధ్యుక్తధర్మం.

ఆది నుండి ఈ గ్రంథ ప్రచురణా క్రతువులో హితోధికముగా సహాయ సంపత్తులందించిన శ్రీ ఎస్.టి.పి.వి. కూర్మాచార్యులు, (మాజీ శాసనమండలి సభ్యులు) గార్కి, నా హృద్గత వినమ్ర కృతజ్ఞతాంజలి.

ముఖచిత్ర ఫలకం మొదలు ఫలశ్రుతి వరకు సర్వాంగ సుందరంగా రూపకల్పన చేసి ముద్రణలో సహకరించిన ఉషాకిరణ్ ఆఫ్‌సెట్ యాజమాన్యంవారికి, డి.టి.పి. ఆపరేటర్ - శ్రీ చౌదరి శ్రీనివాస్ గార్కి, నా హృదయపూర్వక కృతజ్ఞతాభివందన చందనాలు.

శ్రీకాకుళం

ఇట్లు బుధజన విధేయుడు,

ఆకుండి రామశర్మ

# గ్రంథకర్త వంశవృక్షం

ఉమాపతి ( గ్రంథకర్త ప్రపితా మహుని తండ్రి )



జగన్నాధం ( ప్రపితామహుడు )



వేంకటకవి ( పితామహుడు )



రామజోగి శాస్త్రి ( గ్రంథకర్త తండ్రి )

|  |  |  |  |
|---|---|---|---|
| రామమూర్తి ( జ్యేష్ట సోదరుడు ) | అచ్యుత రామమూర్తి (రెండవ సోదరుడు) | సత్యనారాయణ (మూడవ సోదరుడు) | వేంకట శాస్త్రి (గ్రంథకర్త) |

## గ్రంథకర్త : వేంకట శాస్త్రి భార్య : లక్ష్మీ దేవమ్మ కుటుంబ వివరాలు

| కుమారులు | కోడళ్ళు | కుమార్తెలు | అల్లుళ్ళు |
|---|---|---|---|
| లక్ష్మీనరసింహ శాస్త్రి | వెంకట రమణమ్మ | అప్పలనరసమ్మ | ఆయపిళ్ళ ముఖలింగం |
| సూర్యనారాయణ | రాజేశ్వరి | వెంకట రమణమ్మ | మధురాపంతుల సీతారామస్వామి |
| రామశర్మ | శారదాంబ | చిట్టెమ్మ | భళ్ళమూడి వెంకట రమణమూర్తి |
| | | సుందరమ్మ | భాగవతుల వెంకట రమణ |

## గ్రంథకర్త జేష్టకుమారుడు లక్ష్మీనరసింహ శాస్త్రి కుటుంబం

| కుమార్తె | అల్లుడు | మనుమలు | మునిమనుమలు |
|---|---|---|---|
| సరస్వతి | మదురాపంతుల బుచ్చి వెంకటరామారావు | సత్య ప్రసాద్, ఉషారాణి, రవి శంకర్, | మేఘన |
| | | ఉమాశశి, మద్దాలి సుబ్రహ్మణ్య జవహర్‌లాల్ నెహ్రూ | లక్ష్మీ ప్రత్యూష, ఆదిత్యలలిత్ |

## గ్రంథకర్త రెండవకుమారుడు సూర్యనారాయణ కుటుంబం

| కుమారుడు | కోడలు | కుమార్తె | అల్లుడు | మనుమలు |
|---|---|---|---|---|
| వేంకట శాస్త్రి | వాణి | సుబ్బలక్ష్మి | ఓలేటి శ్రీనివాస్ | భార్గశ్రీ భానుశ్రీ |

## గ్రంథకర్త కనిష్ట పుత్రుడు రామశర్మ (ప్రచురణ కర్త) కుటుంబం

| కుమారులు | కోడళ్ళు | మనుమలు | కుమార్తెలు | అల్లుళ్ళు | మనుమలు |
|---|---|---|---|---|---|
| లక్ష్మీనారాయణ | విజయలక్ష్మి | కావ్యప్రియ | జయలక్ష్మి | నలదీగ శ్రీనివాసరావు | వివేక్ |
| వెంకటరమణ మూర్తి | శోభ | శ్రీ హర్ష | అనూరాధ | ద్వివేదుల గోపాలరావు | శ్వేత, శ్రుతి |
| | | సిద్ధార్థ | సీతాదేవి | గుమ్మా శ్రీనివాస్ | అరుణ్ |
| | | | ఉషారాణి | రామవరపు సుబ్రహ్మణ్యం | కిరణ్ |

## గ్రంథకర్త పెద్ద అల్లుడు ఆయపిళ్ల ముఖలింగం కుటుంబం

| కుమారుడు | కుమార్తెలు | మనుమలు |
|---|---|---|
| వెంకటరమణ మూర్తి | మహాలక్ష్మి | సూర్యకాంతం - ఆయపిళ్ళ మురళీధరరావు |
| కోడలు | అల్లుడు | ధనలక్ష్మి - ముద్దు వేణుగోపాలరావు |
| సీతామహాలక్ష్మి | ఆకుండి విశ్వేశ్వరరావు | కామేశ్వరి - భళ్ళమూడి శంకరరావు |
| | | వెంకట రమణమ్మ - ద్విభాష్యం కృష్ణమూర్తి |

## గ్రంథకర్త జ్యేష్ఠ దౌహిత్రుడు వెంకటరమణ మూర్తి కుటుంబం

| కుమారులు | కుమార్తెలు | అల్లుళ్ళు | మనుమలు |
|---|---|---|---|
| వెంకట హనుమంత కృష్ణమూర్తి | భారతి | గుమ్మలూరి శ్రీనివాస్ | అరుంధతి |
| వెంకట శేఖర్ | | | అపరాజిత, అపర్ణిష్ |
| | వెంకట సుబ్బలక్ష్మి | భాగవతుల రామావతారం | అక్షయ్, ఆదిత్య |
| | విశాలాక్షి | పంతుల రవికుమార్ | అశ్విని |
| | వెంకట సీతాలక్ష్మి | | |

## గ్రంథకర్త రెండవ అల్లుడు శ్రీ సీతారామస్వామి కుటుంబం

| కుమారులు | కోడళ్ళు | మనుమలు |
|---|---|---|
| బుచ్చి వెంకట రామారావు | సరస్వతి | సత్యప్రసాద్, రవిశంకర్, ఉమాశశి |
| వెంకట వరహా నరసింహ ప్రసాద్ | జానకి | శ్రీచరణ్, గోపికా పూర్ణిమ |
| రామకృష్ణ ప్రభాకర్ | సరోజ | సౌజన్య స్రవంతి |
| సుబ్రహ్మణ్యం | లీల | నీలిమ, మనోహర్ |
| వెంకట రమణ మూర్తి | రాజ్యలక్ష్మి | రామశశాంక, రమ్యకౌముది |

## గ్రంథకర్త రెండవ అల్లుడు శ్రీ సీతారామస్వామి కుటుంబం

| కుమార్తెలు | అల్లుళ్ళు | మనుమలు |
|---|---|---|
| భారతి | భాగవతుల లక్ష్మినరసింహ శాస్త్రి | సీతారామ స్వామి<br>జగన్నాథ శర్మ<br>లక్ష్మి సూర్య కుమారి<br>కామేశ్వరి |
| సత్యవతి | ఆనవిళ్ళ వేణుగోపాలరావు | శ్రీనివాసరావు<br>సీతారామస్వామి, రాధ |
| దుర్గా సరస్వతి | పంతుల కామనరసింహ మూర్తి | విశ్వనాథం<br>రామరంజన్<br>రమణ్ ప్రభాత్ |
| పద్మ | | |

## గ్రంథకర్త మూడవ అల్లుడు భళ్ళమూడి వేంకట రమణమూర్తి కుటుంబం

| కుమారుడు | కోడలు | మనుమలు |
|---|---|---|
| సన్యాసిరావు | శోభాదేవి | సురేష్ కుమార్,<br>ప్రవీణ్ కుమార్,<br>దీపా కుమారి |

## గ్రంథకర్త నాల్గవ అల్లుడు భాగవతుల వేంకట రమణ కుటుంబం

| కుమారుడు | కోడలు | మనుమలు |
|---|---|---|
| వెంకటముఖ లింగస్వామి | సీతాదేవి | సుజాత,<br>సునీత |

# నిర్వచన అధ్యాత్మ రామాయణం

## బాలకాండ

శ్రీ రాజద్రవి సత్కుల
వారాం నిధి చంద్ర ! భక్తవత్సల సీతా
నారీ హృదయాం భోజని సూరా!
సురవైరి వర్గ సూదన ! రామా ! 1

ఇతర కృతుల్ గనుంగొనగ, నేనసమర్ధుడ ; నల్ప దృష్టి నే
గతి గమనింతు ? సత్కవుల కావ్యపథమ్ములు ; దైవదత్తమౌ
మతికొలదిన్, రచింతు నవమార్గమునన్, రఘురామ సత్కథా
స్థితి గతు, లెవ్వరేకరణి జెప్పిన శ్లాఘ్యము కాకయుండునా ! 2

తాతల నుండి నేటికి ; సుధా మధురాంతరరామ సత్కథా
పూత ధనమ్మె మాకు బరిపోషకమై చనుదెంచుచుండె మా
తాత రచించె ; రామకథ ; తత్త్వములన్నిటి సంగ్రహించి, వి
ఖ్యాతిగ ; నేను వ్రాసెదను, గౌశికమౌనికృతమ్ము దెల్గునన్ ॥ 3

వ్రాసితి మార్కండేయము ; వ్రాసితి
గూర్మమ్ము ; దేవి భాగవతమ్మున్
వ్రాసితి భారతభాగము వాసి
గవావిళ్ళవారి వచన రచనలన్॥ 4

వ్రాసితి గొలందిగా బద్య వాఙ్మయమ్ము
వాని నెల్ల రసజ్ఞులౌ ప్రాజ్ఞుల కృప
వెలువరిచినేడు వ్రాసెద గలము పూని
రమ్యమైనట్టి యధ్యాత్మ రామచరిత 5

గాధినందనకృత రామకధను దెలుగు
నందు వ్రాయగబూన సాహసమె గాని
రాముడే కలవడనెడుధైర్యమ్ము తోడ
దానికనువాదమొనరింపదలచినాడ 6

పాండితిని జూప గొబ్బరి పాకమంద్రు
సులభముగ వ్రాసితినొ జొన్నచొప్పయందు
రందఱును మెచ్చగా వ్రాయనౌనె ? నాకు
మృదు పదంబుల జేర్చి వ్రాయుదును నేను 7

వృద్ధుడను మహాగ్రంథము
బుద్ధి బలముకొలది వ్రాయబూనితినిటు, త
చ్ఛిద్ది యెటుగల్గునో మా
ముద్దర శ్రీరామయని రఘూత్తముదలతున్ 8

రామ! నీదయ నాల్గక్కరములు నేర్చి
నిన్నె సతతము సేవించు నిష్ఠబూని
త్వచ్చరిత్రమె, నీకంకితమొసగుట
నీది నీకిచ్చుట యెగాని, కాదువేఱు॥. 9

వయసుమీఱెను, విజ్ఞానబలముజాఱె
నింద్రియములై దిటుపటుత్వ మిగురబాఱె
రామచరితమ్మదేడ ? నే వ్రాయుటేడ ?
అకట ! నాకేది శక్తి యుత్సుకత దప్ప 10

వట్టి చప్పని సుడుల బ్రబంధరచన
సేయుటొక గొప్ప గాదని చెప్పిరొకరు
కాని, నా నిర్ణయము నేను మానికొనను
దీనిలోనైన స్వాతంత్ర్యమూన దగదొ? 11

తగనధ్యాతమ్మునొన
ర్పగ నేర్తునా? నేరనో ? సభాస్థలి విన్పిం
పగ దెలియుదాని విధమా
యగుణుని కథ సగుణ మెట్టులొబరికింపన్ 12

తత్త్వ సంగ్రహమన్న నధ్యాత్మమన్న
నించుమించుగ నొకటి, యేయటంచు
సత్కవి పితామహుడు తత్త్వ సంగ్రహమ్మ
వ్రాయ నధ్యాత్మమేనిట్లు వ్రాయువాడ 13

సత్కవిని గాక యును, వి
ద్వత్కవినని చెప్పికొనుచువ్రాసితిగృతులన్
మత్కావ్యము శోభాసం
పత్కరమై బుధుల మెప్పుబడయునొలేదో ! 14

నిర్వచన అధ్యాత్మ రామాయణం ప్రస్తావన సంపూర్ణం.

# కృతి సమర్పణం

ఏదేవునకు జనకాదిష్టవచనమ్మలంకారకుసుమ మాల్యమ్ముగాగ
ఏవిభునకు నమ్మహేశుధనుర్భంజనమ్మల్ప తృణఖండనమ్మెగాగ
ఏ వీరునకు దనుజావవళిందుని మెడిపని వెన్నతోడ బెట్టి నదిగాగ
ఏమహితుని దివ్యానామముముక్తి సౌధము మెట్ట మంచిసాధనముగాగ
వెలయు నాదేవునకు సర్వ విశ్వ సృష్టి
రక్షణలయమ్ము లొనరింప దక్షుడైన
రామచంద్రునకధ్యాత్మ రామ చరిత
మంకిత మొనర్చి ధన్యతనందువాడ 15

క్షమ గలమనుజులు నిర్వి
ఘ్నముగాదమ కార్యముల నొనర్చికొనుటకై
తమినే వేల్పు గొలుతుర
య్యు మా తనయు పాదములకు నొనరింతునతుల్ 16

గీరమణీ హృద్రమణుని
శ్రీ రమణీ ప్రణయ సింధు శీత మయూఖున్
గౌరీ మానస చోరుని
సార మతిన్ గొల్చి రామచరిత రచింతున్ 17

వరనౌదూర్యన్వయమణి
గురువేంకట శాస్త్రి వర్యుగొలుతుననిశమున్
ధరవ్యాకృత తర్కాలం
కరణ మహాశాస్త్ర బోధక ప్రవర గురున్ 18

సంస్కృతాంధ్ర వచో విలాసమ్ములందు
కొన్ని తెలిసిన వాడనగుటను కాళి
దాస ముఖులకు నన్నయాద్యఖిల సుకవి
తతికి నతులొనరింతు సన్నుతుల తోడ 19

సుకవులకె గాక దుష్కవు
లకుసైతము వందనమ్ములను జేయుదు, ఋ
స్తక గుణము లెన్నుటకు, దెలి
యక దోషములెన్న గూడదనుచు వినతియై 20

స్పర్ధవలదు నాపై గూ
ఢార్ధ సురోక్తులను గ్రంధమల్ల గలను, ద
ద్వ్యర్ధ కవిత యేటికి గడు
సార్ధకమైనట్టి కావ్య సరణి దెలుపగన్ ॥ 21

శాస్త్ర సంగీత సాహితీ సారఘనులు
సత్య శౌచ వివేకోరు శాంతి ధనులు
అత్రి గోత్ర పవిత్ర చారిత్ర ఖనులు
గూఢ సత్వులు శ్రీ మదాకుండి వారు 22

శివ పాద జలజ సంసేవి యుమాపతి మత్పితామహ పితా మహుడు గాగ
శతక కవీశ ప్రశస్త్య జగన్నాధ పండితుడల తాత తండ్రిగాగ
మహనీయ తత్త్వ సంగ్రహరామచరిత సత్కర్త వేంకటకవి తాతగాగ
పంచకావ్యాధ్యాప నాంఛిత రామజోగులశాస్త్రి మజ్జనకుండు గాగ

అత్రి గోత్రులాకుండ్య న్వయాబ్ధి విధులు
వంశపురుషులుగా సతీపావన యగు
సుందరాంబికకు గనిష్ఠ సూనుడనయి
యలరు వేంకటశాస్త్రి సమాహ్వాయుడను 23

అఖిలజనాదరణార్హ సత్వగుణాభిరాముడైనట్టి శ్రీరామమూర్తి
భారతాదిపురాణపఠన సంపాదిత కీర్తి అచ్యుత రామమూర్తి ఘనుడు
సకల సద్వ్యవహారచాతుర్యవర్తి ప్రధీయుత సత్యనారాయణుండు
భ్రాతలుగా, లక్ష్మీ పాపమపావన చారిత్రనాకగ్రజాతగాగ

వ్యాఘ్రపుర బూపగౌరవపాత్రుడైన
సామవేదుల యచ్యుతరామశాస్త్రి
వరుడు మాతా మహుండుగా బరగువిబుధ
జనవిధేయుడ వేంకట శాస్త్రి నేను 24

శ్రీవత్స సగోత్రుండై
పావన పేరమధర్మ పత్నిగ, విద్యా
కోవిదుడు వజ్ఝలకులు
డౌ వేంకట శాస్త్రి శ్వశురుడై నాకలరున్॥ 25

ఆతని కనిష్ఠ సుతయై
పూత చరిత్ర యును, బుణ్య బుద్ధియు భగవ
ద్గీతా ప్రియలక్ష్మి వి
ఖ్యాతాహ్వాయ ధర్మపత్ని యైనాకలరున్ 26

పావనాకృతియాలక్ష్మిదేవి తాను
ముపురు పుత్రులు నల్వురు పుత్రికలును
నలర నిజబంధుజాత విఖ్యాత యగుచు
నుభయవంశములకు గీర్తి యొదవమెలగు 27

ప్రాతస్స్నానపరన్, నిరంతర రమాపాదంబు జార్చా సుధీ
స్వాతంత్ర్యన్, బతిసేవన ప్రియమతిన్, సద్రామకావ్యేక్షణ
ప్రీతన్ శ్రీహరివాసర వ్రతవ్రతిన్ శ్రీలక్ష్మి దేవీ సమా
ఖ్యాతన్, సాసతి, నర్ధదేహము రమాకాంతుడు రక్షించుతన్ 28

లక్ష్మి నరసింహశాస్త్రి యాంగ్లమున బట్ట
భద్రుడై పిమ్మట సదాంధ్రభాషయందు
గూడ బాండితిగని పెదకొమరుడగుచు
వెలయదల్లక్ష్మిదేవి తానలరుచుండు. 29

రెండవ సుతుండు శుద్ధచారిత్రుడగుచు
నాంగలాంధ్రకలా వేత్తయై మెలగుచు
సూర్యనారాయణాహ్వాయశోభియగుచు
సరియుపాధ్యాయులందు యశమ్ముగాంచు ॥ 30

మూడవ సుతుండు రామశర్ముడు తదాంగ్ల
భాషలో బట్ట భద్రుడై వ్యాసరచన
సత్యశౌచ వివేకాది సద్గుణములు
వెలయనెల్ల రకును వేడ్కగలుగ జేయు 31

వారు మూవురు నిజకుల పావనలగు
ధర్మ పత్నుల గూడినిత్య సుఖులగుచు
దైవగురు మాతృ పితృ భవ్యభక్తివెలయ
మెలగుచుందురు సుజనుల చెలిమి కలిగి 32

పావన ధీమతులు, చిరం
జీవమ, శ్రీమతులు రమణ, చిట్టిమయును, వి
ద్యావతి సుందరమయు, స
ద్భావలు మద్దుహితలుగ బ్రవర్తిలుదు రిలన్ 33

ఈనా నలువురు సుతలు, సు
ధీనిధులౌ భర్తలకు నతిప్రియులగుచున్
సూనుల బుత్రికలంగని
గానకలాకుశలలై ప్రకాశింతురొగిన్ 34

తొలుతనుండి యుమద్గ్రంథకలన యందు
బహువిధంబుల నాకు దోడ్పడిన నాదు
నాలుగవ సుత సుందరీ నామధేయ
పుత్ర పౌత్రాభివృద్ధిని బొందుగాక ॥ 35

ఇతి కృతి సమర్పణం సంపూర్ణం.

# వేడికోలు

చెరచెర నడిపించుచు రఘు
వర ! నీ కథ కలము బట్టి వ్రాయునపుడు నీ
దంహాసరుచుల తోడన్
దరిసెన మిప్పించి నన్నుదయ జూడగదే ॥ 36

తలప నధ్యాత్మ విషయకర్దమములందు
మజ్జనోన్మజ్జనముల మసలు నాకు
నీవచేయూతయిడి రామ! లేవదీయ
వలయు, వలతివిగాదె , సర్వకృతులందు. 37

భక్తుడను నేను సంపూర్ణశక్తి వీవు
గాన నన్నొక పావన కథకు గాగ
జేసి, శ్రీరామ చంద్ర! రక్షింపుమయ్య !
నమ్మ వారల బ్రోవ వింతయెుకొ ! నీకు ! 38

ఎందఱెందరు కవులు నీ కృపను గాంచి
గ్రంథములు వ్రాయుచుంటలోకమున లేదు ?
పోతనకు జేయవా పద్యపూర్తి నీవు
శ్రీమహిత గుణసాంద్ర ! శ్రీరామచంద్ర 39

ఇటులు దైవగురుస్తుతి నెలమి వంశ్య
పురుష సంస్కృతి చేసి, యిప్పూత చరిత
యైన యధ్యాత్మ పూర్వరామాయణమున
దొట్టిన కథాంశముల మొదలెట్టి దనిన ॥ 40

వేడికోలు సంపూర్ణం

# శ్రీరామహృదయం

ధారుణి భారమున్మలుపదైవతబృందము వేడజిన్మయుం
డై, రఘువంశీవారిధి హిమాంశుడునై, నరుడౌచు, దైత్యసం
హారమొనర్చి పాపహరమైన యశంబు జగాననిల్పుచున్
జేరెను బ్రహ్మ యెవ్వడతనిన్ ధరణీతన యేశుగొల్చెదన్ 41

మాయనుమీరియున్, స్వవశమాయనుజేరిసమస్తలోకముల్
సేయగ, నిల్పగా బొలియ జేయనిమిత్తము కేవలము, మో
దాయతనమ్ము చిన్మయ మాహార్యము శంకర గేయమున్, ముని
ధ్యేయము జానకీ సహిత తేజము నౌరఘునాధుగొల్చెదన్ 42

మహిత సర్వపురాణ సమ్మత భవాబ్ధి
నావనధ్యాత్మ రామాయణమ్ము, శ్రవణ
పఠనముల నెవ్వరొనరింత్రో ! వారు కలుష
దూరులై శ్రీరమణుహరి జేరగలరు 43

ఎవడు భవబంధ ముక్తినపేక్షసేయు
నతడు పఠియింపవలయు, నధ్యాత్మచరిత
యెవడు, దానికి నిత్యము చెవి యొసంగు
వానికగునొ సహస్రాఘదాన ఫలము 44

చంద్రశేఖర హిమశైల సంభవమ్మ
రామచంద్ర పయోధి సంక్రాంతమునయి
యలరునధ్యాత్మ రామాయణాఖ్య గంగ
మూడు జగముల బావనముగ నొనర్చు 45

భవుడొకనాడు నంది ముఖభక్తులు భక్తి భజింపరాజ తా
ద్రి విమల సౌధరత్న గణదీప్త మహాసనమందు బద్మ సం
భవముఖ నిర్జరుల్ వివిధ భంగుల సంస్తుతి సేయనొప్పుచో
శివ, నిజనాథుతో బలికె, క్షీరమదూపవవాక్య పద్ధతిన్ 46

దేవా ! తావక పాదపద్మముల భక్తింజిత్త మందుంచి నీ
సేవల్సేయు జనుం గృపామధురదృష్టింగాంచి రక్షింతు నీ
దేవిన్, దాసిని నైన నన్ను గడు ప్రీతింగాంచినా సందియం
బీవేళన్ దొలగింప గాదగదొ ? సర్వేశా ! దయావారిధీ॥ 47

సర్వజ్ఞుండవు సర్వసాక్షివి, జగత్సౌభాగ్య సంధాతవున్
గర్వాంధోద్ధత దుష్ట తత్త్రిపుర విఖ్యాతాసురధ్వంస, కృ
ద్దోర్వీర్యుండవు, నేనెటుల్ తెలియనేర్తున్ దృత్త్వభావమ్ము, నో
శర్వా ! రాముని తత్త్వముం సర్వాత్మ దృక్కుంకరా ! 48

భక్తి వైరాగ్య విజ్ఞాన భరితమైన
జ్ఞానమొకముక్తి సాధన మౌనుగాని
దాని తెలియుట కష్ట సాధ్యమ్మ గాఢ
రామభక్తి యె భవసముద్రమ్ము నౌక
తత్స్వరూపమ్మ దెలుపు, నాథా ! మహేశ ! 49

ఆతడు సనాతనుడు నీవు నట్టివాడ
వగుట దత్తత్వమెఱిగింపదగుదు వీవ
వెలదినయ్యును, నీకృప కలిమి గొంత
దెలియుదును, దాని నాకాన తిమ్ము, దేవ ! 50

అడిగెద నిన్ను వేఱొక రహస్యమ్ముమున్నుగ దెల్పుమార్య ! రా
ముడు, పరతత్త్వ మూర్తి, భవమోక్షణదాయి, తదీయ భక్తియే
పుడమినిగల్గుసాధనము, ముక్తి కటంచు ప్రసిద్ధమైన, నా
పడసిన సంశయమ్ము, మదివాయగ జేయగరాదొ ? శంకరా ! 51

కేవలు డాద్యుండును, మా
యావృతుడగుణుండు రాముడని యోగులు సం
భావించి సతత మాతని
సేవించుచు బరమ పదము చెందుదురుగదా ! 52

ఓ నాథా ! పరముండు రాముడది యోమో నైజమాయావృతిన్
దా, నజ్ఞాని విధాన నిర్గతని జాత్మజ్ఞానుడై మూఢు చం
దానన్, బోధితుడౌచునే, తెలియు దత్త్వంబంచుశంకింతుర
జ్ఞానుల్, కొందరు, మన్మనో గతము దత్సందేహముందీర్పవే ! 53

మరియు, బ్రాకృతుమాడ్కి రామవిభుడే మొ !
పత్నికై విలపించి తాపము, నొందె
నాతడాత్మ జ్ఞుడైన నీరీతి యేల
యనుచుగొందరు శంకింతురటులగాదె ! 54

అట్టు లతడజ్ఞుడైనచో నఖిలలోక
మతని సేవింపనేటికి ? నవని దమకు
దుల్యులైనట్టివారు సంస్తుతులు సేయ
బూనుటేటికి ? దెలుపంగదేనిజమ్ము ! 55

నాయీ సందియమున్మది
బాయగ జేయగదె ! దేవ ! పావనగంగా
తోయసమతావక వచ
శ్శ్రీయుక్తిందొలగు, శేముషీ కల్మషముల్ 56

అనవిని, శంకరుండు, వినయాన్వితమౌ, తన యాలిగాంచి, యో
వనజదళాక్షి, నీవలె, నెవండిటు ప్రశ్నముసేయలేదు, నీ
జనికడుధన్యమయ్యెగద ! శాశ్వత తత్పరమాత్మ భక్తవై
ఘనమగు రామతత్త్వ మెఱుగన్వినగోరితివో తలోదరీ ! 57

ఏ వారడుగని ప్రశ్నం
బీవిటుసేసితివి లెస్సయెఱిగించెద, సీ
తావిభునకు గేల్మోడిచి
దేవీ ! తద్విధమువినగదే ! నమ్మికమై 58

ప్రకృతి కంటె బరుండు, కేవలు, డనాది
యైన పురుషోత్తముడె, స్వమాయ యగుజగమ్ము
నఖిలము, సృజించి, యాకసమట్లులోన
వెలుపలను, నిండి ఎల్లచోటులవసించు. 59

అటు నిగూఢాత్ముడై స్వమాయయె జగమ్ము
నఖిలము సృజింపదాసాక్షీ యగుచునుండు
స్వీయ మాయావృతుండయి యీ యశేష
జగమునకు దన కర్తృత సంతరించు
సర్వలోకము లాతని సన్నిధి, ని
రంతము చుట్టు సూదంటురాయి నినుము
భంగి దిరుగుచు మంటగానంగలేక
తగులముల జిక్కి మనుజుండు పొగులుచుండు 60

మీరిన తమ యజ్ఞతను, స
మారోపింతురు నిరస్తమాయుడయిన యా
శ్రీరామునందు గర్తృత
వారు భవాంభోది గూలబడు చుండ్రు, శివా! 61

మఱియు వారు సుతాది సంసక్తి దేహ
కర్మసంబద్ధులై చిత్తగతుని రాము
గాంచ జాలరు కంఠస్త కాంచనమయ
భూషణము చూడ జాలని పురుషునట్లు ॥ 62

అంధకారమునకు రవియందు మాడ్కి
నిర్మల జ్ఞాన ఘనుడు, జ్యోతర్మయుండు
నై, పరాత్పరుడై, బ్రహ్మమైన రామునం
ద విద్యకు దావెట్టులగు? భవాని! 63

నష్ట దర్శనుడై భ్రాంత దృష్టియైన
వానికి గృహాది వస్తు సంభ్రాంతి తోచు
కరణి, దేహేంద్రి యాదిక కర్తృ కార్య
ములు, పరము నందు గనుపడుమూఢమతికి 64

సత్ప్రకాశాత్మ్మడైన భాస్కరుని కవ్య
భి చరితమ్ముగ రేబవళ్ళు చనునట్లు
జ్ఞాన మజ్ఞాన మవ్యభి చరితములగు
విమల చిద్ఘనుడౌ రామ విభుని యెడను 65

అజ్ఞాన సాక్షియై విమ
ల జ్ఞానానంద రూప లక్షణ విభుడ
ప్రజ్ఞాశ్రయుడయ్యు దమో
రాజ్ఞి రథీను డగునే? పరాత్పరుడార్యా! 66

సీతా రఘురామ మరు
జ్జాతుల వాదమ్ము, ముక్తిసాధనము, రహ
స్యాతి రహస్యము దుర్లభ
మై తగు నద్దాని వినుతు:, నబలా! వినుమా! 67

మును రామాయణమందు దెల్పబడె రాముండా, దశగ్రీవు, దు
ర్దనుజంగూల్చ, సురాళి వేడుటయు నార క్షో విభున్, దారనం
దన మిత్రాదులతో వధించి, తదయోధ్యం సుగ్రీవ ల
క్ష్మణ సీతాయుతుడై మహోదయ తరాజ్యమ్మేలు నప్పట్టునన్॥ 68

ఆర్యున్ మేరు నగోపమ
ధైర్యున్, దేజోవినిర్జిత సహస్రమహ
స్సూర్యున్, గృత సకలా మర
కార్యున్ బవమాన సూనుగని తన సతితో॥ 69

ఓ తన్వీ! యీతని ఋణ
మే తీరున దీర్పగలమొ, యెఱుగనితడు, సం
జాత జ్ఞానా పేక్షుం
డై తదితరమీది తలపడది తెల్పగదే ! 70

నా విని జానకమ్మ నిజనాధుని తో నిటువల్కెనో జగ
త్పావన నామ ! రామ ! నను బావని కిన్ భవదీయ తత్త్వమెం
తే వినిపింపుమంటి రది దివ్యమగమ్య, మనన్యసాధ్యమే
నే విధి దెల్ప నేర్తు? భవదిచ్ఛకు వారు వచింప నేర్తునా? 71

ఓయీ ! సామీరీ ! నీ
కాయథ్యాత్మ మెఱిగింపుమనె, విభుడది, య
జ్ఞేయమటులైన దెల్పుట
కై యొట్టితి దన్మహాత్మ్మకరున కలిమిమై 72

అతడు సచ్చిదానందుడు నద్వయుండు
నాత్మ్మడును, స్వప్రకాశనిరంజనుండు
రాముడానందమయుడైన బ్రహ్మ్మమ యగు
నగుటదేనికి గర్త గాడమల చరిత ! 73

సర్వోపాధి విముక్తము
సర్వ వ్యాపియునకల్మ్మషగోచరమున్
నిర్వికృతి, శాంతి, సతా
ధూర్వహము, తదాకృతియని తొలిపలుకులనున్ 74

# గీతమాలిక

ఏనుమూల ప్రకృతి నౌచుసృష్టిపాల
నాంతకారిణినై రామునండనుండి
జాగరూకతమై, సర్వజగములునుప
నదె సమారోపిత మురామునందు, వత్స
ఆ అమోధ్యను, రఘువంశమందు బుట్టి
యాకుశిక సూను మఖరక్షనాచరించి
పిమ్మట నహల్యకైన శాపమ్మువాపి
శంకరుని చాప భంగ మెసంగ జేసి
కడక, నాకేలు వట్టి భార్గవుని గెలిచి
యావలనయోధ్యలో నన్ను నాదరించి
వాసమొనరించి ద్వాదశాబ్దములు పిదప
దండకారణ్య గమనము దద్వి రోధ
వధములొనరించి మారీచు వధ మొనర్చి
మాయ జానకి నడవి గోల్పోయి, పిదప
రావణునెదిర్చి, మడియు విరాజు నేలి
యావల గబంధ శబరుల నాదరించి

రవి తనయు తోడి మైత్రి, యింద్ర సుత వధము
చేసి లక్ష్మణుతో గూడి సీత వెదకి
తన్మహా వార్ధిసేతు బంధనము నొనర్చి
లంక నరికట్టి, రాక్షసులను జయించి
రావణ సపుత్ర మిత్రముగా వధించి
తదనుజ విభీషణునకు దద్రాజ్యమొసగి
పుష్పకం చెక్కి నాతోడ బురము మరల
జేరి సామ్రాజ్య పట్టాభి షిక్తుడగుట
మున్నుగలిగిన కృత్యములన్ని, నేన
కడగి చేసితినది యెఱుంగక విమతులు
రాముడె యొనర్చె ననెడి విభ్రాంతి నొంది
యాపరము నెడ గర్తృతా రోపణము నొ
నర్చుట తదజ్ఞతమె కారణమని తెలియు
కనగ నఖిలాత్ముడై నిర్వికారుడైన
రామునకు గమనాది కార్యములు గలుగ
వతడు నడువడు, నిలువ బోడార్తి గొనడు
దేని గోరడు విడువ డెద్దాని జేయ
డాతడానంద మూర్తియు నచలుడు, పరి
ణామరహితుడు, లోకాభి రామమూర్తి
అతడు మాయా గుణాద్యనుగతుడువోలె
దోచునని దిల్పు జనక జోక్తులను వినుచు
దా బలికి రాముడ వ్వాయు తనయు జేర్చి
వినుము తత్వము వాయునందన వచింతు
సావధాన మనస్కుడ వగుము, వత్స ! ॥ 75

ఆత్మయనియు, ననాత్మ పరాత్మలనియు
దత్త్వము నభమ్మువలె త్రివిధయి యలరు
వీనికి మహత్తరమ్మగు బేధమెసగు
వాని నెఱిగించెదను విను వాయుతనయ ! ॥ 76

కన జలాశయగత మహా కాశమొకటి
యాగతి నెతదవచ్ఛిన్న మైనదొకటి
యట్టులె ప్రతిబింబించి తాహ్వాయమునొకటి
నభము త్రివిధములగుచు గానబడువత్స! ॥ 77

## గీతమాలిక

బుద్ధ్యవచ్ఛిన్న మొకటి సంపూర్ణ మెకటి
యటులె, మాభాసమనగ నొక్కటియు గలిసి
తనరు త్రైవిధ్యమంది చైతన్య మనఘ!
బింబ భూత మాభాసమన్ పేర బరగు
వికృతి విచ్ఛేదములు లోక వెల్గుసాక్షి
యెడను, గర్తృత్వ జీవత్వములు తలంప
బడి, నన్వృత బుద్ధియే తదాభాస మగుచు
నలరునదె, యవిద్యా కార్యమగునటందు
నరయ విచ్ఛిత్తి లేని బ్రహ్మమున కటులు
పొడమె విచ్ఛేదము వికల్పబుద్ధి వలన
బుద్ధ్య విఛిన్న సాభాసమూర్తి యైన
యా అహంకారమునకు బూర్ణాత్మ తోడ
దత్త్వమస్యాది వాక్యబోధము వలన
నైక్య భావ మెపుడు గల్గు, నపుడె మాత్మ
ముల కగును దన్మహావాక్యమున, నబేధ
మపుడె తద విద్య స్వీయ కార్యముల తోడ
బొలియునని తెలియుము వాయుపుత్ర! వత్స!
దీని తెలిసిన భక్తుడు జ్ఞాని యగుచు
నన్ను వైముఖ్యమున జూచు నరుడు శాస్త్ర
గర్తముల బడి మద్భక్తి గలుగకునికి
జ్ఞానమొందడు, లేదు, మోక్షమ్ము వాని
కెన్ని జన్మములకు నేనె యిది నిజమ్ము
ఇది రహస్యము మరియు నాహృదయ మిదియె
దీనినీ కేను వచియించితిని స్వయముగ
నైంద్రమగు రాజ్యమును మించునట్టి దీని
శఠుని కేనాటికైన నొసంగ రాదు ॥ 78

అని రామచంద్రుడు మరు
తనయునకుం దెల్పి నట్టి తత్వ వచన, మే
వినిపించితి గుహ్యము, పా
వనమౌ, శ్రీరామ హృదయ పద్ధతి నబలా! 79

అని యాశంభుడు: పల్కెవెండియు రహస్యం బై మహా పాప, శో
ధనమై రామవిభూక్తమై, సకల వేదాంతోక్తి సంక్షేపమై
చనునిద్దాని, నెవండు భక్తి మెయి నిచ్చల్కర్ణ యుగ్మమ్మునం
దునుచున్ నాల్కను నిల్పు వానికగు సద్యోముక్తి చంద్రాననా! 80

పరభార్యారతుడున్, బర స్వహరుడున్, బ్రహ్మఘ్నుడున్, భ్రష్టుడున్
గురుమాతా, పితృ సంహృతి ప్రవణుడున్, గోహంతయున్, స్వర్ణత
స్కరుడున్, మున్నగు పాపులెల్లరును వేడ్కన్ దీని విన్నం, బఠిం
తురయేని, న్నిజపాపములే, తొలగ దోడ్తోముక్తి బ్రాపింపరో! 81

ఈ రామ హృదయ విధమె
వ్వారలు విని భక్తి మీర బఠియింతురో? వా
రా రాము కరుణచే ద
త్సారూప్యముగాంతురిది: నిజమ్ము: భవానీ! 82

ఇతి బాలకాండ మొదటి సర్గ సంపూర్ణం



# అధ్యాత్మ రామాయణం

## బాలకాండ - 2 వ సర్గ

అని శివుడు తెలుపగ, జగ
జ్జనని యగు భవాని లోక శంకర! నే ధ
న్యనయితి, గృతార్ధ వైభవ
దనుకంపా పాత్ర నైతి నందితి, ముదమున్॥ 83

దేవ! మహానుభావ! భవదీయ ముఖాబ్జ వినిర్గళ మధు
స్రావ వచోధునీ విగత సంశయ కల్మష నైతి వెండి యుం
బావన తత్కథాసుధా సమగ్రముగా జవిచూచు కోర్కి, నా
కావహిలెన్, ననుంగరుణ నారసి, రామ చరిత్ర తెల్పు మీ॥ 84

అనవిని శంకరుండు: వినుమా! యను మానము మాను, యోయుమా!
విని చెద బాపహారియు, బవిత్రము: ముక్తిద మాయురాది, సా
ధనము: రఘూద్వహోక్తము: నితాంత భయార్త జనావనమ్మునం
దనధనదాయి, రామచరితమ్ము సమస్తము సావధానవై॥ 85

మును భూదేవి, దశాననాదుల భరమ్మున్ మోవగాలేక, గో
తనువుందాలిచి, వాసవాద్యమర సంతానమ్ము దోడ్కొంచు
హ్మనుబ్రార్థింపగ, సత్యలోకమున, కార్తాలాపదీనాస్యయై
చని, యాత్మార్తి వచింప, నల్వయు, మనోజ్ఞానమ్ముచే నంతయున్ 86

కనుగొని యింద్రాదులతో
వనధి తటము జేరి, వేదవచన సరణి, న
వ్వన జాతా సనుడిటులా
ఘన వర్ణుని హిరినుతించెగడు భక్తి మెయిన్॥ 87

సకలము నీ యుందుండును
సకలము నందుండె దీవు, సర్వ జ్ఞాడవీ
వుకమల నేత్రా! యీ భూ
మికి గల్గిన యార్తి దీర్పు మీ యని వేడన్ 88

హరి,గాననయ్యే నలువకు
గరుణాకరుడై ప్రదీప్త కరదశ శత భా
స్కర విస్ఫురణుండై ప్రా
గ్ధరి దంతరగత తమః ప్రకాండము తొలగన్ 89

ఇంద్ర నీలనిభాంగ మంద స్మితాయుతాస్య కమల సుందర లోచనములవాడు
హార కిరీట కేయూర కుండల కటకాది విభ్రాజదేహంబువాడు
శ్రీవత్స కౌస్తుభ శ్రీయుత ధృత గదాశంఖ చక్రాంభోజసరమువాడు
కనక చేల సువర్ణ ఘన యజ్ఞ సూత్రదేహమువాడు గరుడ వాహనము వాడు

భూరమా విలసత్పార్శ్వ భూమి వాడు
కరుణ సరసిజ భవముఖ సురలకట్టు
లెదుట సాక్షాత్కరింప గద్గదిత హర్ష
బాష్పుడై నల్వ, యిట్లని ప్రస్తుతించె ॥ 90

దేహ బుద్ధీంద్రియాత్మల దేవ నేను
నతుడనయ్యెద గర్మబంధంబు నుండి
తప్పికొన, యోగులే నీ పథమ్ము తెలియ
నాత్మదలంచు చుందురో! యట్టి నీకు! 91

త్రిగుణాత్మిక యగు, మాయయె
జగముల సృజియించి పెంచి సమయించు చునుం
డగ నానందము నొందెదు
జగములతో లేదు నీకు సంబంధ మజా ! 92

దానాధ్యయ నాదులచే
గానబడని శుద్ధి దుష్ట కర్మలకు, భవ
ద్ధ్యాన పద భక్తి ని ద్వదీ
యనూన యశోను రక్తి నగు గాదె ! అజా ! 93

జ్ఞానులు గొలిచెదర పరో
క్షాను భవము నొందన స్మదాదులు మౌనుల్
ధ్యానింతుము నిను స్వార్థ
మ్ము నీ పద నీరజమ్ములగ పడె దేవా ! 94

తావక వర పూజాసం
భావిత నిర్మాల్య తులసి మాలికతో, స్ప
ర్ధావహ యై సవతిగ శ్రీ
దేవి భవద్వత్సము న నధిష్ఠించు బ్రభూ॥ 95

తావక భక్తులం గనెదు దద్ర మమించిన ప్రీతిగాన, నీ
సేవయె సార వేదులు, విశిష్టులు, శ్రేయు దురంతెకాదు, దు
ర్భావ భవామయమ్ము నడపందగు భేషజ మద్ది మౌట ద్వ
త్పావన పాద భక్తియె సతమ్ము మదంతర మందు నిల్పవే! 96

అనివేడగ హరిపరమే
ష్ఠిని గనుగొని ప్రీతిమయి వచించె, సరసిజా
సనముఖసురలారా! నా
పని యేమో! తెల్పుడనగ బల్కెనతడిటుల్ 97

దేవా! యీ భూదేవిం
గావం గదె సకల విశ్వ కళ్యాణము, నీ
చే విహితమయ్యెడి గదా!
రావణ కృతమైన భూభార మడచినచో॥ 98

వినుమోదేవ! పులస్త్య పుత్రుడు, తపో వీర్యమ్మునన్, నామనం
బునకున్, మెప్పుఘటించె, దుర్ఘట వరమ్ముల్ పెక్కు ప్రాపించి, దు
ర్దనుజుండై యిల రావణాఖ్యను, సురవ్రాతమ్ము నొప్పించెడిన్
మనుజుల్ దక్క, మరెవ్వరాకుమతి జంపం జాలరో చిన్మయా! 99

శచి మొదల్గల దేవ సతులను దనకొప్పగింప వాసవుని బీడింప వచ్చె
వైశ్వానరుని వంటవానిగ గని, వంటయింపుగాదని యీసడింప జొచ్చె
సతుల, దువ్వెనలకై, పితృపతిన్ దద్వాహ శృంగముల్ దేర శిక్షించె పుచ్చె
వరుణ దేవుని నాల్గు వాకిళ్ళ దడిపెడి సేవకు జేయ నిర్జించి దెచ్చె
తనదు భృత్యుని గా నైఋతిని విధించె
ననిలుడు సుఖమ్ముగా వీవనాత్మనుంచె
నలకుబేరుని పుష్పక మాక్రమించె
శంకరాది విహార దేశముగ నెంచె 100

వాని బాధలు తెల్పగ రాని యయ్యె!
వాని వంతలు మిక్కిలి కానివయ్యె!
వాని బుద్ధి జగానకు హాని యయ్యె
గోరి వర మిచ్చుటయె నాదు నేరమయ్యె ॥ 101

అనుటయునా రమేశుడు మహాద్యుతి నారసివారి తోడ, ని
ట్లనె సురలార! కశ్యపమహామును; నన్ను వరమ్ము గోరె నం
దనుడవుగమ్మటం చతని దన్ప; నయోధ్యను గోసలాత్మ జా
తనయత గాంతు; దద్దశరథ క్షితిపాలుని కోర్కి తీర్పగన్ 102

ఆకర్ణ్యపుడే దశరథ
భూకాంతుండగుచు బుడమి బుట్టుటచే, భూ
లోకమున జనింతును, మను
జాకృతి మీ కోర్కితీరనగు నవ్వేళన్॥ 103

మరియొకటి తెల్పెదను
సురవరులారా! నేను నాల్గు భాగములై సో
దర లక్ష్మణ శత్రుఘ్నులు
భరతుడు నా జనకు నితర పత్నులకగుదున్ 104

యోగ మాయయై సీతయె యోగిజనకు
నింట జనియించు నామెతో నెనసి యెల్ల
కోర్కులను దీర్పగలను మీకు సురలార!
సంశయము వీడి చనుడు మీ సద్మములకు 105

అని సర్వేశ్వరుడాన తిచ్చుటయు బద్మాసీనుడవ్వేల్పులన్
గని, 'ఓ నిర్జరులార! శ్రీ ధవుడు జన్మంబందు దామర్త్యుడై
ఘనమౌ తద్రఘువంశమందపుడు వేడ్కన్ వానరాకారులై
జనియింపందగు, దత్సహాయులయి, కాంక్షల్ దీరుమీకయ్యెడన్॥ 106

అని నలువ నిర్జరులతో
ననుచు ధరణి నూఅపించి యతడు స్వభువన
మ్మును జేరిన, వానరులై
జనియించిరి, సురలు ప్రబల సత్వాఢ్యులుగన్ ॥ 107

వారలు గిరి తుల్య తనూ
ధారులు తరు పర్వతాయుధ మహారణ సం
భారులయిరి, శాఖా సం
చారులగుచు హరికి దోడు సల్పెదు వేడ్కన్. 108

౨వ సర్గ సంపూర్ణం

# నిర్వచన అధ్యాత్మ రామాయణం

## బాలకాండ - 3వ సర్గ

దేవీ ! యావలికథవిన
వే ! వీరుడు సర్వలోక విశ్రుతుడు, నయో
ధ్యావిభుడై దశ రధుడను
భూవల్ల భుడలరు సత్యభూషితుడగుచున్
ఆతడన పత్యతాసం
భూతమనోవేదనా సముద్విగ్నుండై
చేతోగతచింతల ; నీ
రీతిం, దలపోసె, శుక్పరీతాత్మండై
పెద్ద కాలము చనె, లేరు బిడ్డలింట
నిహపరసుఖమ్ములకు నౌదురిలతనయులు
వారి మూలాన మరికొంత బంధుసమితి
గలుగు నద్దాన భవసుఖంబులును బెరుగు 111

తనకు గలిగిన బంధుజాతము, సహృదయ
మైన వారికతముననగు సుఖమ్మ
భవమహాటవిలో విడివడిన దేహ
తరువు ; విపద నిలాహతి ధర నొరగదా ? 112

పుణ్యహీనుడె భవ మహారణ్యగతుడు
మనుజుడిల సంగహీనత జని దొలంగు
గాని భవ సౌఖ్య, సంగతి మానితి నొకొ ?
యిందుగర్తవ్య మెదియొ ? నాకెఱుగరాదు ॥ 113

అనుచు బెనుగాలిచే నిటునటుకదలెడి
తరువుపోల్కి, జలించి చింతల·మునింగి
నిశ్చయతటమ్ము, జేరగా నేరకుండ
జేరె, నచ్చోటి కపుడె ; వశిష్ఠమౌని ॥ 114

స్వకులాచార్య వసిష్ఠునింగని నమస్కారంబుగావించి త
త్సక లక్ష్మాపతియౌనజాత్మజుడు, నిచ్చల్ మోహమేపార సా
మి ! కళత్రత్రయమీ ధరామప్పితో మెప్పుల్ ఘటింపన్, మహా
ధిక సౌఖ్యంబుల నొందుచుండియును బ్రీతింగాంచకుంటింగటా ! 115

సుతులు లేనట్టి వారికి గతులు లేమి
నెన్నియున్నను సౌఖ్యమింతేని గలుగ
దందులకు నేన సాక్షినాయనుభవమిది
పుత్రలాభము నేనెట్లు ? వొందగలను ? 116



అఖిల లక్షణ లక్షితులైన సుతులు
గలుగకుండిన రాజ్య సౌఖ్యమదియేల ?
కలిమి సకలము నాకు దుఃఖమునకెయగు
శిష్య జింతాబ్ధి తీరముంజేర్పు మనుడు. 117

గురుడిటు పల్కెనోయి ! వినుకోవిదులెన్నడు నిట్టి చింతచెం
దరు పరితాప మందనగునా ? సుగుణాకర ! నీకులోక, పా
లుర బురుడించు పుత్రులు వెలుంగుదురింటను దీప్తులౌచు, న
ల్వురు, సుగుణాఢ్యు లౌట నిక లోపములుండవు ; భూవరాగ్రణి ! 118

దానికుపాయంబొక్కటి
నేనుడివెద ; మౌని ఋశ్య శృంగునిపుడె, శాం
తానీతుజేసి, యాతని
చేనొక యధ్వరము నీవు చేయవలె నృపా ! 119

అది విని దశరథుడు, ముదా
స్పదమగుతద్వచన సరణి శాంతకుడివి, తే
గదె ! శాంత నీమగని, సం
పదకు నిదానమ్ము లాడుసడుచులుగారొ ? 120

అని పలికి ఋశ్య శృంగుని
గొని మంత్రుల హితులమునుల గూర్చి కొని మఖ
మ్మును సుతకామేష్టిని దా
నొనరింప దొడంగె, దశరథోర్వీపతియున్ ॥ 121

ఆయధ్వరమ్మునకు, సుర
లాయా మౌనులును, బహుసహస్రాధిక సం
ఖ్యాయుత భూదేవులు, నా
ప్యాయనముగ జూడ వచ్చిరతి సంప్రీతిన్॥ 122

వడ్డించునట్టి బాపల మొగంబులగంచువింతగా లొట్టలు వేయువారు
తొలుత బెట్టిన భక్ష్యములవన్నిటిని మూరుకొని కడా సంప్రీతిగులుకువారు
వేడిపాయసమునావిరి లేవ నూదుచుగొంచు వ్రేళులు చప్పరించువారు
కడుపునిండభుజించి గట్టినిత్రేచుచునరుగుల నటునిటుదొరలువారు
పంచెకట్లు సడల్చి సుఖించువారు
దశరథు నుదార శీలతం దలచువారు
నగుచు విప్రులు గళదఘ్నముగ భుజించి
పుత్రకామేష్టి మహిమను బొగడిరిటులు 123

సుతులులేనట్టివారు భూపతులు ధరణి
నెందఱెందరు లేరు ? వారందఱకును
గలిగెనే ? యిట్టి బుద్ధియిక్ష్వాకు వంశ
భవులె యిహపరసౌఖ్యముల్ పడయువారు 124

బ్రాహ్మణుల, దశరథుడు దైవములు గని
వారి సంతుష్టి కొఱకె, యధ్వరమొనర్చె
నతని సతులు, భుజించు పాయసము బోలి
పుట్టుదురు గాక మధురులౌ పుత్రులనిరి. 125

పూనికను వహ్ని యాహూయమానుడగుచు
బ్రజ్వల ప్రభ బాయస పాత్రమొకటి
కరమునం బూని దశరథక్ష్మావరుగని
దీనిగొనుమని చేతి కందించి పలికె 126

పుత్రీయము కనకల స
త్పాత్రస్థము దేవనిర్మితము బాయసమున్
ధాత్రీ వర గొను పరముడె
పుత్రత్వము దాల్చి నీకు బొడము నిజముగన్ 127

అని పాయసపాత్రమ్మా
తనికిడి, యంతర్ధిగొనె, నతండప్పుడు, త
న్మునులకు నతులిడి, దశరథ
జనపాలుడు మౌని వరుల సమ్మతి గొలుచున్ 128

పరమామోదమెలర్ప జేత గొని త త్పాత్ర స్థమైనట్టి స
త్పర మాన్నంబిరు పాళ్ళుగా జలిపి, యో భాగము, గౌసల్య, కా
దర పూర్వమ్ముగనిచ్చి, యానృపతి యర్ధంబిచ్చె నాకైక, కా
తరుణుల్, స్వీయములందొసంగిరి, సుమిత్రా దేవి కర్థాంశముల్ 129

అటుపాయసములగొని చి
మ్మటి మై వారి ర్వురును, సుమిత్రాసతి, యా
దట దమ యంశములను, ద్రా
వుట గర్భపు జిహ్నములు ప్రభూతములయ్యెన్ 130

నిర్భర తేజో విలస
ద్గర్భములను దాల్చి వారు గనిరి, సుతులనా
గర్భశ్రీమంతులను ద
దర్భకులా సూతికా గృహములలరింపన్ 131

దశమమాసము రాగ జైత్ర సిత పక్ష
నవమి గర్కట లగ్న పునర్వ సువున
గ్రహము లైదు, తదుచ్చస్థగతి వహింప
బూషడల మేషమును జేర బుష్ప వృష్టి
యలర లోకాధిపతి పరమాత్మ శాశ్వ
తుండు దశరథు ప్రథమ పుత్రుడుగ వెలసె॥ 132

అసితోత్పల శ్యామలాంగుడు కాంచన తుల్యాంబరుండు, చతుర్భుజుండు
నళిన దళారుణ నయనాంతుడు, సువర్ణమయల సత్కుండల మండితుండు
రవి సహస్ర ప్రభారంజితుడు కిరీటి కుంచిత మధురాల కాంచి తుండు
శంఖగదా పద్మ చక్రాయుధుడు వనమాలావిరాజి విశాల వక్షు
డై మనస్థ దయాఖ్య సుధామయరుచి
సూచక స్మిత మధురాస్య శోభి విష్ణు
డురు కృపారస పూర్ణ నేత్రో త్పలుండు
నఖిల భూషాంచితుండు ప్రత్యక్షమయ్యె ॥ 133

పరమాత్ముండగు తద్వి భు
నరయుచు గౌసల్య విస్మయాకులయై హ
ర్ష రసాశ్రు పూర్ణయై, త
న్మార హరునకు బ్రాంజలి యయి మ్రొక్కి యిటులనెన్. 134

పరమాత్మ! అనంత! గదా
ధర! చక్రాబ్జధర! అచ్యుతా! పరిపూర్ణా!
పురుషోత్తమ! నీకు నమ
స్కరణములొనరింతు దేవ సన్నుత! దేవా! 135

జ్ఞానైక రూపుగన వా
జ్మాన సగోచరుని గా సమర్థ శ్రుతి వి
జ్ఞానులు దెల్పు దురో దే
వా! నిను సత్యా స్వరూపు వరదు బొగెడదన్ 136

ఈ విశ్వము మాయం గొని
నీవే సృజనావనములు నిర్మూలనమున్
గావింతువు సత్వాది గు
ణా వృత్తి ధుర్యుడవు, నిర్మలాత్ముడవు హరీ ! 137

కర్తవలె గానిపించి యుగర్త గావు
శ్రోతవలెగాన పడియును శ్రోతగావు
గంతవలె జూడబడియును గంతగావు
ద్రష్టవలె దోచుచుండియుద్రష్టగావు
సకల భూతములందును సముడవగుచు
నుండియు దదజ్ఞులకగోచరుండవగుదు
మానసప్రాణశూన్యుడవై నెగడియు
ధీనిధుల కీవువ్యక్తమైగానబడెదు ॥ 138

ఆద్య ! బ్రహ్మాండములు పరమాణువులుగ
నీదు జఠరమునందుగాన్పింపదగియు
నల్పమౌనాదు జఠరమునందు నీవ
డంగియుండుట లోక విడంబనమగు॥ 139

భక్తజనులెడ నీకెంతో పారవశ్య
ముండురఘువర ! నేడుగన్గొంటి నీదు
మాయచే భవవారిధిమగ్న నగుచు
బతిసుతధనా లయాది విభ్రాంత నయ్యు
నమలభవదంఘ్రియుగము నేడరసిమంటి ॥ 140

ఈ నీరూపమునుపు, నా
మానసమున సతము, మాయమాన్పింపుము, వి
శ్వానూన విమోహిని యిది
దీని నలౌక్యభవదాకృతిన్మలు పుమికన్ ॥ 141

చూపుము బాల్యోచిత స
ద్రూపమ్ము సుకోమలమ్ము, తోషకరమది
చ్చా పాద్యాలింగన సం
లాపములం, జుంబనాదుల, నొనర్ప, హరీ ! 142

అని కౌసల్య, నిజేచ్ఛ తెల్పికొనగా, నాలించి నీకోర్కి, కా
దన, నట్లే యగుగాక, మున్నొకట బ్రహ్మాదుల్ ఖలున్ రావణున్
దునుమన్, భూభారమున్మరల్పగడు నన్ను న్వేడిరట్లే భవ
త్తనయత్వమ్ము నొసంగ గోరితిరిగాదా ! నీవు నీ భర్తయున్ 143

అమ్మా ! వినుత్వత్పుత్ర
త్వమ్ము నొసగి దశరథాఖ్య ధాత్రీశునకున్
నెమ్మి ఘటింపగ భూలో
కమ్మున బుట్టితిని మీనయగారమున దమిన్ 144

అని రాఘవుండు తెల్పం
గని పరమానంద మొంది, కౌసల్య, దరి
ద్రునకు నిధి యబ్బినటు త
జ్జన నీత్వముగాంచి మిగుల సంతసపడియెన్ 145

పావనీ ! నీదు పూర్వతపః ఫలమ్ము
వలన గన్పడె నాదు రూపమ్ము నీ క
ధన్య దుర్లభమైన నాదర్శనమ్ము
మోక్షమునకౌ, నటంచు ; నమ్మ జనయిత్రి ॥ 146

మనకు నిపుడైన భవ్య సంవాదసరణి
వినిన పుణ్యాత్మకులు చదివిన మహాత్ము
లమలమౌ నాదుసారూప్యమంది యాత్మ
మరణ వేళమదీయ సంస్మరణ గొంద్రు ॥ 147

అని జనని తోడ బల్కి తానపుడె, బాల
భావము వహించి యారామ భద్రుడామె
యెదుట బ్రాకృతునట్టులు మృదుతరముగ
రోదన మొనర్చె, గంభీరరుతి యొసంగ ॥ 148

లీలార్భ కుడయ్యెను హరి
నీలాభుడు విపుల మధుర నేత్రాంబుజుడున్
బాలారుణ సన్నిభుడై
లాలిత సకల హరిదీశ లక్షణుడగుచున్ 149

ఆశుభవార్త ; తద్దశరథావని పాలుడు విన్నయంత నా
వేశము మీర ; మోదము సవిస్తరమై యెసలార, సూతికా
వేశమునన్, గురుండు తన వెంటను, రాగ మనోజ్ఞ రూపు స
ర్వేశు, బరాత్పరుం, దనయు, నెంతయు వేడ్కను గాంచి యంతటన్ 150

గురుడగు వసిష్టు ననుమతి
గరమానందమున, జాతకర్మ, దికమున్
జరిపించి, తన్మహోత్సవ
మురు వైభవము గనొనర్చెనుత్సాహముమై 151

ఆ మీదట, గైకేయీ
రామామణి, భరతనామ బ్రసవించె, సుమి
త్రామహిళ కవలగనియె, మ
హామోదముతో బ్రజాళి యనుమోదింపన్ ॥ 152

ఆనేలటేడు, నిజసం
తానోత్సవ మెల్ల జగమునకు దెలియగ, భూ
దానాదులొనర్చెను, వి
ప్రానీకము పొగడుచున్, శుభాశీస్సు లిడన్ ॥ 153

మునులజ్ఞాన వినాశ
మ్మెనయగ విజ్ఞానగరిమనెవ్వని రూప
మ్మున రమియింతురొ ? తన్నం
దనునకు గురు నాజ్ఞ రామనామ మొసంగెన్ 154

గురు డొసగె రాజ్య భృతిచే
భరతుడు శుభలక్షణములు పడయుటచే ను
ర్వర లక్ష్మణుడని, శత్రుల
హరియించుట శత్రుహంతయను నామములన్ 155

పాయసాంశములను బట్టి దంద్వములయి
రామచంద్రునితో సదాలక్షణుడును
భరతుతో శత్రుహరుడును సరిగ గలిసి
తోడునీడలుగా జరింతురు హితముగ ॥ 156

పిమ్మట, నమ్మహామహుడు, పేర్మిని దల్లికి బాల్య చేష్టలన్
సమ్మదమున్ ఘటించుచు విశాల మనోజ్ఞ సరోజ నేత్రుడై
కమ్మని, ముద్దు, మాటలను గల్గిన యాటల పాటలన్ వివే
కమ్మగ, సంచరించెను, జగమ్మున వారు ముదమ్ము చెందగన్ 157

ఆ లక్ష్మణుతో రాముడు
బాలక్రీడల నొనర్చ బాల్యపడి, డోలాం
దోళన విశేషముల ము
గ్ధాలాపమ్ములను, దల్లి దండ్రుల దనుపున్ 158

భర్మమయాశ్వత్థ పర్ణముక్తా ఫలలలిత విశాల ఫాలమ్మువాని
మణిరత్న కాంచన మధ్య స్తితవ్యాఘ్రనఖ భూషణాత్త కంఠమ్మువాని
సింజాస నమ్మణి మంజీర కటి సూత్రకేయూర భూషణాంకితమువాని
కాంచన మధ్య సంఘటిత సద్రత్నా ర్జునశలాట పృధులకర్ణములవాని
రమ్య సుస్మిత వదనాల్పరదనువాని
నింద్ర నీలోపల ప్రభలెనయువాని
స్వాగ్ర భాగకృతాల్ప నృత్యమ్మువాని
దర్శకానుగతి ప్రమోదమ్మువాని ॥ 159

తనయుని రామునరసి త
జ్జనపాలుడుగోసలాత్మజయు, ముదమందున్
జనకుడు తనయుని, నిజ, భో
జనవేళ బిలుచు మిగుల సంత సమెనయన్ 160

లీలగ రాకుండిన రఘు
బాలునిదే బలుక దల్లి పరుగు లిడియుదే
జాలక సుస్మితమై రా
వేలా? నాముద్దు కూన, యిటురమ్మనుడు న్ ॥ 161

ద్రుత గతియై పర్విడు, త
త్సుతు, జేరంజనియు దశరధుడు జాలడు, సం
స్తుత యోగిమౌని మానస
గతుని, నతని బట్టి కొనగ గలడెవ్వడిలన్ ॥ 162

అక్కరణి, నతడు, తండ్రికి
జిక్కకయు, దనంతదాన చేరినగుచు, బల్
చిక్కని కర్దమ మంటిని
యక్కేలం, గబళమంటి యరుగున్ మరియున్ 163

కోసలరాజపుత్రి రఘుకుంజ రువృద్ధికి బేరటాండ్రకై
చేసిన వాయనమ్ములు విచిత్రములిచ్చు చునుండవారు పే
రాసను వచ్చి, యామెయిడున ప్పములాది పరిగ్రహింపగన్
మాసము, మాసమందు, మణిమండన మండితు జేయురాఘవున్ 164

నెల నెలకు వృద్ధి గొనుచు
న్విల సద్రూపుడగు రామవృద్ధికి, దాన
మ్ముల బెనిచి పొంగు, నక్కో
సల నందన చంద్రుగనిన సంద్రము భంగిన్ ॥ 165

ఒక నాడా రఘురాముడాకలికి దానోర్వంగ లేకంచి, తాం
తికముంజేరుచు నాకు నన్నమిడవే ; నీ ముద్దు బిడ్డండగా
నాకొ ? అమ్మా ! యని మొత్తువెట్టినట్లుగా రోద్విగ్నయై వాని మా
టకు బ్రత్యుత్తర మేమియుంబలుకకుంటం గ్రోధ పూర్ణాత్ముడై 166

ఉట్టిలో నున్న కుండ నొక్కలగుద
నిహతి నంటుంచి తన్నవ సీతముదధి
దుగ్ధముల లక్షణునకు శత్రుఘ్ను భరతు
లకు గ్రమమ్మున నిచ్చి తొలంగె నంత 167

సూదుడది, తల్లి తోడ, ని
వేదించుడు, నతడు, నగుచు వెడలెను, గౌస
ల్యాదేవి కోపఘూర్ణిత
యైదరుమగవారు నల్వురరిగిరి తోడ్తో ॥ 168

తడబడుచు, నామెవడిగా
వెడలి పరువులిడుచు రామవిభుకేల్గోనియున్
నుడి మానియుండ నతడొక
బుడుతని చైవులను దాల్చిబుడిబుడి యేడ్చెన్ 169

వాత్సల్యమ్మున సుగుణ ల
సత్సుతి యగు కోసలాత్మ జాతయువారిన్
స్వోత్సంగమ్మున గౌగిలు
లుత్సాహముతో నొసంగి, యురుకృప మరలున్ 170

రారా ! రాఘవ ! ముద్దుకూన ! యిటురారా ! నీదువెమ్మోము, రా
కారాజీవ విరోధి జూపుముర, నాకన్నయ్య, రారమ్మ, క్రీ
డారామమ్మునకున్, నినుంగొనుచు వేడ్కంబోయి యందున్న శృం
గారంబంతయునీకు జూపెదను, వేగమ్మీవు ; నా చెంతకున్ 171

రారా ! బంగరుకొండా !
రారా ! నాముద్దులయ్య రారా ! కుఱ్ఱా !
రారా ! సూర్యకులాలం
కారా నాతండ్రీ ! నాకు గౌగిలొసగురా ! 172

ఈరీతి సుతులు మోద ప
యోరాశినిముంచి తేల్చుచుండగ, గౌస
ల్యారమణి దశరధుడు సం
సార సుఖోపవన విహృతి సలుపుదురెలమిన్ 173

ఆయెడ జగదానందుం
డై యోగి జ్ఞేయుడయ్యు నాతడు ధరణిన్
మాయామానవ బాలుం
డై యాదంపతుల దనిపె నసురులు బెదరన్ 174

అంతట రామచంద్రముడు, నాభరతుండును, లక్షణుండు వై
ర్యంతకుడున్, గుమార దశనందివశిష్ట కృతోపనీతులై
వింతగ వేదశాస్త్రముల వేగమనేరిచి బాణవిద్య యం
దెంతయు శక్తులైరి జగదేక దనుర్ధరులన్నయెన్నికన్ 175

లీలామను జాకృతులౌ
నాలక్ష్మ శత్రుహంతలను గతులగుచున్
శ్రీలుని రాముని భరతుని
బాల కపాల్య దశనొంది వర్తింతురొగిన్ 176

తురగారోహణ కౌశలంబలరగా దూణీర బాణాసనో
ద్ధరణమ్ముం, బచరించి, బాణహతి, దుర్దాంతాట వీజంతు, సం
హరణమ్ముద్ధతి జేసి లక్ష్మణయుతుండై వ్యాఘ్ర సంఘాతమున్
ధరణీ భర్త కుదండ్రికిందెలుపు, సోత్సాహతి రేకమ్మొసన్ 177

ప్రాతఃకాలమునన్ సు
స్నాతుండై వినయమెనయ నతులొనరించుచున్
మాతా పితలకు బౌర
వ్రాత సకల కార్యముల బ్రవర్తిలగాంచున్ 178

మునులును బంధువులన్వహ
మును దనబంతిని భుజింప ముదమందుచు, ధ
ర్మనికర రహస్యములు తో
విని వానిని శక్తి కొలది వివరించుదమిన్ 179

ఈ పగిదిన్ మనుజాకృతి
యైపరమాత్ముడ, వికారి యయ్యును, రామ
క్ష్మాపతిగా, జగదనుసృతి
బ్రాపించి యొనర్చె మనుజ భాక్కర్మములన్ 180

అధ్యాత్మ రామాయణం 3వ సర్గ సమాప్తం

# నిర్వచన అధ్యాత్మ రామాయణం

## బాలకాండ - 4వ సర్గ

పరమాత్ముడ యోధ్యను, రఘు
వరుడై నిజమాయచే బ్రవర్తిలునని, తా
నెరిగి, కుశిక నందనుడొక
తరివచ్చెను రామ చంద్రుదరిసింపదమిన్ ॥ 181

అమ్ముని వర్యు జూచి వినయమ్మున లేచి, వశిష్ఠుతోడ శ్రీ
ఘమ్మమ్మగ, మౌని దేరజని, రాజవరుండు, సభక్తికమ్ముగా
రమ్మని తోడి తెచ్చి యొకరమ్యకుశాసన మందు నిల్పి, నీ
విమ్మెయి, రాగతమ్మ సెల వీయగదే ముని వార్ధి చంద్రమా ॥ 182

నెమ్మి నెవ్వాని గేహము, మిమ్మువంటి
వారు మెట్టుదు రందు సంపదలు వెలయు
నేగృతార్థుడనైతి, ముని ప్రకాండ !
తావకాగమనము నను ధన్యుజేసె ॥ 183

భవదాగమన నిమిత్తము
వివరింపగ వేడనేల ? విశ్వామిత్రుం
డవుగాదొ ? భావి భాగ్యం
బవువారికె కల్గునది మహత్తర చరితా ! 184

అయిన భవదాస్య నిర్గళ దనుల మధుర
వాక్సుధంగ్రోల నాకొక వాంఛగలదు
ఏమి వలెనొ యెరింగింతు రేనిదాని
దుర్ఘత మయేని నే జేయుదును మునీంద్ర 185

అదివిని యిట్లు గుశికాత్మజుడోనృపచంద్ర, నేను, బ
ర్వదినములందొనర్చెద సురల్ పితృదేవతులు ముదమ్మునొం
దదమి, మఖమ్మ నొకటి, యథావిధి ధానికి, దానవాళిచే
నొదవెడి విఘ్నముల్ చెరుపనోర్చెడి వీరుడొకండు గావలెన్ ॥ 186

ఆరంభించిన తోడనె
కేరి సుబాహుండు, తాటకేయుడు, మఖమున్
జేరి చెరుపవత్తురు. త
ద్వారమునన్ నిల్చి వారి దండింపవలెన్ ॥ 187

సౌమిత్రి సహితుడై శ్రీ
రాముడు రావలయు, యజ్ఞరక్షణమునకై
సామర్థ్యము గలడత, డరి
భీముడు, నీవును నసత్య భీరుడవుగదా ! 188

బాలుడనక గురుతో, నీ
వాలోచించికొని, సందియమునందక, నా
తో లక్ష్మణయుతునిగ, రిపు
జాల నిహంత యగు రామచంద్రుననుపుమీ ॥ 189

ఆమాటల్విని నంతనే, దశరథుండాలోచనాంభోనిధిన్
దామున్కల్ పచరించి, కొంతవడి, జింతందూలుచుం, బల్కె, శ్రీ
రామున్, లక్ష్మణుబంపనాదుమది యోర్వం జాలదోమౌని చం
ద్రా ! మన్నింపుము ; వేయియేడులకు సంతానమ్మునా కబ్బుటన్ ॥ 190

దగ్గర నుంచుకో దగుసుతద్వయమున్ విడజాల వీరికా
పగ్గెల నల్పమయ్యు, బసిపాపలు గారొకొ, యజ్ఞవాటికిన్
నిగ్గులు దేరురక్కసులనేకులు వత్తురు, తద్రణమ్ములో
నెగ్గగలారె ! వీరు ధరణీసురవర్య ! హితమ్ము తెల్పుమా ? 191

మునివర, నలువురయిననా
తనయులలో రామునే సదా ప్రేమిం
తునతడు నాకధిక ప్రియు
డనఘా ! నాకేమి చేయనగునో ? చెపుమా ! 192

రాముని బాయనెంచితినా ? ప్రాణములేనను బాయ నెంచుగా
కీముని మాటగాదనుచు, నేవచి యించితినో ? ఘహాతపో
ధాముడు కోపతప్తుడయి, తప్పకనన్, శపియించు నేమొ ? నా
సేమము గూర్చు మార్గమెదొ ? చెప్పుమనన్ గురువర్యుడిట్లనెన్ ॥ 193

వినుమోపంక్తిరథా ! పరాత్పరుడె యుర్విన్నీకు బుత్రుండు గా
జనియించెన్, మనుజుండుగాడు, పృదులక్ష్మా భారముందీర్ప, ద
ద్వన జాతా సనుడాదిగా గల సురవ్రాతమ్ము ప్రార్థింప, బా
వన కౌసల్య ముదమ్మునొంద, భవదావాసమ్ము దీపింపగన్ ॥ 194

నలువకు నందనుండవయినాదుప్రజాపతి కశ్యపాఖ్యతో
నలఘుతపమ్ముచే హరికి హర్షముగల్గగ జేసి తత్తపః
ఫలముగ, నీవు, తద్విభున పత్యము గమ్మని గోరినావు, కో
సల తనుజాత ; యా యదితి సత్యము ; దేవరహస్యమో నృపా ! 195

హరియేరాముడు ; లక్ష్మణుండు హరిశయ్యా శేష సంజ్ఞుండుత
ద్ధర చక్రమ్ములె, శత్రుహంతృ భరతుల్ తద్యోగ మాయా మహ
త్తరరూపం ; బలసీత, రామునకు సీతం గూర్పగా వచ్చె నీ
వరమౌనీంద్రుడు ; నీవు నీ సుతుల నీవచ్చున్ మునిస్వామికిన్ 196

అనవిని యమ్మహీశుడు కృతార్థునిగా దనునెంచి కొంచు, మో
మున, మది గన్పడన్, దలలమూర్కొని పుత్రుల రాము, లక్ష్మణుం
గనుగొని కౌగిలించికొని, కౌశికు గార వమారగాంచి
ముని వర గొమ్ము, వీరినని, మోదముతోడ నొసంగెనంతటన్ ॥ 197

అందులకమ్ముని, పరమా
నందభరితుడగుచు రాజనందనులను, జే
నందికొనుచు నాతని, కభి
నందనములొసంగి దీవెనల నిచ్చి చనెన్ ॥ 198

వారును బాణాసన తూ
ణీరాంబక ఖడ్గపాణినీరజులై, దో
స్సారమలర, నక్కౌశికు
మీరక వినయమున ననుగమించిరి వరుసన్ 199

కొంతదవ్వు, చనగ గుశికాత్మజుడు వారి
క్షుత్పిపాసలడపగోరి, రామ
లక్ష్మణులకు నతిబలా భల విద్యల
ప్రేమమీర నొసగి ప్రియమొనర్చె ॥ 200

అటులరిగి వారుగంగో
త్కట జలములదాటి తాటకావని చెంతన్
బటుబాహోబల దాటక
గుటిలంగనిపల్కె గౌశికుడు రామునితో 201

రామవిభూ ! కనుగొనుమిదె
కామాకృతియైన తాటకాభిధరక్షః
కామిని గాంత యనక, నా
యీమాటను వడిగ జంపుమీ ! దుర్దనుజన్ 202

కృత్యమిది యనుచు గుశికా
పత్యము వచియింప గురుని వచనము తనకా
దృత్యమని తలచి రాముడు
సత్యపరాక్రముడు దాని జంప, నురవడిన్ 203

శంకింపక యతడు ధను
ష్టంకారరవమ్ముచే నడవి బూరింపన్
ఝుంకారముతో దాటక
కింకన్ రామునెదిరింప గరలుచు వచ్చెన్ 204

అక్కరణి నెదిర్చిన యా
రక్కసి తాటకనుగాంచి రామవిభుడు, తా
నొక్క శరము నంధునుమగ
గ్రక్కుచు రుధిరమ్మునది యొరగె వికృతముగన్ 205

శాపము కారణమ్మగ బిశాచత గాంచిన యామె తద్రఘు
క్ష్మాపతి సత్కృపా మహిమ, శాపవిముక్తిని జెందియక్షియై
యా పరమాత్మ సన్మతి సహస్రములన్నుతులాచ రించి, సం
ప్రాపిత దివ్యరూపయయి, రామునసుజ్ఞను జేరె నాకమున్ 206

అధ్యాత్మ రామాయణం 4వ సర్గ సమాప్తం.

# నిర్వచన అధ్యాత్మ రామాయణం

## బాలకాండ - 5వ సర్గ

పిమ్మట; గౌశికుండు, కడుప్రీతిగ రాముని గౌగిలించి, మూ
ర్ధమ్మును, మూరుకొంచు, సుచిరంతన మంత్ర రహస్యయుక్తమ
స్త్రమ్ముల నెల్లనాదర పురస్స రశేముషినిచ్చి నాటి రా
త్రిమ్మద నాశ్రమాటవిని దీరిచి, వేకువ లేచి వెల్వడెన్ ॥ 207

సిద్ధచారణమౌని సంసేవమాన
యైన సిద్ధాశ్రమము జేరి యచట నున్న
మునులు స్వానుజ్ఞ చేరాముబూజసేయ
రామలక్ష్మణులను నిజాశ్రమము జేర్చె ॥ 208

కౌశికుగని శ్రీరాముడు
దేశిక వర కొనుము యజ్ఞదీ క్షను, మా కా
దేశింపుము తద్రాక్షస
నాశమొనర్తుమని పల్కినం బ్రీతుండై ॥ 209

రామా ! నీమాటగ నిపు
డే మునులంగూడి దీక్షకేగెద మన యీ
సౌమిత్రి తోడ, యాగము
నోముము, ఖల శిక్షకేగదోయి వెలసితే ॥ 210

మట్ట మధ్యాహ్నమగుడు గామ స్వరూపు
లైన మారీచుడు, సుబాహుడవల దోచి
రక్త మెమ్ములు గురియింపరామవిభుడు
వింట నిరుశరముల జెవినంటలాగి
విడిచె ; నసురులు తనువులు విడుచు నట్లు ॥ 211

ఆరెండిట బవనాస్త్రము
మారీచుని ద్రిప్పి త్రిప్పి మరి సంద్రమ్ముం
జేరిచె వింతగ, బావక
నారాచం బల సుబాహునామకు దునియెన్ 212

తక్కిన ముక్కిడి రక్కసు
లొక్కుమ్మడి లక్ష్మణ ప్రయుక్త శరహతిన్
ద్రొక్కిరి స్వర్గ పథము సుర
లక్క జమగ బుష్పవర్షముఅలరింప దమిన్ ॥ 213

మొరసెను దేవదుందుభులు మోదమునన్, సురసిద్ధ చారణుల్
మరిమరి సన్నుతించి రలమాన్యుడు ; కౌశికుడా రఘూద్వహున్
సరసకు దీసి కౌగిలిడి, సక్తి, నిజాంకము జేర్చి బాష్పసం
భరిత నిజాంబకుండగుచు బండుల వారి భుజింపచేయుచున్ ॥ 214

ప్రమద కారిపురాణ వాక్యములతోడి
సత్కథల దెల్పి కాలముసాగ, మూడు
దినములందుండి నాలవ దివసమందు
రామవిభుగాంచి పల్కెగారవము మీర ॥ 215

సారజ్ఞానాంభోధి మ
హారాజగు మైథిలుండు యజ్ఞముచే సొ
రారాధన మొనరుచు మన
మారయ బోవుదమె ? యచటికగు శ్రయమ్ముల్ 216

అని మరియు నొకటి తెలిపెద
విను జనకునియింట శివుని విల్లుగలదు, దా
ని ; నతడు పూజించుచు, దగ
నునిచెం, గన వచ్చు దాని నో రఘురామా ! 217

అనుటయు, నెమ్మొగమ్ము దరహాసముతో విలసిల్ల బల్కెనో
మునివర ! నీనియోగముల మోఘము లయ్యెవి నేనదెట్లుకా
దనగలవాడ ! నన్ను శుభమందుము నా వలదందు నామహే
శుని ధనువెట్టిదో ? మనము చూచిన మోదము గల్గకుండునా ? 218

అన విని గాధేయుడు ముని
జనము తనదు వెంటరాగ, సౌమిత్రిని, రా
ముని దోడ్కొని గంగాతట
మునకుం ; జని కాంచె గౌతముని యాశ్రమమున్ ॥ 219

మృగపక్షి విహీనము జం
తుగణవివర్జితము పుణ్యతోయ వాసుమఫల
ద్విగుణిత బహుపాద పయుత
మగు నద్దాని గని రాముడనె మునితోడన్ ॥ 220

గురువర ! యీ ఆశ్రమ మె
వ్వరిది ? మహత్తరము ; శుభద పత్ర సుమఫలో
త్కరమై జంతు రహితమై
యరుసము ; నాకొసగెదె ల్పుమా ! తత్త్వమున్ ॥ 221

నావిని కౌశికుండు రఘునాథ ! పురాచరిత మ్మొకండు, నీ
కే వివరింతు ; గౌతమ మునీంద్రుడు, ధర్మపథాను సారి, స
త్పావన మూర్తి ; లోకవిదితప్రతిభానిధి విష్ణుజిత్త సం
భావితుజేసి, చేసెను తపంబు మహత్తర మిచ్చటందమిన్॥ 222

సరసిజసూతి ; యొక్క పుడొసంగినకన్నె ; నహల్యలోక సుం
దరిని గ్రహించి ; తన్ను సతతమ్ము జితేంద్రియమై భజింప ద
చ్చరితకు నాత్మ మెచ్చి కడుసంతసమందుచు గౌతముండు, స్వా
చరిత తపఃక్రియౌఘ పరిచారికగా గని యిందు నిల్వగన్ ॥ 223

ఒకతరి వాసవుండు ; మద నోదిత దుర్మతి నామెయందు, గో
రికగొని, దానికిం దగుతరిన్, జిరకాలము వేచిమౌని నా
యకుడు; గృహానలేని, సమయమ్మున నాతని రూపుదాల్చి, కా
ముకత జరించి, తృప్తుడయి పోవుటంగాంచి తపస్వి కోపియై ॥ 224

ఔరా ! శక్ర ! దురాత్మ ! నీవిటు మదీ యాకారముందాల్చి స
చ్చరిత్రన్ సతిగూడ పోయెద ; యిసీ సత్యమెటింగింపు ; దు
స్సారా ! తెల్పవ యేని భస్మముగనిన్ జల్పంగలాడన్, నినున్
జేరును యోని సహస్రమంచుబలుకన్ జింతన్ సురేంద్రుడనెన్ ॥ 225

పాతకినైతి దుర్మదను బారికిలోగితి నంచు బల్కి త
ద్గౌతమునంఘ్రులంబడి నితాంతభయమ్మున మ్రొక్కి , ఆర్య ! దు
ర్జాతుడ ! నేజుగుప్సితము జల్పితి దప్పుక్షమించి ; శాపమున్
పీతముగా నొనర్పుమని వేడియు నిష్ఫలు డౌచువెల్వడెన్ ॥ 226

అంతట, గౌతమముని, దు
శ్చింతుండై, స్వాశ్రమమ్ము జేరి, ద్రుతగతిన్
గాంతన్ భయవిభ్రాంతం
జెంతం బ్రాంజలి, నహల్యజేరి, యిటులనెన్ ॥ 227

ఓసీ ! దుష్టా ! నాయా
వాసమునన్ రాయివగుచు బహుకాలము, నీ
దోసము వాయ నిరాహా
రాసమతపమూని చేయుమా ! రామునికై ॥ 228

పరమతపమూని రాతిరి పవలునాక
యా తపానిల వర్షసంజాత భీతి
నోర్చి తద్రామ విభుమది నుంచి కొలువు
మతని పదరజమె శాపమడచి, ప్రోచు ॥ 229

అప్పరమాంఘ్రి రజః కణ
మెప్పుడు నీమేన సోకునింతీ ! యపుడే
తప్పక శాపవిమోక్షము
చొప్పడునను, నప్పుడీవుచూడ గలవు, పో ! 230

అతడా రీతిగ, నాలికిందగని శాపాప్తిన్ బునర్మోక్ష ప
ద్ధతి యుందెల్పి, నిజాశ్రమస్థలపరిత్యాగమ్ముగావించి, ని
ర్గతుడై, దుష్కరమౌ, తపంబొనరుపన్ గంధర్వ గానామృతా
ప్రతిమంబైన హిమాలయాశ్రమముజేరంబోయె నిశ్చింతుడై ॥ 231

అది మొదలాయహల్యయు నిజాశ్రమ సీమతపంబొనర్చుచున్
సదమలరూప ! యేరికి గనంబడకుండి భవత్పదాబ్జముల్
గదియగ గోరి నేటికిని గల్గెనిటన్ మునిపత్నికిన్ భవ
త్పద రజముం, దవిలి కృత పావన జీవనగా నొనర్పుమీ ॥ 232

అని పలికి రాఘవుని కే
ల్గొని ముని విభుడుగ్రతపము గొని యున్న, యహ
ల్యను జూపనతడు నిజపద
వనజముసోకించి, శాపవర్జిత, జేసెన్ ॥ 233

అటు శాపముక్తిగని యా
జటిల యహల్య మణిశాణ సంఘర్షితమౌ
పటురత్న మటు లతని ముం
దట గనరా, నామెకతడు నతులొనరించెన్ 234

అజసుతపుత్రుధౌతకనకాంబర భూషితగా త్రునిం జతు
ర్భుజాని ; గదారిపద్మదర భూషిత బాహుపవిత్రునిన్, సహా
నుజు ; స్మిత వక్త్రు, బద్మనయనుం, బృథువత్సగతాంక భాసురున్
సుజలదనీల దేహరుచి శోభితదిక్తటు రామునద్భ టున్॥ 235

కనుగొని, రాము రమా నా
ధునిగా గని, గౌత మోక్తి దోపగ, హర్ష
మ్మున, విస్ఫారిత పృథులో
చనయగుచు, నహల్య పరవశత్వము గొనుచున్ 236

ముదమ్మున బాద్య ; మర్ఘ్యము
మొదలగు పూజోపకరణములు, హర్షాశ్రుల్
చెదరగొని దండమిడి, గ
ద్గదిత వచోయుక్తినుతుల గావించె నిటుల్॥ 237

అహో ! జగన్నివాస ! నే గృతార్థనైతి, నిన్ను న
స్వహమ్ము గొల్చెదన్ భవత్పదాబ్జ ధూళిసంగతిన్
గృహీత పూర్వ జన్మనైతి గేవలుండవంచు, నా
యహల్య తా బునః ప్రణామమాచరించి వెండియున్ ॥ 238

అహో ! మహాత్మ ! నాకు, శక్య మౌనె ? తావకీన మౌ
మహత్త్వ ముంగ్రహింప ; మూఢమానవాంగనన్ గదా
సహానుజుండవై మదీయ శాపముక్తి గూర్చి నా
కహర్ని శమ్ము భర్త సేవనందజేయవో ? ప్రభూ ॥ 239

కదలెదు కాలు సేతులను గల్గకయే, యతి మాయికుండనై
పొదలెదు మోద రూపివయి పూర్ణుడవై జగమందు, నీదు స
త్పద వనజాత ధూళికణపావనమై యలగంగ యాచతు
ర్వదన ముఖామరాళి, నతిపావనులం, బచరించునో ప్రభూ ॥ 240

దయను, మద్దృష్టి గోచరతన్వహించి
నాకుగన వచ్చితివి ; మత్పురాకృతమగు
భాగధేయమదెట్టిదో పరమపురుష
నిన్ను వర్ణింపగలనె ? మన్నింపునన్ను ॥ 241

మానవావతార మూనిన హరి ! నరా
కార ! నీలజలదగాత్ర రుచిర !
రామనామధేయ రాజిత చాప ధ
రా ! నినున్ భజింతు; రమ్యరూప ! 242

ఎడద జలింపగ నీయక
విడువడు నింద్రియము లెల్ల విషయముల పయిం
బడనీక రామ ! నిను ; నె
ప్పుడు ధ్యానించుటయెనాకు ముక్తిద మనఘా ! 243

ఎవ్వని పాదపద్మముల నెల్ల శ్రుతుల్ వెదకంగ జాలవో ?
యెవ్వని బొడ్డుదమ్మిజని యుంచిన నల్వ ! మహత్త్వమందెనో !
యెవ్వని నామసారముగ్రహించి ; పురారి మహేశుడయ్యెనో
యవ్విపుల ప్రభావుదెలియంగలనే ? నిను గొల్తురాఘవా ! 244

నీయవతారపు జరితల
నాయజాడును, శివుడు ; నారదాదులును, సదా
గాయకులై పాడగ, వా
గాయతనేత్రయును ; హర్షమందు సతతమున్ ॥ 245

పరమాత్ముడు పురాణపురుషుడు ; సుస్వయంజ్యోతి
యనంతు డాద్యు డమలుండు
మాయాత నుండు, సమస్తలోక విమోహనీ
యాకృతియు మహనీయుడగుచు
విశ్వోద్భవస్థితి విలయమ్ములకు నొక్కడై
నిజమాయాగుణౌఘ బింబి
తుండయి పద్మ జాతుండన విష్ణుండనగ,
శివుండనగను నామభేద
ములధరించి స్వతంత్రత నలరి యాత్మ
డగుచు బరి పూర్ణుడై ముదమందు నెవని
కానతి శతమ్ములని యమరౌఘ మనునొ ?
తాదృశుడవీవ ! రామ ! వందనము గొనుము ॥ 246

రామ ! భవత్పద పంక జ
మామా సతిస్వీయవత్సమందు ; ధరించున్
సామి ! జగత్త్రయి నీయం
దేమెదలుట, దెలియుదురు, మునీశ్వరు లనఘా ॥ 247

జగదాది భూతుడవు ; మరి
జగదాశ్రయుడవు ; సమస్త జగమీవ ; జగా
నగల సకల భూత ములం
దు గలియ, కేకత్వమునవె, తోచెదవు , హరీ ! 248

ఓ రామచంద్ర ! నీ వోం
కార నిరూప్యతవచోతి గమ్య పురుషతా
ధారుడవు ; వాచ్య వాచక
కారణ కర్తృత్వ కార్యగతుల మెలగెదౌ 249

రామా ! కేవలుడవు ; నీ
యామాయబహుస్వరూపయైతగు ద్వన్మా
యామోహితులై తెలియక
సామాన్య మనుష్యగావిచారింత్రు ; నినున్ ॥ 250

అమలుడ ; వసంగుడవు మరియచల నిత్య
బుద్ధ శుద్ధావ్యయస్వరూపుడవు ; నభము
భంగి ; నెల్లెడ నుందువో పరమపురుష !
మాయివని యజ్ఞులంద్రు ; నీమాయ దవిలి ॥ 251

ఆడుదాన ; మూఢ నజ్ఞను ; దావక
తత్త్వమెట్లు తెలియుదాన ! దేవ
యగుట ; రామ ! నే సహస్రనమస్కృతుల్
సేయుదానగాఢ చిత్తనగుచు ॥ 252

అన్న నేనెట్టు ; లేయెడనున్న సతము
దావ కాంఘ్రి సరోజ సక్తనయినీదు
భక్తి గలిగి ప్రవర్తిల్ల, బరమపురుష
ప్రీతి వందనశతములర్పింతు ; నీకు ॥ 253

వందనము పరమపురుషా !
వందనమా శ్రితజనౌఘ వత్సల! భవ భీ
స్పందహరణ ! నీకు సదా
వందనమో దేవ ! కేశవా ! ప్రోవగదే ! 254

కరధృత చాపసాయకుని ; గాలవినీల ఘనాభునిన్ దివా
కరశతదీప్తి ధాము గనకద్యుతి భాసుర భవ్య వస్త్రునిన్,
సురుచిర రత్నకుండల సుశోభి, విశాల సరోజనేత్రు ; సో
దరవరలక్ష్మణాన్వితు ; నుదారు సదామదినిల్పి మ్రొక్కెదన్ ॥ 255

ఇటులు ప్రత్యక్షముగ దన యెదుట నున్న
రాఘవునకు ప్రణామ పూర్వక ప్రదక్షి
ణములనొనరించి యతని యాజ్ఞగొని మించి
చనియెనా సతి నిజపతి సరస కంత ॥ 256

ఓకమల నేత్ర ! యీ యహల్యా కృతమగు
సంస్తుతినెవండు సద్భక్తి సహితుడగుచు
పఠనమొనరుచు ; వాడు పాపములు తొలగి
రామసాయుజ్య మంది హర్షమ్మునొందు 257

పుడమి బుత్రార్థి యగుచునెవ్వడు సభక్తి
రామునెదనిల్పు ; వాడభిరామగుణుని
దనయులగాంచెడి నొక్క వత్సరములోన
వంధ్యయును బుత్ర సంతతి వడయు నిజము ॥ 258

రామచంద్రునిలసదను గ్రహము వలన
నెల్ల కోర్కులు సిద్ధించు నెట్టి పాపి
యేని మోక్షమునందు విజ్ఞాని యగుచు
దక్కుభక్తుల మాట నెత్తగ నదేల ? 259

అధ్యాత్మ రామాయణం 5వ సర్గ సమాప్తం.



# నిర్వచన అధ్యాత్మ రామాయణం

## బాలకాండ - 6వ సర్గ

సానుజుడగు రామునితో
మౌనివరుడు పలికె వత్స! మనము చనుదమా !
జ్ఞాన నిధి జనకపాలిత
యైనెగడెడి మిథిల; కిప్పుడట యజ్ఞమగున్॥ 260

పిమ్మట: నీవు పొదగును బ్రీతి; నయోధ్యకు రామ! రమ్మనే
డమ్మిథిలా పురమ్మున కటంచు వచించి, సహోను జన్మ రా
మ; మ్మని చిత్త ధాముగొని ముక్తి కరామరవాహినీ ప్రతీ
రమ్మను జేరి; దాని: ముని రాజుతరింపగనుండు: నత్తరిన్ ॥ 261

పలికెను నావికుండు; జనవల్లభ ! నీవు నావ నెక్కగా
వలదు; భవత్పదాబ్జముల పావన దూళి జలమ్ము తోడ; నే
దలగగ జేయుకున్న; వనితా మణియై వడిబోవునావయున్
దలపగ; భేదమున్నదియె? దారుదృషత్తుల కోరఘూత్తమా ॥ 262

రామ! తావకపాదసారస యుగమ్ము
మానవింజేయు చూర్ణము బూనె నేమొ?
కడిగాయాపయు; బడవను గడవువాడ
గాని చోనాకుటుంబము హాని గనదా? 263

అని యతడా రఘువర పద
వనజములంగడిగి పడవ బరతీరము జే
ర్చిన పిదప గౌశికుండను
జునితో రాముగొని మిథిల జొచ్చెగడుతమిన్ ॥ 264

అటువారు, మిథిలకుం బ్రొ
ద్దుట జని, ఋషివాటమునకు దొలుత నరిగియ
చ్చటమండ; గౌశికుని,వ
చ్చుట విని,మైథిలుడు మోదచోదితుడగుచున్ 265

పూజాద్రవ్యమ్ములగొని
రాజపురోహితునితో బురంబువెడలి, యా
రాజమునికి మ్రొక్కుచు, ద
త్పూ జనమొనరించి భక్తిపూత హృదయుడై ॥ 266

వీరెవరో! మహాత్మ! వినిపింపుము; సర్వ సులక్షణాన్వితుల్
సూర సుధాకరోపములు; సుందరమూర్తులు; స్వీయ భవ్య శా
రీద విభావిరాజిత హరిత్తటులౌచు వెలుంగుచుండ్రి, యీ
శూరులదే మహామహుని సూనులొ? సోదరులట్లు తోచెడిన్ ॥ 267

నరనారాయణులో; యీ
నరశార్దూలములు; దేవనందన నిభులై
మరిమరి మాకు మనః ప్రియ
కరులై; యున్నారు; కౌశికా? తెలుపు మనన్ ॥ 268

వినుమో జనకా! దశరథ
తనయులు ; సోదరులు వీరు ; తండ్రియనుప, నా
వెనువెంట యజ్ఞరక్షణ
మునకై చనుదెంచి నారమోఘ భుజబలుల్ ॥ 269

శ్రీరామలక్ష్మ ణాఖ్యా
ధారులు ; మార్గమున సుందతనూజాత మహా
క్రూరను జంపిరి ; వీరొక
నారాచమ్మున ; ద్రిలోక నాధుల్ వీరల్ ॥ 270

పిమ్మట, యజ్ఞ వాటమ్మున బేర్చి, మదీయమఖోపయుక్తముల్
చిమ్ముచు ; రక్తమాంసములు చిమ్మి ; పవిత్రమఖ ప్రదేశమున్
వమ్ముగ జేయుచుండిన సుబాహుముఖాసురులన్వధించి, తా
నమ్మెయి, తాటకేయుని, మహజలధింబడద్రోసె, మైధిలా ॥ 271

ఆవల ; గంగాతట పు
ణ్యావహగౌతమమునీశ్వరాశ్రమవసతిన్
బావన పదదూళి నహ
ల్యావనితకు శాపముక్తి నమరించె వెసన్ ॥ 272

ఇప్పుడు, తద్గృహమ్మున, మహేశుని చాపము రాజపూజ్యమై
చొప్పడునంచు మద్వచన చోదితుడౌటను దానిగాంచ ; నీ
మెప్పువహింప, నాపలుకు యేకొని వచ్చె ; మహాభుజుండితం
డిప్పుగిదిన్, దదీధ్య ధను వెచ్చట నున్నదొ ? చూపుమో నృపా ! 273

దానింగని, యీతడయో
ధ్యానగరింజేరి జనకునరయ జనుననన్
జ్ఞాన జనకుడవ్వారి క
నూన సపర్యల నొసంగె నూత్న విధిగతిన్ ॥ 274

అటులొనరిచి, జనకుండ
చ్చట నుండి సచివుగని, మహామాత్యా ! ధూ
ర్జటి ధనువు స్వీరికి జూ
పుటమనకు నవశ్య కృత్యముగదా ! యనుచున్ ॥ 275

అంతటమైధిలుండు కుశికాత్మజుతోననె, మద్గృహమ్మునన్
సంతత పూజ్య మానమాగు చాపము నెక్కిడు నేని రామభూ
కాంతునకున్, మదీయమగు కన్నియసీత నొసంగువాడ, నీ
స్వాంతము సంతసింప మునివల్లభ ! యీ శుభమున్ ఘటింపు మీ ! 276

ఇట్టులు, మైధిలుండు వచియించిన యంతనె శైవ చాపమున్ బట్టి
సహస్రసంఖ్యలతి బాహుబలాఢ్యులు తెచ్చి యచ్చటన్
బెట్టగ ఘంటికాశతమణీ ఘృణి భూషిత మైన దాని, జే
పట్టుమటంచు జూపెసచివ ప్రవరుండల రామమూర్తికిన్ ॥ 277

రాముడులేచి, తత్పరి కరమ్ము, దృఢమ్ముగ సంతరించుచున్,
వామకరమ్మునన్, ధనువు బట్టి విలాసముగా గదల్చుచున్
భూమిపతుల్గనుంగొన సముద్ధతి, దక్షిణపాణిచే, గుణ
మ్మామృదువింట నెక్కిడిన, యంతనె, మ్రోగెను దేవదుందుభుల్ ॥ 278

విఱిగె, శరాసనమ్ము ; సుమవృష్టి సురలురిపించి రప్పుడ
చ్చెలువుగ ; నల్దెసల్ రవళిచే బరిపూర్ణములయ్యె ; వేడ్కన
చ్చరలు, నటింపసాగిరి ; రసాతల మర్త్య సురాలయమ్ములం
దిరవుగ ; నాదమేర్పడె ; మహేశుని చాపముద్రుంగెనత్తరిన్ ॥ 279

ఇరుఖండములౌ చాపము
నరసి జనకరాజు విస్మయా విష్టుండై
పరిరంభమొసగె, శ్రీరఘు
వరునకు, నవరోధజనము హర్షమునొందెన్ ॥ 280

తగు వినయాన, సీత, నిజదకిణ హస్తమునందు ; భవ్యకాం
తిగల సువర్ణ మాలికను దేకువ బూని మనోజ్ఞ రత్న హా
రగళము, రత్నకుండల, విరాజిత కర్ణములు న్మాగాన జి
ర్నగవు, దుకూల వస్త్రమును రంజిల రామువరించె వేడ్కమై ॥ 281

పిమ్మట, నృపావరోధజ
నమ్ము సకలలోక మోహన రఘూద్వహరూ
పమ్మను గనులార గని
సమ్మద మందిరి, గవాక్ష జాలాధ్వగలై ॥ 282

సకలనయజ్ఞుడై వెలయు క్ష్మాపతి మైధిలు డిట్లువల్కె ; గౌ
శిక ! శుభలేఖనంపుము వశిష్ఠ నిజాత్మజ దారమంత్రి బో
ధక గురుయుక్తుడై ; దశరధ క్షితినాధుడు వచ్చునట్లు , మా
మక వినయోక్తులం గలుగమన్నన గన్పడ గౌరవమ్ముగన్ ॥ 283

సచివులు జనకాజ్ఞను, దూ
త చయముననుపంగ వారు త్వరితగతిని, బో
యి, చతురులయి, నృపతికి, ద
త్సుతు చరిత మెఱిగింప హర్షశోభిత ముఖుడై ॥ 284

సచివులగాంచి పల్కెనురు సత్వుడు పంక్తిరధుండు, మంత్రు లా
ర ! చనవలెన్, మహోదయత రాముని పెండ్లికి మేము బాంధవా
శ్వచయరథేభ పత్తిశుభవహ్నుల తోడ గురుండు ముందుగా
సుచరితయౌనరుంధతి యు, శోభిల, దద్రఘు నాయకాంచికో
పచితరధమ్ముతో జనక పత్తనమార్గము బట్టి పోవ మ
ద్వచనముగా, బురాన గల వారికి నెల్ల నెఱుంగ జేయుడీ ॥ 285

అంతట బౌరులందరు ; నృపాజ్ఞకు దోడగు వేడ్కమై సమా
క్రాంత పథాశ్వవారణ నికాయముతో మిధిలాపురాధ్వము
న్వింతగబట్టి వచ్చుటలు వీనులు సోకగ, మైధిలుండు, స్వ
ప్రాంతమున న్గురుండు నిలువం జన వారలదోడి తేరగన్ 286

జనకడటువెడలి, దశరధ
జనపాలునకెదురుకోలొసంగి, సువినయ
మ్మున దెచ్చి యాతనికి బూ
జనముల నర్పించెవారు సంతసపడగన్ 287

అంతట బుత్రులిర్వురు, నిజాంఘ్రులకుంగడు భక్తి మ్రొక్కియా
చెంతల నిల్వ సంతసిలు చిత్తముతో రఘురామ ! నీదు వృ
త్తాంతమువింటి ; బూర్ణముగ దైవకృపంగనుగొంటి నిన్ను నా
కింతటి భాగ్యమబ్బగ ; మునీంద్రుడు కౌశికుడెనిమిత్తమౌ ॥ 288

ఈముని పరుకృప యోగ
క్షేమసమృద్ధులు లభించె జిరసౌఖ్యము లో
రామ యగుననుచు మూర్ధము
బ్రేమ న్మూరికొని, కౌగిలించె, దృఢముగన్ 289

అని పలికి జనకదర్శిత
ఘన భోగాన్వితమహానికాయ్యమునకు, రా
మునితో దారాదులతో
జని దశరథుడు నివసించె, సౌఖ్యధనుండై 290

ఆవల శుభ దిన లగ్న సుఖావహ
సుముహూర్తమున శుభాస్పదురామున్
బావను, జనకుడు, సీతా
దేవిన్ ఘటియింపదలచి, త్రికరణశుద్ధిన్ 291

రత్నమయ స్తంభరచితరమ్య విశాల సువితాన తోరణశోభితమ్ము
కలిత శోభాఢ్యముక్తా పుష్పఫల సమంచిత వేద వేత్త్య భూషిత తలమ్ము
స్వర్ణ భూషిత విప్రజన నిష్కకంఠ సువాసినీ పరితో విభాసురమ్ము
దుందుభ భేరీ పృథుల ఘోష సద్గీత్ప భరత నాట్యానంద కరజనమ్ము
నైన రత్న సువర్ణాంచి తాసనమ్ము
నందు సుందర రాఘవుడలర, గుశిక
సుత వశిష్ఠ శతానంద యతుల నుభయ
పార్శ్వముల నిల్పి భక్తి సపర్యలొసగె ॥ 292

అటువారు పావనాగ్నిని
జటిల వరజ్వాలికా విశాల సువేదీ
స్ఫుట రుచి మయముగ నొనరిచి
పటుమంత్ర సమిద్ధ హోమపద్ధతి నడువన్ ॥ 293

నా వారత్న విభూషిత
జానకి రప్పించి దార సహితుడగుచు దద్
జ్ఞాన నిధి రాముపదముల
బూని, కడిగి, తదుదకమ్ము మూర్ధమున నిడెన్ ॥ 294

ఏవారికి విధి శివులుం
బావనమని, మునులు స్వీయమస్తకములనే
తావుగ జేయుదురో యది
భూవి భుజనకునకు మస్తభూషణ మయ్యెన్ ॥ 295

జానకి కరమ్ము బూని యాజనక నృపతి
సాక్షతోదకపూర్వక సరణి వినయ
వినుతి బాణిగ్రహ విధానమును దలగక
ముని జనమనో భిరామరామునకు నపుడు ॥ 296

ధన్యన్ భూషణమాన్యన్
గన్యను "తుభ్యందదామినమయ" యనుచు, శా
స్త్రన్యాయముగ జనక రా
జన్యుడు రామునకొసంగె ; జానకి , నబలా ! 297

ధర్మ విదుడు లక్ష్మణునకు
నూర్మిళ ; భరతునకు శత్రు హరునకు గ్రమముగా
శర్మద శ్రుత కీర్తిని ; ధృత
భర్మను మాండవినొసంగె భాతృతనయలన్ ॥ 298

ఆ.రీతి, నొసగి జనక
క్ష్మారమణుడు ; ప్రీతమానస సరోజుండై
మారమణి హరికొసంగిన
క్షీరాంబుధివోలె సంతసించుచునుండెన్ ॥ 299

అరమరలేని భ్రాతలగునారఘురాముడు, లక్ష్మణుండు, త
ద్భరతుడు, శత్రుహంతయు, శుభప్రదలక్షణలౌఘులోకపా
లురవలె ; స్వప్రభల్ తగనలోల మహాద్భుత రూపయుక్తులై
పరగుచు నూత్న పత్నులలతిభక్తి భజింపగనుండు నత్తఱిన్ ॥ 300

జనకనృపాలకుండు ; నిజసత్త్వను జాత విచిత్రగాద తె
ల్పెనిటు "మదధ్వరావని బవిత్రము సేయగ నెంచి, దున్నునం
తనె, యటనొక, కన్నియకనంబడె, నామెను సంగ్రహించి, నా
వనిత కొసంగనామె సుతవత్సలతంగని పెంచుచుండగన్ ॥ 301

వినుడొకనాడు, నేనొక, వివిక్తతలాన వసించియుండ, మో
హన మహతీ నినాద మిళదాత్మ గళస్వనుడొచు బాడుచున్
మునిపతి నారదర్షి యనుమోదముతో నరుదెంచి, తా సుఖా
సనగతుడై వచించె, నిది, సత్యము గుహ్యమటంచు నవ్వుచున్ ॥ 302

దేవత ; లావిధాతయును ; దీనత వేడికొనంగ విష్ణుడే
రావణునిన్వధింప ; నిలరాముడుగా నలయోగమాయ, సీ
తావన జాక్షిగా, బొడమి ; తద్దయువెల్గుచునున్నవారు, నీ
వీవనితామణిన్, రఘుకులేశున కిమ్మని తెల్పితాజనెన్ ॥ 303

సత్యము రాముడు హరి, మద
పత్యము శ్రీదేవి ; వీరిపావనత మదాం
పత్యము మరియు నలయు నా
కృత్యమ్మిదియంచు నిశ్చయించి శుభమతిన్ ॥ 304

పుర దాహానంతర మీ
శ్వర నిక్షిప్త మగు శైవ చాపము ; మన్మం
దిరమున బూజించుచు ద
ద్వరధను వెక్కిడుటె శుల్కధనమగు గాతన్ ॥ 305

అని చింతించుచునుండగ
ఘనుడీ రాఘవుడు నాకు గానంబడె, నో
మునివర ; నీకృపచే నా
మనోరథము తీరె ; నెట్టిమహనీయుడవో ? 306

అని సీత తోడ నేకా
సనగతుడౌ రాముగాంచి సంతసమున ; నా
జని సఫలంబయ్యెను ; రా
మ ! నినుంగని నేడు సుజనమాన్యుడనైతిన్ ॥ 307

నీ పదసలిలము తలపై
నాపరమేష్ఠిగొని, సృష్టి, సమరింపదగన్
నీ పద సలిలము తల
బ్రాపించుట, బలి సురాధిపత్యముగాంచెన్ ॥ 308

నీపాద రజము సోకుట
శాపవిముక్తిగ నహల్య సద్యఃపతి సం
ప్రాపితయయ్యెను, నీవా
శ్రీపతివి ; త్వదన్య దుష్టశిక్షకులేరీ ! 309

ఏ నీపాదయుగమ్ము గొల్చుటన్ మౌనీంద్రుల్ మహయోగులెం
తేనిస్తార్య భవాబ్ధి దాటనయి, యేనీనామ సంకీర్తన
ధ్యానాదుల్, పచరించుటం బ్రుటిత శోకార్తివ్యధాపాశులై
యానందింతురొ ? యట్టి నీపదములన్ ధ్యానింతు రామప్రభూ ! 310

ఆ రీతి బొగడి జనకుం,
డారామున కొసగె ; శతసహస్రములొ, దీ
నారంబుల యుతరధముల
వారణవాజుల సహస్ర పత్తులను, దమిన్ ॥ 311

సీతకు దాసీ త్రిశతము
పీతాంబరరత్నరుచినిభృతహారములన్
స్ఫీత మణి భూషణమ్ములు
బ్రీతి నొసగి, గురుని సత్కరించి నుతించెన్ ॥ 312

భరతుని, సౌమిత్రిని, రిపు
హరునిన్ దశరధుని భక్తినర్చించి, గుణో
త్తరునిన్, రఘువరు సత్కృతి
పురస్సరముగా బ్రయాణములు సేయించెన్ ॥ 313

ఆతరి గన్నీ రొలికెడి
సీతకు గౌగిలి, యొసంగి, చింతిల్లుచు, ద
న్మాతలు సాశ్రు నయనలై
యీతీరుగ సదుపదేశమిచ్చిరి వరుసన్ ॥ 314

ఓతల్లి ! నీవు సతముం
బాతి వ్రత్యమున నత్తమామల మగనిం
బ్రీతిగ సేవించుచు ; వ
త్సా ! తలితండ్రులకు గీర్తి సమకూర్పగదే ॥



ఆ రీతిన్, రఘురామునంపుతరి దూర్యారావముల్ భూరి, భే
రీ రావమ్ము ; మృదంగనాదము చతుర్దిక్పూరితమ్మై దివిన్
భేరీతూర్య నినాదముంగలిసి ; పృథ్వీ ప్రాణి భీత్యావహం
బైరాజిల్లెను, బెండ్లివారు పయనంబై రా యయోధ్యారతిన్ ॥ 316

అధ్యాత్మ రామాయణం 6వ సర్గ సమాప్తం.



# నిర్వచన అధ్యాత్మ రామాయణం

## బాలకాండ -7వ సర్గ

ఆ గతి ; రామచంద్రుడు ప్రయాణము సేయుచునుండ ; దూరమా
ర్గాగత దుర్నిమిత్తము; లనంతముగ, గనరానృపోత్తముం
డా గురు గాంచి యిట్లనె; మహాత్మ! భయంకర దుర్నిమిత్తముల్,
రా గతమేమొ? దెల్పుము; మదాత్మ జనించిన భీతి మాయగన్॥ 317

అనుడు, వశిష్ఠుడిట్లనె; ధరాధిప! భావి భయంబు, సూచితం
బె; నిజముగాని; యైనమనకిప్డు మృగాలు ప్రదక్షిణమ్ముగా
జనియెడు గాన, నయ్యది ప్రశస్తము; మంగళ సూచకముగా
దనరెడినౌట, నోదశరథా! భయమీవు పరిత్యజింపుమీ! 318

అని తెల్పుచునుండిన యం
తనె సుడిగాలి చెలరేగి; నల్దెసలను; వీ
చిన; బాంసువృష్టి యెల్లర
కనుగవలంగప్పి పీడ గల్గించె; వెసన్ ॥ 319

అపుడు వారికెదుట నగపడికోటి సూ
ర్యోపమమ్ము విద్యుదుజ్జ్వలమ్ము
వెలుగు ప్రోవువారి వెఱపింపసాగెను
బంక్తి రథుడు విపుల భయము నొంద ॥ 320

కాలనీలాభ్ర భీకర తరాకృతి జటామండల మండితమస్తకుండు
ప్రాంశు దేహుడు ; ధనుః పరశుభూషిత పాణి సాక్షాత్కృతాంతక సన్నిభుండు
కార్త వీర్యార్జున ఘనబాహు, గర్వని ర్వాపణ దక్ష పరాక్రముండు
సర్వ సర్వంసహా చక్రదృప్తక్షత్త్ర జాతాసువాత భుజం గముండు
జామదగ్న్యుడు వారల సరస, సరభ
సమున దోచెంచి ప్రాణాంతసమయమందు
గాన వచ్చిన మృత్యువు కరణి నిలువ
దశరధుడు భీత చిత్తుడై తల్లడిలుచు ॥ 321

విధి వదర్ఘ్యా ది పూజల విస్మరించి
త్రాహిమాం, త్రాహి త్రాహీతి దశరధుండు
దండమిడి తనయ ప్రాణదాన మొసగు
మనుచు బ్రార్థించి, తావినయమున నిలిచె ॥ 322

అని పలుకుచున్న దశరధు
ననాదరించి భృగురాముడరుణ నయనుడై
కనలుచు జలితేంద్రియుడై
వినుమో ! రామా ! మదీయ విశదవచనముల్ ॥ 323

నేనిల, రామనాముడను నీవు నాయభిదేయమూని భూ
జానికులాధమా ! తెలియజాలవునన్నిక ; నీకు క్షత్రియ
స్థానము గల్గెనేనిపుడు ; ద్వంద్వ రణమ్మొనరింపు శైవప్రా
చీన విశీర్ణ చాపమునశించిన మాత్రనె గర్వమేటికిన్ ॥ 324

ఈ నా వైష్ణవ చాపము
పూని శుణారోపణమ్ము పొసగించితివా.?
యీనీకునాకు యుద్ధ
మ్మొనటు, గాకున్న మిమ్ము నందఱద్రుంతున్ ॥ 325

అని భృగురాముడా దశరథా త్మజుతో గరువమ్ముమై వచిం
చిన జలియించె భూమి ; కడుచీకటి క్రమ్ముచు సర్వలోక లో
చనముల గప్పె ; నప్పుడు, రుషావృతమానసుడౌచు రాముడా
తని ; ధనువు గ్రహించివడి దాని గుణమ్మును గోటి జేర్పుచున్ ॥ 326

తూణీరము నుండి నిశిత
బాణమొకటిలాగి భార్గవా ! బ్రాహ్మణా ! నీ
ప్రాణమ్ముల గొనదు దీనికె
దేనిగుఱింజూపు ; వృథగ నిదిపోదుసుమీ ॥ 327

తప్పికొన పోవగా, నీ
కిప్పుడుశక్యమ్మె? నిన్నదే లోకమునం
దెప్పుడయిన విడువ దికం
జెప్పుము మరుమాటనాకు శీఘ్రముగ; మునీ! 328

ఇటుపటువాక్మరమ్మున, నౌకించుక నొవ్వుఘటిల్లజేయనా
క్కట వికృతాస్యుడై యదియుగాదన జాలక పూర్వవృత్త; ము
క్కటి స్మరియించి, యీ విధముగా, భృగురాముదువల్కె, సద్గుణో
ద్భట! పరమేశ్వరుండవని బాగుగా నిన్నుదలంచు చుండెదన్ 329

హరివి, జగత్త్రయ నిర్మితి
ధరణ, హరణ కరణ శాలితా మహనీయ
స్థిరతేజోనిధి వగుదువు
పురాణ పురుషుండ, వఖిల భూత గతుడవున్ ॥ 330

దాశరథి శ్రేష్ఠ! నా శైశవమ్మున దపముచే హరికి సంతసము గూర్ప
జక్రతీర్థముచేరి శార్ఙ్గిని మెప్పింప నతడు ప్రత్యక్షమై యని యెనిట్లు
మచ్చిదంశము పూని మహిపతియౌ కార్తవీరుని వధియించి పృథ్విగలుగు
నుర్విపతుల నిర్వదొక మాఱు చెండి కశ్యపునకు ధరణి నొసంగి యవని
దశరథ సుతుండనైన నా దర్శనమ్ము
చేయనాతేజు నాయందు జేరు బొమ్మ
టంచు నెరిగించి యంతర్ధి నందెనతడు
గాన గలిపెద నా తేజమో నృపాల! 331

అనుచు దన తేజమాతని యందు గలిపి
దుష్కరమ్మగు తప మొనర్తునని యతడు
పోవ వెడలుచు రాముని బొగడెనిట్లు
వినగదె; దేవి, దీన వివేకమొదవు ॥ 332

ఆ విష్ణుడవే! నీవో
దేవా! విధి వేడ బొందితివి మానవతన్
నీవొసగిన తేజమె మరి
యీ విటుకొంటి, విటగ్రొత్త యేదియుగలదే ? 333

నేడు నా జని సఫలము నీదుదర్మ
నమున బ్రహ్మాదులును, నిన్ గనంగలేరు
ప్రకృతి కంటెను బరుడ; వుత్పత్తి మొదలు
భావ షట్కము నీ యందు బరగదెప్పు
డవియ విజ్ఞాన జనితములగుట దేవ ! 334

## గీతమాలిక

పూర్ణుడవు నిర్వికారుడవు గమనాది
హీనుడవు జలమందు దత్పైన మటు
వహ్ని యందల ధూమము పగిది, దావ
కాశ్రయ యుద్వద్విషయ మగునట్టి, మాయ
కార్య జాతమును సృజింప గలుగు నహహా!
జనులు మాయావృతి నడంచి కొనిన దనుక
గనగ జాలరు నీ తత్త్వమును రమేశ!
సార విద్యారియై, యవిచార సిద్ధ
యగుట వలననె యిది యవిద్యయన బరగె
నరయగనవిద్యచే గృతమైన దేహ
విషయ బుద్ధాది సంఘబింబిత చిదాఖ్య
శక్తి జీవుండనంబడు, జగములందు
నెంత దనుకను, దేహబుద్ధీంద్రి యాదు
లందు, మమత తలంగదొ! యంత దనుక
గర్తృతయు, భోక్తృతయును దుఃఖమ్ము సుఖము
మొదలగు వికారముల దేహిపొందు చుండు ॥ 335

# గీతమాలిక

ఆత్మకున్ సంసృతియు, బుద్ధికరయజ్ఞాన
మెన్నడును గల్గగా జాలునె వివేక
హీనుడీ రెంటి గూడి సంసృతుడనబడు
మిళితమైన జలాగ్నుల వలెనె జడము
చిత్సమా యోగ మందిన జిత్త్వ మొందు
జితియు జడ సంగమునదజ్జడత వహించు
నెపుడుత్వద్భక్త జనముల నెనయునపుడె:
సుజన సంగతి వలన భక్తి జనియించు
దాన నిను సముపాసించు, దాన, మాయ
తానవమునొంది తొలగుద్వద్ జ్ఞానముగల
సద్గురుగని, వాక్యవిజ్ఞాన మొదవి
తత్ప్రసాదమునొంది ముక్తత వహించు
గాన ద్వద్ భక్తి హీనులు కల్పకోటి
శతములకునేని, విజ్ఞాన శంకముక్తి
శంక గలుగమి బొందరు, సౌఖ్యమెపుడు
గాని, ద్వద్ పాదయుగ భక్తి గలుగుగాత
జన్మ జన్మములందు సజ్జన మైత్రి॥ 336

వందనములోక నాధా !
వందనము, దయాళు భక్తపాలక ! నీకున్
వందనము రామచంద్రా !
వందన మిదె గొనుము రాఘవేంద్ర ! మహాత్మా ! 337

కేవలా! సర్వలోక జిగీష వలన
నేను జేసిన పుణ్య; మహీన తావ
కీన శరము నకున్ గుఱిగా నెఱుంగు
మో రఘూత్తమ ! నా నమస్కారమిదియ ॥ 338

అని వేడుచున్న యాతని
వినయమునకు సుముఖుడగుచు విప్రోత్తమ ! నీ
మనసున గలదెల్లను నే
నొనరించెద సందియమ్ము నొంద దగదికన్ ॥ 339

అని రఘురాముడార్ద్ర కరుణామృత పూరిత చిత్తుడై, వచిం
చినవిని, సంతసించి, రఘుశేఖర! నాయెడ నీకనుగ్రహ
మ్మొనరినయేని, నీదు పదయుగ్మము నందలి భక్తి నిత్య పా
వన భవదాశ్రి తాళి హిత భావము గావుత నాకు నెప్పుడున్ ॥ 340

మరియునొకటికోరెద రఘు
వర ! నాయీ స్తోత్రమెవడు పఠియించునో, త
న్నర మాత్రునికేని, భవవ
చ్చరణస్మృతి, మృతి తరిన్ బ్రసాదింపగదే! 34

అనవిని రామచంద్రుడు ; మహత్తర తేజ భవన్మనోరథం
బొనరుతునంచు బల్క వినయోన్నత భక్తి నమస్కరించి పూ
జనమునననుజ్ఞయుబడసిసాగె; మహేంద్ర మాహ్వాయాచల
మ్మునకు దపమ్మొనర్ప భృగుపుత్రుడు శాంత మహాంత రంగుడై ॥ 34

అంతట నయ్యజాత్మజుడుస్వాత్మజుని న్మృతజీవుగా నిజ
స్వాంతమునందలంచి గడు సంతస మందుచు గౌగిలించి, నే
త్రాంతమ్ములం, జలంబొలుక, నాపుచు, స్వస్థమనస్కుడౌచు మో
దాంతముగా; నయోధ్యకు బ్రయాణము చేసె సపుత్రదారుడై ॥ 34

తమతమ భార్యలంగలిసి దైవనిభుల్ రఘురామ లక్ష్మణుల్
విమతహరుండు; సద్గుణ వివేక ధనుండలకైకయీ సుతుం
డమలిన చిత్తుడై, స్వభవనాంతర సీమల రేబవళ్ళు ప్రే
మమయ పవిత్ర వృత్తులయి, మాతృ పితృ ప్రియులైరియెంతయున్ ॥ 344

మతిధనుడైన తద్భరతమాతులు డార్యయుధా జిత్తుండు, సా
దృతి, భరతున్, రిపుఘ్న స్వపురీనయనార్థము వేడ్కవచ్చి త
త్ప్రితయును, దూతలుం బనుప, వేగమ తొడ్కొనియేగే; సీతయున్
సుతుడు భజింప, గోసల తనూజ ప్రహృష్ట మనోంబుజాతయై ॥ 345

సతతము సీతా రాఘవ
యుతమై కౌసల్య తక్రయతమగుశచితో
నదిమోదమందుచున్న య
దితివోలె, నయోధ్య దాముదితయగుచుండెన్ ॥ 346

సాకేతమ్మున, రామచంద్రుడు, జగత్సామ్రాజనాథార్హసు
శ్రీ కల్యాణగుణాన్వితుండగుచు గీర్తిన్ జానకింగూడి, తా
లోకానంద కరాత్ముడై ప్రకృతికిన్, లోగాక నిత్యమ్ము, మా
యాకార్యాను సృతిన్నరుండువలె; సర్వాధీశుడై వర్తిలెన్ ॥ 347

ఇతి ఆధ్యాత్మ రామాయణం బాలకాండ సంపూర్ణం ------

# నిర్వచన అధ్యాత్మ రామాయణం
## అయోధ్యకాండ - మొదటి సర్గ

అంతిపురమ్మునందుగనకాసనసుస్థితుడౌచు రామునా
క్రాంత సమస్త భూషణ వికాసియు; గౌస్తుభకంధరుండు నై
వింతగ జామరమ్ము గొని వీచుచు; జానకి ప్రక్కనిలిచి; తా
నెంతయువేడ్క; వీడియము; నీయగ, జర్వణ సేయునత్తరిన్ ॥ 1

అవతరణమ్మొనర్చి; గమలాసనసూనుడు నారదుండు; రా
ఘవునరయన్, విశుద్ధతరకాంతి శరద్విధు నిర్మలాంగుడౌ
చువియదధస్థితుల్, మిగుల జోద్యముగా గననంత, సీతతో
సువినయ భక్తి యుక్తి, రఘు సూనుడు వందనమాచరించుచున్ ॥ 2

నారదుగాంచి రాఘవుడనంతముదమ్మున, నో మునీంద్ర; సం
సారులకున్ ద్వదీయ శుభసన్నిధి దుర్లభమైన మత్పురా
సారసమాత్త పుణ్యముల సంధిలె; నయ్యది నేగృతార్థతన్
మీరితి, సత్సమాగమము, మేలొన గూర్చుట వింతగాదుగా ? 3

సెలవిమ్ము నే నొనర్పం
గల కార్యమ్మెదియో? దాని గావింతుననన్
వలికె, సురమౌని, శ్రిత వ
త్సలు, రాఘవుగాంచి, ముదము సంధిల్ల నిటుల్ ॥ 4

లోకాను సారులగు తగు
వాకులచే నన్ను మోహవశు జేయుచు, నీ
వీ కరణి భువి ననెదు నిజ
మే కనుగొన, నీదునోట, నృతమె వెలువడున్ ॥ 5

జగములకాదిభూతయయి సాగెడు మాయ, భవత్కళత్ర మా
మెగలుగ జేయు దావక సమీపమునన్, ద్రుహిణాది సంతతిన్
ద్రిగుణగ, యామె, నీ యనుమతిం, గనెడున్, సితలోహితా సితా
భ, గలప్రజన్, జగత్త్రయ విభాస్వర గేహ గృహస్థవౌదుగా ॥ 6

జానకిలక్ష్మి, నీవు హరి; శంభుడవీవు; భవాని సీత, యీ
జానకివాణి; నీవయల స్రష్టవు; తత్ప్రభ సీత; నీవయా
భానుడ; వీవు చంద్రుడవు; భామిని రోహిణి జానకమ్మ; యీ
జానకి, యాశచీతరుణి; శక్రుడవీవు, మహాత్మ! రాఘవా! 7

జానకీ దేవి స్వాహ; వైశ్వానరుండ
వీవు; కాలాకృతి యముండ వీవు; సీత
సంయమని; వరుణడవీవు; జానకి యల
 భార్గవీదేవి; నీ వౌ యాపవనుడ; వల
జానకి, సదాగతి యనంగ జనును దేవ 8

నీవు కుబేరుడ, సంప
ద్దేవియగును ధరణిసుత; ప్రథిత రుద్రాణీ
దేవియగు; సీత; రుద్రుడ;
వీవౌదువు ; వేయి యేల? యెఱిగింతు; విభూ! 9

స్త్రీ వాచకమ్ము సీతా
దేవియు; బుంవాచకమ్ము తిలకింపగ, నో
దేవా! నీవును; నగుదురు
యావజ్జగములను; నీకునన్య మెదియగున్ ॥ 10

దేవ! త్వదా భాసోదిత
మైవెలయు నవిద్య యయ్యె నవ్యాకృత సం
జ్ఞా విదిత దాననే మహ
దా విర్భూతియగు; దాన; హంకృతి వెలయున్ ॥ 11

నానాకార్య నిమిత్తం
బై నిఖితాత్మకము; సూత్రమన, లింగమనం
గానెగడునది; యహంకా
రానన్ జనియించు నంద్రు ప్రాజ్ఞతము లిలన్ ॥ 12

అదియె తజ్జీవ సంజ్ఞాకమై జగన్మ
యమ్మయి ప్రవర్తిలెడు; నోమహాత్మ ! మరియు
వినుమవాచ్య; మనాద్య మౌ
 విద్యయయగు; గారణోపాధి స్థూల సూక్ష్మములు; కార
ణాఖ్య మను మూడు; చితికి నుపాధులగును ॥ 13

వీనితో గూడినపుడె జీవియగు; దద్వి
హీనుడై నప్పుడే పరమేశ్వరుండు
స్వప్న జాగృత్ సుషుప్త్య వస్థాతా త్రితయ కృ
తా వృతి విహీనుడవు నైన సాక్షివీవు ॥ 14

జగములన్నియు నీ నుండి జాతములయి
తవిలి నీయందె, యవి, సుస్థితమ్ములగుచు
నల్లది నీయందెలీనములగుచునుండి
గాన సకలమునకు, నీవ కారణమ్మ 15

రజ్జువును గాంచి, యహియనుభ్రమము నొందు
మనుజులవలె నాత్మ్మగనుచు జీవునిగ దలచె
దేని భయమావ హిల్లును, నే బరాత్మ
నని యెఱింగిన; దుఃఖ భయంబు, లడగు 16

కనగ జిన్మాత్ర రూప ప్రకాశుడవయి,
యఖిల జీవులకైన దేహముల యందు
వెలయు నంతః కరణముల వెలుగ జేయు
దగుటనే దేవ! యన్నిటి కాత్మవగుదు ॥ 17

అజ్ఞతా కారణమున, నీయందు సకల
మునుపబడు, రజ్జువును సర్పమనిన కరణి
నఖిలము నశించు, నిన్ దెలియంగగాన;
నిన్ను దెలియగ బుధుడు, యత్నింపవలయు ॥ 18

తావక భక్తి యుక్తులకు, ధన్యులకున్ లభియించు జ్ఞానమో
దేవ! భవత్పదమ్ముల, మదిం దగ నిల్పిన వారు ముక్తులై
పావను లౌట, నేనును, భవత్పదభక్తుల సేవకుండనై
సేవలొనర్చువాడ; నను జేకొని, మోహ విహీను జేయుమీ ॥ 19

త్వన్నాభికమలజుండగు
నన్నలువయె నాకు జనకుడయ్యెనగుట, నే
నున్నీకు మనుమడను; రా
మన్నా! "మాంపాహి పాహి" యని, నినుగొల్తున్ ॥ 20

అని వినుతుంచి వందన సహస్ర మొనర్చి ముదశ్రుపూర్ణలో
చనుడయి, రామచంద్ర! అలసారస జన్మడు, నన్నుబంప, ని
గ్గన జనుదెంచి నాడ, దశకంఠుని జంపజనించినావు; నీ
జనకుడు రాజ్యరక్షణము సల్పగనిన్ బురికొల్పు; రాఘవా! 21

నీవాగతి రాజ్యరమన్
బ్రోవదలచితేని రావణుని జంపుటెటుల్
నీవీ భూ భర మడపగ
గావింపవొ? ప్రతిన; నెపుడు; గల్ల పలుకుదే? 22

నా విని రామచంద్రుడల నారదునారసి యిటు పల్కెనో
దేవమునీంద్ర ! నే నొకటి తెల్పెద; నే నఖిలమ్మెఱుంగుదున్
రావణుజంపువాడ; బ్రతినంద్యజియింతునె ? కాని తత్పురా
భావిత కర్మ సంక్షయము బట్టియె భూమి భరమ్మడంచెదన్ ॥ 23

దనుజులద్రుంతు; రావణుని దర్పమడంగగవేడ్క, దండ కా
వనిని; జతుర్ద శాబ్దములు; వాసము చేసెద; రేపె పోయెదన్
మునినయి; జానకిన్ వెదకు మోసము చేవని సంచరించుచున్
దునిమెద బుత్రమిత్ర సహితున్, దశకంధరు విశ్వసింపుమీ ॥ 24

అనవిని నారదుండు; ప్రమదాకరుడై, వడిముమ్మఱుంబ్రద
క్షిణములొనర్చి; వందనముచేసి, ప్రియమ్మున రామచంద్రునా
జ్ఞనుగొని, దేవ మార్గమున సాగెను, వీరిసువాద మెవ్వరే
వినిన, బఠించిన గడు పవిత్రతముక్తిని గాంతురెంతయున్ ॥ 25

మొదటి సర్గ సమాప్తం

# నిర్వచన అధ్యాత్మ రామాయణం

## అయోధ్యకాండ - రెండవ సర్గ

పిమ్మట దశరథుడు రహ
స్యమ్మున గూర్చుండి, మౌని సత్తము, గురు దో
డ్తెమ్మనగ, భటులు కడువే
గమ్మున జనితోడితేర గాంచి యిటులనెన్ ॥ 26

గురువర ! రామచంద్రుడు, రఘుప్రవరుండు, నయజ్ఞుడంచు, ని
ప్పురి గలవారు, మంత్రులు; బ్రభూత గుణాఢ్యుడటంచు మెచ్చు చుం
డిరి, ప్రజలెల్ల, రామవిభునిం, దమకేలిక జేయగోరుచుం
డిరి, యిక వేగవాని కవనీ స్థలి నిచ్చెద నీదు సమ్మతిన్ ॥ 27

సకల గుణ నిధి రాముం
డకలంకుడు; జేష్టుడౌట, నతనికి రాజ్యా
దిక మిడ నభిషేకించెద
నిక; భరతుడు మామ యింటికేగె; ననుజుతో ॥ 28

కావున సంభారమ్ముల
వేవిధముల గూర్చి, రామవిభుబిలువుము; రా
జ్యావనమున కని తెల్పుము
నీ వలననె గావలయు; మునీ సకలమ్మున్ ॥ 29

పలురకమ్ముల వర్ణములు గల జెండాలదెసలన్నింట, నెత్తింప వలయు
స్వర్ణముక్తామణ్యు జీర్ణతోరణముల నింపుగా నగరి గట్టింపవలయు
ప్రాకార గతముఖ ద్వారమూలమ్ముల గదళి కాస్తంభముల్ గదియ వలయు
వివిధవర్ణవిరాజి విద్యుత్ప్రహాయ దీపములెల్ల చోట్ల నిల్పంగ వలయు
నని, సుమంత్రుని రావించి 'యార్య' !
వినుము గురువర వశిష్టుడే దేదిగూర్పుమనుచు
గోరునో ? వాని నన్నింట గూర్పు మీవు
రాముని కొసంగెదను యువరాజపదము. 30

ఇటువలుకన్, సుమంత్రుడు; మునీంద్రు వశిష్ఠునిగాంచి; దేవ; నే
నెట; నెది నిల్పగావలెనొ? యీ వెఱగించిన జేయువాడ; నాన్
జటిలుడు; వల్కె గన్యకలు స్వర్ణ విభూషితలౌచు సద్మిలో
గిటం, బదునార్వురుండదగు, కృత్యము రేపటి రేపెగావలెన్ ॥ 31

మరియు, నైరావతకుల సంభవము నాల్గు
దంతముల రత్నభూషల దనరుమత్త
దాని, నొకదాని దెప్పింప దగును మనకు
రామునభిషేక కాలము రాకమున్నె ॥ 32

సకల తీర్థోదక సంపూర్ణ కనక కుంభములు వేలకొలంది నమర వలయు
వ్యాఘ్ర చర్మమ్ములు పదిరెండు తెచ్చి యాసనముల గుదురుగా నునుపవలయు
దివ్య మాల్యమ్ములు దివ్యాభరణములు; దివ్యవస్త్రములు సంధింపవలయు
నర్తక వేశ్యాజనమ్మును వేణుక గాయక ముఖ్యులు గలుగవలయు
మ్రోల వాదిత్ర నాదముల్ మ్రోగవలయు
ఋషుల గుశపాణులను సత్కరించవలయు
నశ్వగజరథ పాదాతు లమరవలయు
నగర దేవతలకు బూజనములు వలయు ॥ 33

నానో పాయనకరులై
పూనికమై సకలరాజపుంగవులు; నయో
ధ్యానగర ద్వారములం
గానబడవలయు రేపు ప్రాత ర్వేళన్ ॥ 34

అని వశిష్ఠుడు నృపమంత్రియౌ సుమంత్రు
బనిచి రథమెక్కి శ్రీరామ భవనమునకు
దానరిగె; వేగ దశరథు నాన బూని
హర్షమున రామ యౌవరాజ్యకథ దెలుప॥ 35

వడివడి, నేగి, యాగురుడవారితుడై, యటమూడు కక్ష్యలం
గడచి, రథమ్మువీడి, భవనమ్ము జొరన్, గురురాక రామచం
ద్రుడు, చెవి సోకినంత, గడుతూర్ణముగా జని రత్న పీఠిపై
నిడి, గురుపాదముల్ గడిగె, బృథ్వితనూజ జలమ్ముజార్పగన్ 36

కడిగి, మునిపాదములపై
బడిన జలము తలధరించి భక్తి వెలయ; నో
జడదారి రేడ! నే ధ
న్యుడనైతి ద్వతంఘ్రి జలము నూనుట కలనన్ ॥ 37

అని విన యోక్తులం, బలుక, హర్ష హసన్ముఖుడై వశిష్ఠు డి
ట్లనె; రఘువర్య ! తావక పదాంబువు దాలిచి శంకరుండు, మ
జ్జనకుడు ధన్యతంగనిరి; సామి, "త్వదంఘ్రి పయోహతాశుభుం
డని వచించి తీవు; గురుడన్, గురు భావన నిట్లు పల్కితో? 38

నిను. నే నెఱుగనా? పరమా
త్మనిగా, సిరితోడ నీవు భువి రాముడవై
జనియించితి; వయ్యమరుల
బనిదీర్పగ; భక్త జనుల భక్తి వెలయగన్ ॥ 39

రామా! రావణ వధమున
కే మహి జనియించి తంచు నెఱుగుదు, గుహ్యాం
బీమాటపలుకను స్వమా
యా మహిమంజేయుచుందు వఖిలముదేవా ! 40

నీ మాట యెయగుగాక, మ
హా మహా ! శిష్యుడవు గురుడనౌదు; గురువర
గ్రామణివి పితల కీవు పి
తామహుడవు; సకల దేవధాముడవు హరీ ! 41

సకలలోక ప్రవృత్తుల జరపు దీవు
జగదగోచరుడవు; శుద్ధ సత్త్వ మై య
ధీన సంభవమగు దేహమూని నైజ
యోగ మాయా బలమ్మున నొప్పెదు; మహి॥ 42

ఇప్పురోహిత జీవిక హేయమైన
దూష్యవృత్తిగ నామది దోచుగాని
యినకులమ్మున జనియింతువని యెఱుగుట
చేడ ! పరమాత్మ ! నేబూనినాడ ; దీని !! 43

ఇమ్మహినీవుపుట్టువు వహించుట నల్వవచింప నీగురు
త్వమున ; నీదు సంగతి సదాలభియించునటన్న నమ్మికన్
నెమ్మి బురోహితత్వమది నింద్యము బూనుక దావకీన వం
శమ్మునకున్ గురుండనయిసాగుచునుంటి నెఱుంగు, మో ప్రభూ ! 44

ఓరఘునందన ! నాదు మ
నోరథ మీ డేర, నీయనుంగు మహామా
యారమణి నన్ను నెపుడు
జేరనిగతి ! జూపి ప్రోవు ; శ్రీ రఘురామా ! 45

గురు నిష్కృతి కాముడనై
పరగెదు ; నీవిపుడు నాదుప్రార్థనముంజే
కురజేయు ; మీ ప్రసంగ మి
తర జనగోప్యమ్ముదాపదగినది, రామా ! 46

నీ జనకు నియోగముచే
నేజనుదెంచితిని ; బిలువ,నినుయువరాజుం
గాజేయు, రేపె రావలె
నీజానకి తోడ ; వహీనగుణాఢ్యా ! 47

రామ ! యీ నాటిరేయి శాస్త్ర గతి శుచిగ
నిర్జి తేంద్రియతను ధరణింబరుండి
చేయు, ముపవాసవిధి ; నిదే శీఘ్రముగనె
పోవుచున్నాడ నేను రమ్ము ; సెలవిమ్ము॥ 48

అని యెఱిగించి తద్గురుడు స్యందనమెక్కి చనన్, రఘూద్వహుం
డనుజుని లక్ష్మణుంగని ప్రహసి ముఖుండయిపల్కె ; లక్ష్మణా
ననుయువరాజుగా బరదినమ్మునసే పచరింతురంట ; నే
గనగ ; నిమిత్తమాత్రుడను, గార్య భరమ్మఖిలమ్మునీదె ; సూ ॥ 49

## అయోధ్యకాండ - మూడవ సర్గ

పిదప వశిష్ఠభాషితము బ్రీతిగ రాముడొనర్చెనంత, మౌ
ని,దశరథుం, గనంగజని, "నీదు నియోగము చేసినాడనన్
గదితమొకండెఱింగి, కడకంజని, కోసల రాజపుత్రికిన్,
ముదిత సుమిత్రకుం దెలుప, మోదమునందిరి వారలెంతయున్ ॥ 50

ఆపయిగోసలాత్మజని, హర్షవికస్వరనేత్రయయ్యె, జిం
తాపరయౌచు ; వల్లభు డొనర్చునె ; యిప్పని కేకయాత్మజా
జ్ఞా పరిపాలనమ్ముకయి, చల్లగ జాటియుపేక్ష సేయునో
యాపరమేశ్వరిందలచి యర్చలొనర్చెద గార్య సిద్ధికై ॥ 51

అని వ్యాకులాత్మయై దు
ర్గనుగని భక్తి మెయిబూజ గావించుచు నుం
డిన దినములలో వాణిం
గని యమరులు తమదుకోరికల దెల్పిరిటుల్ ॥ 52

తల్లిరో ! భువినయోధ్యాపురి రామాఖ్య
నాసరోజాసను ననుమతి చొప్పున ద
నచటమున్నుగ మంథరాస్యమ్మునం
విఘ్నము గావించి పిదప నీయిచ్చకు

అనుచు బ్రార్థింప నామె యప్పనికి సమ్మ
తించి కుబ్జాస్యమున బ్రవేశించ నదియు
గైకయీ సౌధమెక్కి వికస్వరముగ
నగరమెల్ల నలంకృతమగుట నరసి ॥ 53

హా ! వివిధోత్సవాలయ మహత్తర మిప్పురి యంచు దత్పతా
కావిలసిత్పయోద రుచిక్రమము ; కుడ్య విచిత్ర చిత్ర శో
భావృతమున్ ; మనోజ్ఞమణి భాసురతోరణమండితమ్మ యో
ధ్యావిభవమ్ముల్ గాంచి వెఱగందుచు గైకయిజేర : నంతటన్ ॥ 54

ఓసీ ! కతమెదియొ ? యయో
ధ్యా సంగతబహువిధోత్సవాదుల, కిపుడా
కౌసల్య యొసగు, భాసుర
భూసురలకు వివిధ వస్త్రముల, ధనమనగన్॥ 55

అమ్మా ! కైకయి ! చూడవో మన యయోధ్యాలక్ష్మి యందమ్ము ; లే
దమ్మా ! కన్గవనీకు జాడుమదె ; సర్వాంగీణశోభావిశే
షమ్మెరంజిలె ; దీనికిం, గతము గాంచన్, లేదొకో, వెఱ్ఱి, నా
గమ్మా ! రాముడు రాజ్యమేలునిక ; దత్కౌసల్య వర్ధిల్లనాన్ ॥ 56

అంతట దానికి గైకయి
సంతసపడి సెజ్జపయినిశయనింపగ ; నే
కాంతమున జేరి మందర
వింతయు గోపమ్ము గదుర ; వేగిరపడుచున్ ॥ 57

అదియిటువల్కె ; గైకయి ! యహో వినిపించితిగా గతమ్ము, ర
వ్వుదయమునందె ; రామునిమహోదయ రాజ్యరమాభిషేకమౌ
టదెలుపలేదా ? యట్టులగుట న్వినియుంగనియున్, ముదంబదే
ల? దశయొకింతమాఱ ; సవిలాసతనుంటివి వెఱ్ఱిదానవా ? 58

వంతగలిగించుదుర్దశ
చెంతకురానున్న దనీయు జింతింప కిటుల్
సంతసిలెద ; ళ్లాపద గో
రంతయు గొండంత యా ; నుదాసికగొనినన్ ॥ 59

అద్దిర యిప్పుడు నీకీ
నిద్దురపై గోర్కి రాజనీతి యగునె ? నా యీ
సుద్ది విని మంచి తెరవున్
బుద్ధిం దలపోసి బ్రతుకు పోకడగనుమీ ॥ 61

దేవీ ! తెలియవాకో ? సీ
తావిభు ; యువరాజు జేయదలచి విభుండ
మ్మా ! వివిధాలంకృతముగ
గావించెబురమ్ము ; రేపెకనెద ; వటన్నన్ 62

ఆ మాటల్విని కైక వల్కెనిటు ; ప్రేమార్ద్రాంతరంగమ్ముతో
నేమే ! మంథర! హర్ష వార్తయిది కొమ్మీయరత్న హారమ్ము; నా
కేమై గల్గె భయమ్ము; నాకిది ప్రియమ్మే! రాముడీ సర్వ రా
డ్భూమింబ్రోచుచునుండుటల్మనకు సమ్మోదమ్ము గాదే? చెలీ! 63

నా యెడ రామచంద్రుడు; ఘనంబగుభక్తిని జూపి వర్తిలున్
శ్రేయము వాని కెల్లపుడు జేకురగోరుచునుందునేను, సీ
తాయువతీ సమేతుడయి; తత్పరతన్మన రాజ్యమేలుటల్
పాయనిమోదకారణము భాగ్య దినమ్మని నేదలంచెదన్॥ 64

కౌసల్య తోడ ననుసరి
గా సంతోషమున గాంచి కల శుశ్రూషల్
చేసి చనుచుండుగదె! యో
దాసీ! రామునెడ ద్వత్కృథా హేతువెదో ? 65

అనవిని దాది పల్కె వినుమా యనుమానము మాని, నానుడుల్
జనకుడు; రామచంద్రుని రసావిభుగా నొనరించునంత; ని
న్గనుగొని; కోసలాత్మజ యొకానొక దాసిగ, దాదలంచు; నీ
తనయుడు, రామచంద్రునకు; దాసుడుగా జరియింపవలెన్ ॥ 66

ఓటమిగల్గె; నీకిపుడయో! కృతకాత్ముడు, గాముకుండునై
బూటకమారగల్లయొరపుకి మెఱయించుచు, నీమగండె; యీ
నాటకమాడి; నీదు వదనమ్మునటిట్టులు దుమ్ముగొట్టె ; నా
మాట నిజమ్మునమ్ము; మవమానము నీకగువేళ వచ్చెనో? 67

కార్యము కౌసల్యది; మా
ధుర్యయుత మృషోక్తి; నీది; దుష్ట నృపతి చా
తుర్యమ్ము జూపి, యిప్పుడ
నార్యముగా రామచంద్రునధిపతి జేయున్ 68

బాలవా? బేలవో? జరగు పద్ధతి యర్ధముచేసికోక, యీ
లీలగ, నీవు దీనికొకలీలగ గన్గొను చుంటి వయ్యొ నా
చాలిన యంతకున్ శుభము సంధిల నీ యెడసంచరింతు; నో
బాలికురాల! తెల్పెద; నుపాయము; నీ చెవి బెట్టుచేయుమీ ॥ 69

అగు, నిదెవచ్చు, నిన్నుగన; నాతడు, తత్సమయమ్మునందు; న
ల్కు, గనంబడన్నటియించుచు; నలంకృతులన్విడ నాడి మైల చీ
రగొని పరుండు, దీనత ధర, న్మగమందు ముసుంగువైచి నీ
మగడు, ప్రియోక్తులం, బలుకు, మానకు కోపము నీవునెచ్చెలీ! 70

అడుగు నతండు నిన్ను గుశలాదిక మప్పుడు ముసుంగు ద్రోయుచున్
జిడిముడి పాటియై, దరికి, జేరగరాదను, నీవు కోపమున్
విడువగ; నీదుప్రాణములు నిల్వగ నల్లన నిన్ను జేరి, నీ
యడుగుల వ్రాలి; నీ వలయునట్టిది కోరుమనంగ బల్కుమీ॥ 71

నాడుతద్దేవ దానవయుద్ధమున నీ సహాయత కోరెసురాధినేత
యపుడేగి; దనుజసంహారణమీ వొనరించునప్పునీ రథకీలమవని జాతె
దాన; నావ్రేలిని బూనిచి రాక్షస జయమును నీకు రక్షణము గూర్ప
గడుమెచ్చి నీవు నాకిడవొ వరద్వయమద్దాని దగు సమయమ్మునందు
గోరికొనియెద సత్యవాక్కుడవు గమ్మ
టంచు బలికితి నని తద్వయమున నొకటి
భరతునకు రాజ్యదానము మరియునొకట
రామువనవాసమీవుకోరదగునతని ॥ 72

కైకయీ! నీ సుతుని; మామగారి యింటి
కనుపుటకు గారణంబెదోయరయరాదొ?
తత్సుమిత్రకులోపమింతయును లేదు
రామలక్ష్మణు లిరువురు రాజ్యపతులె॥ 73

అయ్యయో ! రామునకు రాజ్యమబ్బునేని
భరతుని బ్రవాసితుగ జేసి, పారద్రోలు
గానిచో వాని జేయు గింకరుని గాగ
సవతిలోకువ కంటెను జావెమేలు॥ 74

అతి పరిశుద్ధ చిత్తయగు, నాభరతాంబిక మంధరా విబో
ధిత కుటిలాధ్వముంగొని, యధీరయువ్యాకులచిత్తయౌచు నే
గతి తెలియంగ జాలక, నికామశుగంబుదోగె, దుష్టసం
గతి, భువినెట్టిదైనను, వికారము నొందక యుండజాలునా॥ 75

ఆపగిది; మంధరోక్తా
లాపమ్ముల వినుచు, మంగళమె పలికితి, వో
సీ! పటుమతివి గదా! నా
ప్రోపె తలంచితివిగాన వొనరింతునటుల్ 76

భరతుడె రాజౌనెడ, మం
ధర తప్పక నీ కొసంగెదను గ్రామశతం
బరయు మిది సత్యమని; త
ద్భరతజనని యరిగె; గోపభవనమ్మునకున్॥ 77

చని మంధరోక్త పద్ధతి
గొని మలినాంబరయు, శిథిలకుంతలయును, భూ
షణ హీనయగుచు స్థండిల
ముమ సెజ్జగ జేసి వ్రేలు ముసుగిడి యుండెన్ ॥ 78

ఎంతటి సజ్జనుడేనియు
నెంతటి ధీమంతుడైన యేని గుమతులం
జెంతను చేర్చిన వంతకు
జింతకు బాల్పడుట, వేఱ చెప్పగ, నేలా ? 79

అటనా పంక్తి రథుండు, రాఘవుడు రాజ్యాధీశుడై రక్ష, సే
యుట యౌనంచు, ముదమ్ము నొంది, నిజసౌధోద్దేశముంజేరి, య
చ్చట, నా కైకయి జాడ జాడమికి, నిచ్చల్నొచ్చి, తచ్చేటికా
కుటిలన్మంధర దద్విధమ్ము దెలుపంగొరెన్ విషణ్ణాత్ముడై॥ 80

ఏమే మంధర ! నాదురాకవిని మున్నేస్వాగతంబిచ్చి నన్
బ్రేమంగాచెడి కైక యీతరుణి, నన్, బ్రేక్షింప రాదేమి, లే
దే మన్మందిరమందు దెల్పరిది మేలేయంచు బ్రశ్నించె, దు
ష్కామాంధుల్ పడరాని పాటులకు, నిక్కల్గారొ,యెందేనియున్ ॥ 81

వారిటులనిరి; దేవా!
కారణమేదొ? మేము తెలియగాజాలము; త
ద్వారిజలోచన; యేటికొ ?
చేరెను; గోపగృహ; మీవె చేరి తెలియుమీ॥ 82

అది విని భీతుండై యా
సుదతి దరింజేరి కూరుచుండి కినుక నే
లదొరలు నామెంగని యో
ముదితా! యిది మేలె? నీవుపుడమిదొరలగన్॥ 83

అనిమెయిదడవుచు; నీ మం
డనములు వర్జించి యిటులిలన్, నీవీ సె
జ్జను నలిగిన వసనమ్ముం
గొనిశయినించితివి; నీకు గోపంబేలా? 84

వలసినదేదొ? కోరికను, వల్లభుడన్గద నీకు నేను నీ
తెల్పియనిదొక్కొ ; నాయెడద ; దేవి ; సుదుర్లభమైన దానినే
న్గలుగ నొనర్తు ; నీకు ; నపకారమొనర్చినవారి దెల్పినన్
వెలదియు, బూరుషుండనక ; వేగమవారి వధింతు సుందరీ ! 85

విను ; నీ కపకృతి జేసిన
ధనికుని జేయుదు దరిద్రతాధుర్యుని ; ని
ర్ధనుడయ్యు నుపకృతిం జే
సినవానిని బరమ ధనికు జేసెదనింతీ ! 86

వేయేల ? వినుము, నాకా
ప్యాయితుడైనట్టి రాముపయినొట్టిడెదన్
నాయెడ బ్రసన్నవగుచు, న
మాయికవై చనవుచూపిమన్నింపగదే ॥ 87

పుడమిపతి రాముపయి నా
ట్టిడుటకు గడునలరి కైకయీసతి, కనులం
దుడిచికొని, మెల్లగా, ని
వ్వడువున నుడి తడబడంగ బలికె ; మగనితో 88

శపధము చేసెదేని నృపచంద్ర ! వచించెద బూర్వ వృత్త ; మీ
వపుడు ; సురాసురా హవమునందు వరద్వయమిచ్చి దాని ;నీ
వెపుడు వరింప, దత్ క్షణమయిచ్చెదనంట ; వసత్యవాదివా ?
యిపుడది గోరుదాన ; వినుమీ మనుమీ నను మానమేటికిన్ ? 89

దాచికొనినట్టి తద్వరద్వయమున నిపు
డీరు చేర్చిన నేటి సంభారముననె
భరతురాజ్యాభిషేకసంపన్ను ; రాము
బదియునాల్గేండ్లు తద్వన శాసగతుని 90

ఒనరించి రామచంద్రుడు ;
మునివేషముతో నరణ్యమును జేరగ ; నీ
వనుపు ; మొకట , వేఱొక్కట
నునుపుము రాజ్యమున భరతు ; నోనృపచంద్రా ! 91

నరవర ! రామచంద్రుడు వనాన జతర్దశ వత్సరమ్ములన్
జరపి ; యనంతరమ్మిటకు ; సాపడవచ్చును గాక , కానిచో
జిరతరకాలమచ్చటనే చేరి ; వసించునుగాక ; రేపె మం
దిరమున నుండరాదు ; మరణించెద నీవటు సేయకుండినన్ ॥ 92

ఆ పరుషోక్తులన్నివినయంతనె వంతయుజింత హెచ్చగా
గోపవిఘూర్ణితాస్యుడు, నిగూఢ విషాద సమాకులుండునై
భూపతి ; వజ్రపాతహతభూరి గిరీంద్రము పోల్కి, నేలపై
బాపయటుల్ తొరంగె ; గడుచక్కని నందనుపొందుడిందుటన్ ॥ 93

కొంతవడికి దెప్పిఱి నే
త్రాంతములందుడిచికొని భయమ్ముగదురగా
వింతకలయొ ? మానసవి
భ్రాంతియొ, యని చూచి యెదుట వ్యాఘ్రియగుసతిన్ ॥ 94

ఏమే ? పల్కెదవిట్లు ప్రాణహరమౌ నిద్దారుణాలాప, మా
రాముండెన్నడు ; నీయెడం దొస గొనర్పం జూచితే వానినిన్
నా(మ్రోలన్మరి తల్లి మ్రోల , సుజనానందార్హుగా జెప్పలే
దే మాతన్నిను నొక్కరీతి గన లేదే ? యాతడో ఘాతినీ । 95

తొయ్యలీ ! రాజ్యమును భరతునకొయిమ్ము ;
ఓసి ! శ్రీరామునాయింటనుండ నిమ్ము
అతని నుండి భయమ్ములేదనుట నమ్ము ;
వామ ! రామునికై నన్ను వదలి పొమ్ము ; 96

ఆ రాజిటువల్కుచు గ
న్నీ రొలుకుగ ; నామెచరణ నికటమునందు
జేరి, వికలాత్ముడగు చుం
బోరన మొరవెట్టి ; వీరపురుషుండయ్యెన్ ॥ 97

ఆ రమణునరసి కైకయి
చారువదన యయ్యె ; రక్తచందంబకయై
ఓరాజ : మతి చెడెనే నీ
వీరీతి ; నసత్య మాడెదేని నరకమౌ ॥ 98

రామచంద్రుడు నార చీరల ధరించి
రేపరణ్యమునకు బోవనోపడేని
విషముతినిగాని, యురిదల వెట్టిగాని
నీవుగనుచుండ నే మరణింతు నిజము ॥ 99

అఖిల సభలందు , నేను స
త్యధనుననుచు లౌకిక విడంబనార్థమై కేకవెట్టి,
రాముపై నొట్టువెట్టి ; తత్ప్రేమమున
నన్నృతమాడెదొ ? నరకము నందెదీవు ॥ 100

అటులు కటువుగ, గైక వల్కుటయు దీను
డగుచు దుఃఖాంబురాశిమునిగి పుడమిని,
మూర్చితుండయి పడిలోకమును తెలియక
త్యక్త జీవితువలె గాననయ్యె నృపుడు ॥ 101

అతని, కానాటి రేయి, దుఃఖాప్తివలన
నొక్కవత్సరమనదగియుండె ; నరుఁణు
డగ పడెడి వేళ ; వంది గాయకులను తుల
నాడె గైకయి కోపదీప్తాస్యయగుచు ॥ 102

అంతట దెల్ల వాఱుసమయమ్మున జేరిరి మధ్య కక్ష్యమున్
సంతసమొప్ప బ్రాహ్మణులు, క్షత్రియులు, న్వైశులంఘ్రి జన్మ ; లా
ద్యంతముగా బురింగలిగినట్టి జనంబులు, గన్యకల్, మునుల్
చెంతలజేరి, రామునభిషక్తుని జేయగ జూచు వేడుకన్ ॥ 103

చామరంబొకడు ; ఛత్ర మొకండిభ
మొకటి ; వాజి యొకటి ; యొప్పెనచట
నూరివారు, వార యువతులు
నాబాలవృద్ధముగ బుర సమృద్ధి గూడె 104

వేయేల ? యలవసిష్ఠుం
డేయవి గావలయుననుచు నెఱిగించెనొ ? యా
యాయి సకల సంభారము
లాయెడ నాయతములగుచు నమరె ; భవానీ ॥ 105

సర్వభూషణ సంపన్ను స్వర్ణవసను
శతమదన సుందరు గిరీట శస్త్రమకుటు
గౌస్తు భాలంకృతు ; స్మితాస్యు ; ఘననిభాంగు
రామునభిషిక్తు గనగ బౌరజన మలరి ॥ 106

లక్షణాన్వితుండు లక్ష్మణుడు సితాత
పత్రధారియగుచు బ్రక్క నుండి
వెలయ ; నేన్గు నెక్కి విచ్చేయు రాఘవు
నరయు భాగ్య మెప్పుడగునొ ? మాకు 107

అని వారుత్సుకతం గను
గొనగా "దశరథుడదేలొకో ? మేల్కొన, డిం
దనుక" నని సుమంత్రుడు ; తా
జనుదెంచెను నృపతి యున్న సద్మమ్మునకున్ ॥ 108

అటుచనుదెంచి, మంత్రివరుడానృపవర్యునిగాంచి, నాథు, చెం
గట వసియించి యున్న యల కైకయి చక్కటినెంచి; తల్లిరో?
యటు; లితడార్తుడైయునికి; కేమికతమ్మో? వచింపుమన్న; న
క్కుటిల తరాత్మ; యాతనిక కుంఠిత ధైర్యము మీర నిట్లనెన్ ॥ 109

మంత్రివర! యితడేమొకొ? మరియు మరియు
రామ, రామాయనుచు గత రాత్రి నిదుర
మాని, దొరలుచు; నస్వస్థమానసుడయి
యుండి వానిని గన గోరుచున్నవాడు 110

వేగ, నీవేగి యతని రావింపు మనుడు
విని; సుమంత్రుడు; దేవి! నీ విభుని యాజ్ఞ
గాక, నేనెట్లు దెత్తురాఘవుననంగ
రాముదోడ్తెమ్మనియె, దశరథ విభుండు ॥ 111

అనుటయు నా సుమంత్రుడు, జనాధిపు నానతిబోయి రామచం
ద్రునిగని; దేవ! రాగదే! నినున్, జనకుండరయంగ గోరుచుం
డెననగ; రామచంద్రుడు వడిన్, రథమెక్కి సుమంత్రుతోడ, దా
జనియెను, లక్ష్మణుండును వెసన్ జనుదేరగ దండ్రి మేడకున్ ॥ 112

చని, యట, మధ్య కక్షమున, సద్గురు ముఖ్యులు నిల్వగాంచియున్
జనకుని గాంచగాజని; వినమ్రత మ్రొక్కుచు; లేవ; దండ్రి; చె
ల్మి నతని గౌగిలించికొనలేచి; కరమ్ములుచాచి, నేలపై
దనువుదొరంగ, నశ్రుజలధారల మేన్ దడియన్విచేష్టుడై ॥ 113

కూలి; శుగార్తుడైన జనకుందనయంకమునందు జేర్చ; గో
ల్గోలని; కాంతలెల్లరును; ఘోష యొనర్చిరి తద్గురుండు, త
త్కాలమెవచ్చె; రాఘవుడు; కైకగనుంగొని తల్లి! యీతడి
ట్లేల తపించు; నా; బలికె, నీవెనిమిత్తము వీని కంతకున్ ॥ 114

వినుయొక మాటదేల్పెద; వివేకివి; సత్యధనుండ వౌట;
జనకుడు; దుఃఖశాంతిగని, స్వస్థత నొందెడి కార్యమీవ చే
యనగుదు; వాత డొక్క సమయాన; వరద్వయమిచ్చి; తానె; వా
నినెఱుగ జేయ సిగ్గుపడి, నిన్నిటరమ్మనిపంచె రాఘవా ! 115

సత్యపాశ బద్ధుడౌ జనకుఁబ్రోవ దగుదు
వోరామ! నీదు పుత్ర పదమిపుడు
సార్థకత నొందగా నిరయమ్ము నుండి
యతని దప్పించి రక్షింపు; మనఘ చరిత! 116

నావిని, రామచంద్రుడు; మనంబునజింతిలి; తల్లి కిట్లనెన్,
దేవి! యొనర్చుచుంటిని; ప్రతిజ్ఞనిదే; విను తండ్రిగూర్చి నా
జీవితముం, దృజియింతు, భుజించెద, నేవిసమైన గాని, న
న్నీ విధి; నీవు; పల్కుట, కదెంతయు వంత వహింతు; దల్లిరో! 117

కౌసల్యాదేవిని; సీ
తాసతి; రాజ్యమ్ము నేని త్యజియించెద; నా
బాస, యిది, నమ్ము; రాముం
డే సమయమునందు బల్కడిరు తెఱగులుగా॥ 118

చెప్పుదు రుత్తముడని, పిత
చెప్పకయే చేయునతని; జెప్పిన పైదా
నొప్పికొనునదని, మధ్యము
నప్పనియోగమును వినని యతని, నధముగన్॥ 119

అని కేకయ నందన గ
న్గొని, తల్లీ! జనకుడిట్ల గుటకుం, గతమే
మని యడుగ; నామె; మదిగొం
కును జంకును వీడి పలికె; గుత్సితమతియై॥ 120

రామ! నే గోరి నట్టి వరద్వయమ్ము
నందొకటి భరతునకు రాజ్యమునొసగుట
రెండవది; నీవు; పదునాలుగేండులడవి
నుండుటయు గోరితిని విభుండొసగె వాని॥ 121

అనవిని యానృపాలుడు శుగాకులుడై; రఘురామ! భ్రాంత చి
త్తుని; గుపధాను వృత్తిని, వధూజితుగా, నను ద్రోసిపుచ్చి; నా
కన్నతము కల్గనీక, సకలావనినేలుము; దీన బాపమీ
వెనయువు; సత్యవాదినని యెంతుచు నన్ను ద్వయమ్ము చేకురున్॥ 122

ఇంతెవచింతునంచు, మదినెంతయు, వంతయు, జింత హెచ్చుటన్
సంతత  ధారగా, గనుల చక్కటి, నశ్రుజలమ్ము లొల్క, మ
త్స్వంతతి రత్న! నాకు గడసారి కవుంగిలి నిమ్మటంచు, స్వ
ప్రాంతము చేర్చి ముద్దు గొని బారని యేడ్చెను ముక్త కంఠుడై ॥ 123

కనుగొని;  రాముడాజనకు కన్గవనొల్కుచున్న యశ్రు బిం
దు నికరముం, దొలంచి; యిటు దుఃఖమదేటికి, రాజ్యమేలు నా
యనుజుడు; నా ప్రతిజ్ఞ తుది నందిన పిమ్మట; వచ్చి  గాంతు, బా
వన వనవాసమే ధరణి పాలన కంటె సుఖమ్ము నాకిడున్ ॥ 124

నీ సత్య రక్ష; మద్వన
వాసమ్ము మహా గుణమయి వర్తిలు; గై కే
యీ సతికి బ్రియమ్మగు; జన
కా! సెలవిడి; పంపు; మరియు గాంచెద; నిన్నున్ ॥ 125

నిలుపు; మదభిషేకము, ని
స్తుల సంభారముల నెల్ల; దొలగింపుము; కో
సల నృప సుత యూఅడిలం
బలికి; వనికిబోయెదను, నృపా! సెలవనుచున్ ॥ 126

కొనిజనకాజ్ఞ; తల్లి కడకుంజనె రాముడు; నామె గాఢ భ
క్తిని;సుత సౌఖ్యసంపదకు; గేవలునా హరి బూజ సేయుచున్
మనమున నిల్పి; చిన్మయు; ననంతు; ననాద్యు నిరస్తమాయు, వి
ష్ణుని, జగదేకరూపుని, గనుంగొనుచుం గనకుండె, రామునిన్ ॥ 127

అధ్యాత్మ రామాయణం 3వ సర్గ సమాప్తం.



# నిర్వచన అధ్యాత్మ రామాయణం

## అయోధ్యకాండ - 4వ సర్గ

సుత్రామ నీలమణి నిభ
గాత్రుని రాఘవు సుమిత్రగని "యక్కా! నీ
పుత్రుని గనవే; యస్మ
న్నేత్రోత్సవకరుని", రామునిన్, గుణ ధామున్ ॥ 128

అనుడు నిజావలోకనము నాత్మజుపై మరలించి కౌగిటన్,
గొని, మృదులాంకమందునిచి, కోసల నందనముద్దుగొంచు; నో
తనయ; భుజింపలెమ్మనగ; దల్లిరొ? పోవలె నేను దండకా
వని; బదునాలుగేండులు నివాసము సేయననుజ్ఞ నీగదే 129

ఇచ్చిన బాస గడప, నే
నిచ్చ నచట నిలిచి, మరల నేతెంచెద; నా
పొచ్చెము జింతింపక నన్
బుచ్చుము, దీవించి నాదు మ్రొక్కుల గొనుచున్ 130

అప్పరుషోక్తి కర్ణముల; నంటిన వెంటనె, యామె నేలపై
గుప్పగ గూలి " పుత్ర! రఘు కుంజర! నన్విడనాడి నీవు, పో
దప్పదయేని, నీ వెనుక దల్లిని దీసుకు పొమ్ము వేఱుగా
జెప్పగ నేల? వత్సమును జేరక, గోవు చరింప నేర్చునా ? 131

నాయన, కైక మాటయె, ఘనంబని రాజ్యము నెల్లనిచ్చినం
బో! యది యేటికిన్మనకు బుణ్యమొ పాపమొ? యాతడందు, ని
న్నాయను; దల్లి తండ్రులొక పాటియె, గాకధికంబునేన, ని
న్నాయనగారు పంప, వలదంటిని, నేను, మదాజ్ఞబూనుమీ ॥ 132

కైక పై, రాజునకు బ్రేమగలదయేని
రాజ్యమంతయునిడనీ, భరతునకిపుడె
యీవొనర్చిన యపరాధ మేమిగలదు
వనమునకు నీవు పో నేల? వలదు పుత్ర ! 133

జనకునాజ్ఞను బట్టి నీ జనని మాట
ద్రోసితివా? ప్రాణముల్ త్యజింతును గుమార!
మున్నుదప మొనరించి, నిన్గన్న దాన
నొక్కదినమేని, నినుబాసియుండగల నా? 134

అని మొఱవెట్టుకోసల నృపాత్మజ పల్కులనాలకించి, ల
క్ష్మణుడురు కోపదీప్తుల జగత్త్రయమున్ దహియించునట్టులై
విను; రఘురామ! భ్రాంతుడయి; వెఱ్ఱిగ బల్కిన తండ్రి మాటకున్
జనియెదె? యాతడొక్క యెడ జచ్చిన యట్టులు నుండు; నుండనీ ॥ 135

మరియొక మాటతెల్పెదను; మాను పరాదికనన్ను, నిప్పుడే
భరతుని, వానిమాతులుని; బంధుల నాశిత సాయకమ్ములన్
బరపివధింతు, లోక మదిబాగను, నోగను, గాక, నీవ, యీ
ధరణి భరమ్ముమోవవలె, దప్పదునేనిదె విల్లుపూనెదన్ ॥ 136

చలమున నిన్ను గానలకు, సాగగనంపెడి కైక రాక్షసిన్
నిలువగనీను; దాని సుతునిన్, సమయించెద, నీవుపల్కు, ప
ల్కులికను; నా చెవింబడవు; కోపము నాపికొనంగలేను, బా
పుల పరిమార్చుటే, మిగుల బుణ్యమటందురు చూడు మగ్రజా! 137

అని మితిమీరి పల్కుచు; నుదగ్రత చూపెడు లక్ష్మణుంగనుం
గొని, కవుగింట జేర్చి, రఘుకుంజర! తమ్ముడ! శూర శేఖరా!
నను గడుభక్తి జూచెదవు; నమ్మితిగాని, హితోపదేశమున్
విను, మిదిగాదు వేళ నిజ విక్రమముంగనుపింప సోదరా! 138

అనుజా! రాజ్యము; దేహ గేహములు; నిత్యమ్మౌనె? సత్యములే
కనుమీ! భోగము, లబ్ధ మధ్యగతటిత్కల్పమ్ముకా, నాయువై
నను, వైశ్వా నరతప్తలోహజల సంతానమ్ము నిత్యమ్ముకో?
విను, మట్లేని, భవత్పరాక్రమమ్ము జూపింపన్ ఫలావాసమౌ 139

వ్యాళ గళస్థభేక, మిరువంకల గన్పడు దంశరాశికై
నాలుక చాచునట్లుగ; జనమ్ములు; కాలభుజంగ దష్టులై
కాలమదెల్ల; నస్థిర సుఖమ్ములకై బహు కర్మవారిధిన్
దేలుచు మున్గుచుందురు; నిత్యము; జ్ఞానము లేమి సోదరా! 140

అరయ బురుషుని కంటెదేహమ్ము వేఱు
దీన భోగముల తనికెట్లౌనొ కనుము
దారపుత్రాదికము శాశ్వతమ్ము గాదు
వినుము సోదర ! నీదు వివేక మేది ? 141

ఏటను వచ్చుచు, న్నడుమనించుక కూడుచు వీడు మ్రాకులే
బోటియు; బంధుమండలియు బుత్త్రులు మిత్రులు వీరు తత్ప్రపా
వాటిక జేరు మానవుల భంగి దొలంగుచు నుంద్రుగాదె! నీ
వేటికి? వీరి మైత్రికడు హీనముగా గనలేదు సోదరా ! 142

ఛాయవలె లక్ష్మిచంచల, ప్రాయ మరయ
సలిలబుద్బుద తుల్యము; వెలది పొందు
స్వప్న సుఖసమ; మాయువల్పమ్ము; జంతు
సంతతి కదేల తుచ్ఛ సంసార వాంఛ ॥ 143

రోగాది సంకులము; ధృత
రాగము; గంధర్వ నగర రమ్యము; దుస్సం
యోగము సంసారము; నీ
వీగతి గ్రాహ్యముగ దలచెదేమి ? వివేకీ ! 144

ఆదిత్య గతాగతముల
చే దినములు గడవగనచర జీవితుడై
ఖేదమె మోదమ్మని, యవ
సాదమునొందెడిని, మూఢ జనము భవమునన్ ॥ 145

పలువురు ముదిమియు మృతియుం
గలుగుట దమకన్నులార గాంచియు, నవె, రా
త్రులవే, పవళ్ళుగా సుఖ
ముల భుజియించెదరు ధరణి మూఢలు వత్సా॥ 146

గడియ గడియకు నిజాయువు
కడువడిగా దరుగు; నామ ఘటజలమువలెన్
జెడురిపుల మాడ్కి, రోగము
లడగించు శరీర బలమునని, తెలియవొకో ? 147

ముదిమి మరియు బెబ్బులివలె
బెదిరించుచు నెదుట నిలిచి భీతి గొలుపుచున్
గదియగ మృత్యువు తన్నున్
వదలక వెన్నాడి యుండువత్సా! తెలియుమీ! 148

కృమిమల భస్మమ్మగుదే
హమును; దానుండి కడున హంకృతి మై; లో
కము మెచ్చు నృపుడనని గ
ర్వముతో వర్తించు ప్రాణి వర్గము వత్సా? 149

ఎమ్ములు, చర్మము, మలమూ
త్రమ్ములు; రేతస్సు, మాంసరక్తము; లెచటన్
గ్రమ్మికొని యున్న తద్దే
హమ్మపుడేనైన, నాత్మమగునొకొ? వత్సా! 150

దేనికయినీవు, లక్ష్మణ!
మానవలోకమ్ము గాల్పమదినెంచితొ? యా
మేన; నభిమాన మూనిన
మానవుడ నివార్య దోషమగ్నుడగు గదా! 15

మేనే, నేనను బుద్ధి నె
జ్ఞానులు తెల్పుదు రవిద్యగాగ, జిదాత్మన్
నేను తనువెట్టులయ్యెద
నా, నెగడెడి బుద్ధి, విద్య నా బడువత్సా! 15

భవహేతువ విద్యయె; త
ద్భవ వారిధి గడవ; విద్యతరణియని; ముము
క్షువు లద్దానిని దెలియగ
దవు యత్నము చేయుచుండెదరు, విను, మనుజా ! 15

కామ క్రోధాదులు; వి
ద్యా మహిత ధనమ్ముగా గొనెడి తస్కరు; లందున్
క్షేమ రిపువు క్రోధము; నీ
వె మెయినేనిం, ద్యజింపుమీ; దానినికన్ 15

కోపము భవబంధనమగు;
గోపము ఘనవైరి, నరునకుం; దృష్ణ; మహో
తాపకర వైతరణియగు
నోపికమై; వీని జేర్వకుండుము వత్సా! 155

కోపము పాపకారణ, మకుంఠిత మోక్షవిరోధి తన్మన
స్తాపకరమ్ము మాతృపితృ సంతతి సోదర ఘాతకారి, దు
శ్శాప నిదానమై; విమల శాంతి కుజమ్మునడంప వేఱువు
ర్వై పరుషోక్తి గూర్చునది; యక్కట; దాని ద్యజింపు; తమ్ముడా ! 156

సంతోషమె నందనవని
శాంతియె తత్కామధేను సమ, మగుటను త
చ్ఛాంతిని భజింతువా, నీ
కింతేనియు శత్రువర్గమే లేదనుజా ! 157

దేహ విషయ మనః ప్రాణాదిప్రభృతుల
కంటె వేఱయి; తద్విలక్షణము నగుచు
శుద్ధ మౌనాత్మ; తా స్వయంజ్యోతి; వికృతి
రహితయు; నిరాకృతయు స్థిరమ్మునగును 158

ఎంతవరకాత్మ; ప్రాణ దేహేంద్రి యాన్య
భావము వహింప దోయంత వరకు, భవగ
తమ్ములగు దుఃఖముల కెల్ల దావయి, తుది
మృత్యుముఖ గతమగు చుంట యెఱుగు మనుజ ॥ 159

కావున నిర్మల మతివై
భావింపుము, దేహ బుద్ధి ప్రభృతులకున్, వే
త్రై, వర్తిలు, నాత్మ యనుచు;
నీ వెఱిగిచరింపు; దుఃఖమెనయకు; వత్సా ? 160

సుఖమొ? దుఃఖమొ? ప్రారబ్ధ మఖిల మనుభ
వించుచు ప్రవాహగతుడవై, వివిధ కార్య
సంచయ మొనర్చు చుండిన గొంచమేని
వాని ఫలముల నెన్నండు, బడయ, వనుజ ! 161

వెలికి, నెల్లెడ గర్తవై వెలయుచుండి
యంతరంగాన, శుద్ధుడవైతి వేని
లక్ష్మణా! కర్మ ఫలమందు, లవమయేని
నిన్ను జేరగ రాదని యెన్నవచ్చు ॥ 162

నా యీ తెలిపిన సర్వము
నీ యెద భావింతువేని, నీవెపుడును, దుః
ఖాయతనము గావు సుమీ
శ్రీయుత మిది; దీని, నీవు చేకొను, మనుజా! 163

అంబ! నీవును నా చెప్పినట్టి దెల్ల
హృదయగతముగ జేసెదవేని, సౌఖ్య
మొదవు; మరియును; వేగ వచ్చెదను జుమ్మ
శాంతి పూనిన దుఃఖముల్స మసిపోవు ॥ 164

తరచునదీ ప్రవాహ పతిత ప్లవముల్, గమియించుచుం, బర
స్పర, మొకచోట గూడి, యవశమ్ముగ, వెంటనె, వీడుచున్న, మా
దిరి, భవమార్గవర్తులు, ప్రతిక్షణ యోగవియోగముల్, భరిం
తురు; సహవాసమొక్కెడ; సుదుర్లభ; మంబ! గ్రహింపు; మింతయున్ ॥ 165

పదియు నాల్గేండ్లు మాత్ర; మం
బ! వనమందు దండ్రియానతి చొప్పున నుండి పిదప
మరలి వచ్చెద బునరాగ
మమ్మువరకు భర్తృసేవల గాలము పనుపమమ్మ 166

తల్లి నేనొక్కడనె తక్క దక్క సుతులు
నావలె సభక్తి కమ్ముగ బావనమగు
తావకీన పదాంభోజసేవ సేయ
కుందురే ? యంతలోన, రాకుందునమ్మ ! 167

సవతిమాటను జెవిబెట్టి జనకుగాని
గహనము కన్పినట్టి కైకయిని గాని
నీవు దూఱక, మిగుల శాంతిని వహింతు
వనుచు నమ్మెదనింక, నాకానతిమ్ము ॥ 168

అమ్మరో ? నేను జెప్పి యట్లు నీవు
చేసెదవ యేని; నావనవాసమెంతొ
సుఖముగాజను; గాకున్న శోకమె యగు
నేనుచు దండ ప్రణామమ్ములాచరించి 169

తన పదవారిజాతముల దాల్చిన రాఘవు మస్తమందు, మె
త్తని, నిజహస్తముల్ జొనిపి, తాల్మిని లేవగదీసి, అయ్యో! నా
యన! గహనాలకేగెదవు? యానతిగోరెదొ? నిన్ను గాంచి, పెం
చిన ఫలమిట్టులయ్యెనా? యిసీ! యల కైకయి; యిట్లుచేసెనా? 170

అనుచున్, రాఘవు, స్వాంకమందునిచి, బ్రహ్మాదుల్, సురల్, శంకరుం
డును, విష్ణుండును, నీవు, త్రోవ జనునప్డున్ గూరు చున్నప్పు, ని
ద్రను సేవించెడి వేళ, సంతతమునిన్ రక్షింత్రుగాకంచు, దీ
వనలన్గూరిచి, గద్గదోక్తులను, బాష్పలను, బాష్పక్లిన్నయై పల్కినన్ ॥ 171

అంతటమ్రొక్కి; లక్ష్మణుడు; నగ్రజుగన్గొని, గద్గదోక్తి, సం
భ్రాంతము దశ్రునేత్రుడయి; రాఘవ! నాకుగలట్టి సంశయం
బెంతయుదీరె; నీనుడుల; నేనిక, నిన్విడనాడ జాల, ని
శ్చింతగ వచ్చి; నీదుపద సేవలొనర్చెద, నానతీ గదే ! 172

కాదనుదేనిన్, నీయా
సోదరుడసువుల ద్యజించుజామి, యన, రాముం
డాదృతి, ననుమతి జూపుచు
వే దరలెను, జనకపుత్రివేశ్మమ్మునకున్ ॥ 173

ఆగతుడైన యాత్మవిభునారసి, జానకి, సుస్మితానన
స్వాగత పూర్వకమ్ముగ, సువర్ణమయోపాత్ర హస్తయై
వాగమృతమ్ము, పాత్రగతపావన వారియు, నొల్కజేయుచున్
దాగడిగెన్ మనో విభు పదద్వయమున్, మృదుభక్తి యుక్తమై ॥ 174

వినయమెనయగ, దుకూల
మ్మున దడియారంగ నొత్తి ముదితయయి, సుఖా
సనమిడి కుశల ప్రశ్న
మ్మొనరించి యిటు వల్కె మృదుతరోక్తులు వెలయన్ ॥ 175

శ్వేతచ్ఛ త్రకిరీటచిహ్నములు లేవే మస్తకానన్ మనః
ప్రీతింగొల్పెడి మంగళ ధ్వనులురావె? సైన్యముల్ లేక యే
యేతేరం, గతమేమి? సత్వరముగానెందేగుచున్నావొ? నా
థా! తెల్పంగదె" యంచు సంభ్రమము శాంతమ్మెన్ని రూపించుచున్ ॥ 176

అడుగగ, రామచంద్రుడు, స్మితాంకుర మానన సీమదోప; నో
పడతిరో? పూజ్యపాలుడగు పంక్తి రథుడిటులాన తిచ్చె, నీ
వొడ యడవైతి; దండక మహోత్తమ రాజ్యమునేల బొమ్మనెం
గడువడి దత్ప్రదేశమును గావగ, నాపని, వేగ బోయెదన్ । 177

అనవిని, సీత, భీతిలి; మహాత్మ! భవజ్జనకుండు, దండకా
వని, నిటులేల, నేల నినుబంపెనొ? తెల్పుమటన్న; సుందరీ!
విను; మలకైక యీ జనని వేడెవరద్వయ మందు; నాత్మనం
దనునకు; రాజ్యరక్షణము, నాకు వనావనముంబొనర్పగన్ ॥ 178

తండ్రి యేమిసేయు; దథ్యము తప్పగ
లేమి వరమొసంగె; నామెకిట్లు
తండ్రియాజ్ఞ తొలగు తనయుడసత్యము
పల్కువాడు, సూర్య వంశ్యుడగునె? 179

అనవిని జానకి, విభుతో
ననియె నిటులు; ముందు నేనయరిగెద; నాపై
జనుదెమ్మునాథ ! నన్నిట;
నునిచి, చనదలంచుటే మహోచితమనుదే? 180

ప్రియ వాదిని యైన మనః
ప్రియజానకి వచనములను విని, రాఘవుడో
దయితా! నీ పలుకులు కడు
నయయుతములె గాని, వినుమనర్థములె సుమీ ॥ 181

ఒకవంక వ్యాఘ్ర భల్లుక మృగాకులమొచునొకక్రేవ రక్షోమహోగ్రమగుచు,
నొక చోవరాహసింహోత్కర భీకర గర్జావిరాసంకలితమగుచు
నొక్కొక చో బర్వతోపమసామజ ఘీంకార శబ్ద సంకీర్ణ మగుచు
నొకచో, సమాకంపితోన్నత తరుచరత్కపి వికృతాకృతి క్రాంతమగుచు

గఠిన తరకంట కాశ్మ దుర్గమ పథమ్ము
సమయ సముచిత ఫలముల సలిల శూన్య
నిర్జనారణ్య వాసము నీకు దగునె ?
నీవ, నీలోన, సరిగ, జింతింపు; రమణి! 182

దవ దహన ప్రదగ్ధ తరుతండ సముత్థ శిఖా చటచ్ఛటా
రవములు; ఝుల్లికాభయదరావముల, న్వినగల్గెదెట్లు? దా
నవ వికృతాకృతుల్గని మనంగలవే? చపలాక్షి! దండకా
టవి, కెటులీవు, రాగల, విటన్వసియించుటె నీకు మేలగున్ ॥ 183

వికటాశ్మమయ ఘోర విపిన స్థలము, పాలఊాలగట్టిన సౌధజాలమొక్కొ?
విషమకంటక సాంద్ర విపినముల్, మెత్తని పట్టుదుప్పటముల పాన్పులొక్కొ?
రవితాప తప్తనిర్ఝర వారిశీతల నీహార మధు పానీయమొక్కొ ?
కటుకాన నామ్ర కర్కశ ఫలావళి, పక్వసారమంజుల తరాహార మొక్కొ?
వనమృగధ్వని మంగళవాద్యమొక్కొ?
గహన మృగచయమే చెలికత్తె లొక్కొ?
దండకాటవియె, యయోధ్య యగునొక్కొ?
ముగుద వగుదువుగాక,రాదగునె, నీకు ॥ 184

పదునాల్గేడులె; నిన్నున్
వదలి చనియు, మరల వేగవచ్చెద, ధైర్యం
బొదవగ, నీవిట నిలువుము
పదపుల గురుజన సపర్య సల్పుచు దరుణీ ! 185

నాపని, భూమి జాత, వదనంబున గోపమొకింత దోప, నా
ధా! వనసీమ కీవు; నను ధర్మసతిన్, విడనాడి పోయెదే?
నీవు; దయా మయుండవు వినీతి యుతుండ, వనన్యనై, యదో
షావహనై, పతివ్రత పరాయణ నౌట యెఱుంగవో ప్రియా! 186

నీదరి నున్న నన్ను గనునే? కనజాలునె? యెవ్వడేని, నా
ధా, దరమేది, యుండెద; భ్రమించెద; నీవెనువెంటనంటి, నీ
వేది, భుజింతువో, యదియ యిష్టము, నాకమృతోపమానమై
గాదనుదే? రవిన్విడిచి కానగవచ్చునె? నీడ యెన్నడున్ ॥ 187

నీతోడిద లోకము, నా
ధా ! తల్పంబగును. విపిన తలము; నను విడం
జూతువే? నీ మొగమెదుట; ని
దేతొలగెద; బ్రాణముల, సమీక్షింగదే! 188

నీకేవిధమగు క్లేశము
గాకుండ జరించి నీదు కార్యములెల్లన్
నాకొలది నొనర్చెద, నను
జేకొని, దండక వనమ్ము ; చేరుము; నాథా! 189

మరియొక క్రొత్తగాథ; వినుమా, అనుమానముమాని, నాథ! నా
చిఱుత తనాన; నొక్క ద్విజశేఖరుడిట్లు వచించె జానకీ;
యరిగెద; వీవరణ్యమున; కార్యుని భర్తను గూడియంచు, భూ
సురుడనృతమ్ము వల్కునె? విశుద్ధుడు, నన్గొనిపొమ్ము; వల్లభా ॥ 190

ఈ యది తప్పు, నొండు వచియింపనొకింతయు, నన్ను గూడి, భూ
నాయక, పొమ్ము, కాననమునం, జరియింపుము; మునువింటి రా
మాయణముల్, మహాత్మ! విననైతిని రాముడు సీతబాసి తా
నే, యటవీ స్థలమునకునెక్కటు నేగుట, యేమి పల్కెదొ ? 191

అనుటయు, రామచంద్రుడు, దయామయుడౌట, సీతమాట, గా
దనక, తలోదరీ! భవదహార్య మనోరథ, మీకొంటి, సౌ
రు నెఱపు నీవిభూషల, నరుంధతికి, న్గురుపత్ని, కిచ్చి; నీ
ధనమది యెల్ల; విప్రులకు దానముగానిడి, వేగ, రాగదే ! 192

అనియెఱిగించి, లక్ష్మణు, నిజానుజునారసి; తోడి తెమ్ము; ని
ర్ధనులను, వేద విప్రుల, నుదార కుటుంబుల; వారిజేర్తు నా
ధనము, విభూషణాంబర, వితానము, లంచు సభక్తి నాతడి
చ్చెను, నిజ భూషణాదులను, సీత, యొసంగె వశిష్ఠ పత్నికిన్ ॥ 193

మరియు, నతండొసంగె; నిజమాతను గొల్చెడి భృత్య కోటి, కా
దరమున, గానుకల్, పిదప, దానును లక్ష్మణుడెల్లభూషణాం
బరముల బౌర విప్రులకు భక్తి మెయిన్; విభజించి మాతృకన్
గరమనురక్తి నర్పితమగా నొనరించెను రాము, మాతకున్ ॥ 194

అంతట లక్ష్మణుండొక, శరాసన మూని, నిజాగ్రగామిగా
జెంతను జానకీ సతియు జేరి, శనైర్గతి వచ్చు చుండ, ర
క్షోంతకుడైన రాముడు; పురాంతిక సుందర రాజమార్గ సౌ
ధాంతరవర్తి పౌరనయనాదృతుడై, చనె, బాద చారియై ॥ 195

అధ్యాత్మ రామాయణం 4వ సర్గ సమాప్తం.



## అయోధ్యకాండ - 5వ సర్గ

ఆ రాజమార్గమున సీ
తారాములు, లక్ష్మణుండు, తండ్రిసదనముం
జేర, జనుచుంటగని, త
త్పౌరులు; ఖిన్నాత్ములగుచు, బలికి కొనిరిటుల్ ॥ 196

అక్కట! మున్ను కామజితుడై తనకిచ్చిన యావరంబులా
రక్కసికైక, నేడిటు ధరాధిపుగోరగ నిచ్చెనంట, యీ
చక్కని రాజపుత్రులు, వెసంజనుచుండి, రరణ్యసీమకున్,
బ్రుక్కిడి మాట; రాజువినె; మోహము చేయని పాపముండునే? 197

సత్యము పాలింపగ, దు
ష్కృత్యము ముది తేడు చేయునే? మతిచెడెనొ?
మత్యాకృతి ఘనుల నిజా
పత్యములన్విడుచు టేమి పనియని చేసెన్ 198

కైక, హృదయంబులేనిది
గాక యిటుల సేసె, భరతుకంటెను, భక్తుం
డై, కనికరింపదగు, సీ
తాకాంతుని వనముజేర్పదగునే, తనకున్ 199

క్రూర కర్మయు, నతి మూఢకుటిల మతియు
గానిచో సత్య ధను బ్రియకరుని రాము
బేరడవి జేర్పనెటులాడె? నోరు తనకు
భావి తప్పింప నేరికి, వశమగు నొక్కొ ॥ 200

వేయి తర్కింప నేల? యీ వేళ మనము
భవము విడనాడి శ్రీరామ భద్రుగూడి
కాననము చేరుటయె మనకార్యమనుచు
గంటదడి వెట్టి కొనియె నాగర జనమ్ము ॥ 201

కనుడదె రాఘవుండు, తనకాంతయు దమ్ముడు వెంబడింప; గా
ననమున కేగెడిన్; బుడమినందన కాల్నడకం, బ్రయాణమై
చనుగద కోమలాంగి, పదచారము సేయగనేర్చునే? గజా
శ్వ నికరవాహనాదిక వివర్జితయై, కనజాలు వారమే ॥ 202

రక్కసిగాదొ? కైకయి, ధరావరనందనయౌ సుమాంగి, యీ
చక్కనిపత్ని సీత; పదచారము సేయగ; రాముడోర్చునా!
చిక్కుల వెన్ని గల్గె, విధి సేతలు నెవ్వరు మాన్ప వారలో
యక్కరొ! యిప్పురమ్మున, కహో, మరిదిక్కెదియౌనొ? అక్కటా ! 203

ఇట్లు సజ్జన బృంద మెంతేని వగల
బొగలగా జూచి వామదేవుడను మౌని
పలికెనిట్టులు; చింతింప వలదు మీకు
వీరి తత్త్వము, వినిచెద, వినగ వలయు॥ 204

జనులారా! వినుడీ మహాత్ముడు, రజస్సత్త్వమ్ములం, దత్తమ
మ్మున, లోకేశ, రమేశ, శంకర లసన్మూర్తి త్రయమ్మౌని స
జ్జన, రక్షా, విలయమ్ములం, జలుపుచున్, సర్వేశ్వరుండై తపో
ధన యోగీంద్ర సమాధి గమ్య పరమాత్మా కారుడై వెల్గెడున్ ॥ 205

భూతరుణికి బొడమిన యీ
సీతాసతి, యోగమాయ, శేషుండె; సుమి
త్రా తనయుడై జనించెను ఈ
తత్త్వము వీరిదని, గ్రహింప దగుజూడీ ॥ 206

ఇతడే, మునుసోమునకు
క్షితి గూరిచి వేదములను గైకొనగా, మ
త్స్య తనువుదాలిచి, వైవ
స్వత మనువున్, ధరణి నిలిపి, సాకెంజుండీ ॥ 207

ఇతడే, దానవులకు, దే
వతలకు, నమృతమ్మొసంగు భావనతో గూ
ర్మ తనువుగొని, మంధర ప
ర్వతమున్, దనవీపు పైని వహియించె, జుడీ ॥ 208

ఈతడె విలయమునందు
రసాతల గతమైన పుడమిసాక, వరాహ
ఖ్యాత తనువు దాలిచి ధర
శీతలమును దెచ్చి యిచ్చి నెగడెం, జూండీ ! 209

ఈతడె, నేడిట్లు, సుర
వ్రాతము రక్షింప బంక్తి వదనుం, జంపన్
భూతలమున, రాముండను
ఖ్యాతిం, గొని నట్టి భక్తి కల్పమెసుండీ ॥ 210

మునుమనతేడు ; విష్ణు; దన పుత్త్రుడుగా వరియించుట, న్మను
ష్యుని వలనన్; స్వమృత్యు వనుచున్, దశకంఠుడు కోరి యుండుటన్
మనుజుడుగా జనించె; హరి; మాయయే; జానకి లోక మృత్యుకా
రిణి, యిపుడీ రఘూద్వహుడరిందము డేగుచు నుండె గానకున్ ॥ 211

కనుగొన, గైకయుం, బతియుగారు నిమిత్తము, నిట్టు లీతడా
వనమున; కిప్పుడేగుటకు, బూర్వ దినమ్మున నారదుండు, వ
చ్చిన, నెఱిగించె, నేనువన సీమకు, బోయెద, రేపె రావణుం
దునుమగనంచు, నిందెవరి దోషములేదని చెప్పరాదొకో ? 212

బాలిశులార! మీరికను; బాయుడు శోకము రాము గూర్చి వే
యేల? వచింప, భక్తుల సమృద్ధిని, భక్తిని, ముక్తి గూర్పగా
జాలి, పవిత్రమైన, నిజచర్య లెఱుంగ జేయనెంచి యీ
లీల, నితండు; పోవనగు; లెండిక; సందియమేది; పోవుడీ ॥ 213

రాముని నామ మంత్రము, నిరంతర మెవ్వరు పల్కుచుందురో
యామనుజుల్, పవిత్రమతులై, యిహ సౌఖ్యములంది ముక్తి కాం
తామణి చేర గల్గుదురనన్ విని పౌరులు భక్తి మీరగా
నామహితుం దలంచిరి యదార్ధముగా హరి యన్న నమ్మికన్ ॥ 214

అటుపలుకు వామదేవుని
స్ఫుట వచనములాలకించి, భూసురులు, మనో
ఘటిత మగు సంశయము, దమ
యటమటయును, వీడి వెడలిరందఱు వరుసన్ 216

జానకీ రాములం గూర్చి జరిగినట్టి
యీరహస్యము భక్తి నేవారు వినుచు
నెడద జింతింతురో వారి యెడ దయాళు
వైన రాముడు భవ్య కటాక్షమునుచు ॥ 217

పిమ్మట ! రాముడు సీతయు
దమ్ముడు ; రావెడలి, దశరథా ధీశుని, సౌ
ధమ్ము జొరబారి, తన సవ
తమ్మనుగైకయిని గాంచి, యనె, భక్తి నిటుల్ 217

అమ్మరో ? మాముపుర మీ యర
ణ్యమ్మున కేగుటకు, వచ్చినారమిదియె, మా
సమ్మతము జనకు నానతి
యిమ్మని కోరెదము ; మమ్ము వీక్షింపుమనన్ ॥ 218

సిగ్గు వెగటి గనరాగా
దిగ్గన గైకేయి లేచి తీవ్ర హృదయయై
ముగ్గురకు వేఱు వేఱుగ
నగ్గలికన్, నారచీరలందించె వెసన్ ॥ 219

ఆమె యటులిడిన చీరల
రాముడు సాదృతి గ్రహించి, రాగమున, ఘన
శ్యామల కోమల, శోభా
ధామంబగు మేనబూని; తనరె; ఘన రుచిన్॥ 220

అన్నారల, నన్న వలెన్
మిన్నగలక్ష్మణుడు పూనె; మేదినిసుత, యా
తెన్నె ఱుగమి, దానిం గే
లన్నిలిపియె, మగని మొగము లజ్జంగనియెన్ ॥ 221

దరలజ్జాయుత జానకి
నరసివిభుడు; వడిగవాని, నంశుకము పయిన్
బరివేష్టిత యొనరుప; నం
దఱు నేడిచి, రచటి రాజదార, లురవడిన్ 222

ఆరొద జెవిబడ, గురుడు, మ
హారుషతో లేచి, కటములదర, వదరి, దు
శ్చారిణి! కైకేయీ! నీ
కోరినయవి, రామునకె, యగుం, గాదిట్టుల్ ॥ 223

ఓసి! కైకయి! యిట్టి పాపమున; కయ్యో; యెట్టులీ కొంటి, సీ
తా సర్వేశ్వరి! భర్తతో, నడవికిం, దానేగు, నీ చీరలే
లా, సర్వాభరణమ్ములున్, మృదుల చేలమ్ముల్ మెయింబూని యే
కౌసల్యాత్మజు నీప్సితమ్ములొసగున్, గాదందువో? దానికిన్ ॥ 224

ఆవల దశరధుడును, దుః
ఖా విష్టుండయి, సుమంత్రునారసి; ఆర్యా!
నీవే సారధి వై, యీ
మూవుర, సౌఖ్యముగ జేర్పుము, వనావనులన్ ॥ 225

అని, పలుకునంతనే యా
మనుజాధిపునాజ్ఞమై, సుమంత్రుడ రదముం
గొనితేర వారు మూవురు
జనుదు రనుచు దశరధుండు; క్ష్మాస్థలి; నొఱగెన్ ॥ 226

మగడరయ; మైధిలియె, ముం
దుగ దేరెక్కుటయు విభుడు తోడనె, రథమె
క్కగ, ననుజుండును, సాశుగ
మగు తూణయుగమ్ముబూని యరదము నెక్కెన్ ॥ 227

సీతయును, రాఘవులు ప్రదక్షిణ మొనర్చి
రథము నెక్కగ గడపు సారధిని గాంచి
నిలువు నిలువు మటంచు దండ్రి వచియింప
గడపు కడపు మటంచు రాఘవుడు పలికె ॥ 228

జననాథుండు, వారింగను
గొనుచున్ గన్పట్టు నంతకుంగని, యటనం
దనులం, గానక, చింతా
వనధి మునిగి, పుడమిబడె, వివశచిత్తుండై ॥ 230

ఆ రాఘవులడవికి జను
టారసి, పౌరజనమెల్ల; నా బాలముగా
నారాము తేరి వెంబడి;
జేరి, రతని, నను గమింప స్థిర మానసులై ॥ 231

జనపతి లేచి, రోదనము సల్పుచు; భృత్యులగాంచి, మీరు నన్నే
గొని, కడువేగ బోవలయుగోసల రాట్సుత యింటికిప్పుడే
చని, యటనుందునంచు, జని, క్ష్మాపతి వెండియు, మూర్ఛనొంది, మె
ల్లన మరిలేచి, యాత్మసుతులం దల పోయుచు నుండె; నచ్చటన్ ॥ 231

ఆవల రాముడు సీతానుజాన్వితుడయి
తమస తీరము చేరి; తత్పావనాంబు
వులె; నిజాహారముగనందు నిలిచి నాటి
రేయి కడపగ దలచి నిద్రించెనంత ॥ 232

పౌరులు రాఘవు చెంతన
దూరముగా నిలిచి మిమ్ము దొడ్కొని పోవన్
జేరితిమి! నీవు రామే
నో రాఘవ! నిన్ను గూడి యుందుము వనిలో 233

అనగ; రాముడు; తన్నిశ్చయంబెఱింగి
వీరు నావెంట రాగనున్నారు గాని
యది మహా క్లేశ కారి యౌనని తలపరు
చేయునది లేదనుచు నిట్లు చేసెనపుడు ॥ 234

ఆ రఘునందనుండు; సచివాగ్రణి నారసి, ఆర్య! నీ వెటుల్
చేరుతువో? వనమ్ము, మమ్ము; శీఘ్రముగా నరదమ్ము పూన్పు; మీ
పౌరుల నిందువీడి; కడపందగు ముందటి త్రోవ నీవదే
తీరు తలంతువో? కన సుధీ మణివౌట, వచింప నేటికిన్ ॥ 235

అనవిని సుమంత్రు డరదము
చనుమార్గము వదలి; మరల సాకేతము జే
రిన త్రోవ నడపి; పిమ్మట
వనమార్గమునందెపోవ బనిచెన్ హరులన్ ॥ 236

వేకువ మేల్కని పౌరులు
శ్రీకరు రామ విభుగనక, చింతిలి మరలన్
సాకేత మేగు జాడల
గైకొని యాత్రోవ బట్టి కదిలిరి కడకున్ ॥ 237

పురము చేరియు; శ్రీరామునరయరామి
గడువిషణ్ణత; బురజనులెడద లందె
యునిచి కొనిభక్తి వెలయ నాతని స్మరించి
కొనుచు హృదయేక్షణముల గన్గొనుచు నుండ్రి ॥ 238

అంత, సుమంత్రు డయ్యరదమంతకు, నంతకు వేగ ద్రోలగా
సంతసమందుచున్, జనక జాతయు, దమ్ముడు దోడరాగ, నా
చెంతల నున్న జానపద సీమల దాటుచు; శృంగిబేర భూ
ప్రాంత గతామరాపగను, రమ్యతరంగను గాంచి మ్రొక్కుచున్ ॥ 239

ఆనదిలో వారు కృత
స్నాన తదీయ జలపాన సౌఖ్యము గలుగం
గానేగి, శింశు పాఖ్యమ
హా నొకహముల భూమి నాపిరిరధమున్ ॥ 240

పిమ్మట రామాగము; జ
నమ్ము వలన నాలకించి, నైషాదుడు, ప్రే
మమ్మున, వారల, దన గే
హమ్మునకుంతోడి తేర; నాదరమెలయన్ ॥ 241

పండులు, తేనియ, పూవులు
మెండుగజేపట్టి భక్తి మిగుల జనుచు, నా
యండనిలిపి యాతనికిం
దండనమస్కృతిగ, నతని దండ నిలువగన్ ॥ 242

ఆ గుహులేవ దీసి, కడునాదృతి రాముడు; కౌగలింపగా
స్వాగతమిచ్చి; వాడు, కుశలాదుల నారసి; చంద్రు రాకచే
సాగరమట్లు పొంగి, తగు సత్కృతులం బొనరించి, రాఘవా !
యీగతి! రాగతమ్మెదియొ? యెందులకేగెదొ? యానతీగదే ! 244

అడిగి, బ్రాంజలి యై నిల్వబడి; మహాత్మ!
మోదమందితి; నాదునైషాద జనియు
బూత మయ్యెను; ధన్యుడనైతి; దేవ
త్వత్తను స్పర్శమునసె మోదమ్మ గలిగె ॥ 245

జనవర! నీకు; గింకరుడ, సర్వము నాయదినీదిగా గనుం
గొని, కొనురాజ్యముం, ధనము కొల్తుము; నిత్యము నీవు, రాజుగా
మనగ, దలంచి, నారమిక, మాయిలు పూతము సేయరమ్మ; నా
మనవినిగొమ్ము; నిన్ను బ్రతిమాలెద; రాఘవ! యంచు వెండియున్ ॥ 246

సామి! నీకై ఫలమూ
లామల సురభిళ సుమాదు, లంబరములు, నే
బ్రేమన్, సంపాదించితి;
మామక సదనమ్ము; నన్ను మన్నింపగదే! 247

అనవిని రాఘవుండు; " మహితాత్మ! గుహా! భవదీయ సాదరో
క్తిని కరమాధ్వి; నాదగు మదిన్, మిగులందనియించె, నేను, వ
చ్చిన, నొకడుం, ద్వదాలయము చేరక యున్న నొకండు కన్గొనన్
మనమె ప్రధానమౌ, ద్రికరణమ్ముల" నంచు బుధుల్వచింపరో? 248

అమలగుణా ! మరొండు వినుమా ! పదునాల్గగు నేడు, లన్యద
త్తముల; గ్రహింపరాదు; పరధామములం, జొరరా, దరణ్య వా
సమె, యొనరింపగా, బ్రతిన సల్పితి, నింతియ గాని నాదువా
క్య మితరధా, తలంపకుము; గల్గిన మైత్రికి; లోపముండునే? 249

అనుచు గుహుచేవట క్షీరమును గ్రహించి
తమ్ము తోడ జటామకుటమ్ము నెమ్మి
గూర్చి కొని, రాముడు, జలమ్ము గ్రోలి, యిదియ
భోజనమ్మని, మిత్రుని, బుజ్జగించి ॥ 249

అనుజుడమర్చియుంచినకుశామల పత్రసమాస్తృతమ్మె; మె
త్తని ఘన శయ్యగా దలచి, తన్వియు, రాముడు పవ్వళింప, నా
తని యిరువంకలం, గుహుడు, తమ్ముడు, బాణ శరాసనమ్ములన్
గొని, కడు, జాగరూకులయి; కూర్మిక రక్షనొనర్చు నత్తఱిన్ ॥ 250

అధ్యాత్మ రామాయణం 5వ సర్గ సమాప్తం.

# నిర్వచన అధ్యాత్మ రామాయణం

## అయోధ్యకాండ - 6వ సర్గ

కరుణము మీర! లక్ష్మణునిగాంచి, గుహుండిటువల్కె, నోయిమం
ధర వచనమ్ములం, జెవులదారిచి కైకయి, మిమ్మునిట్లు, దు
ష్కర వనవాసముం, బనుపజాలెనె? యెంతటి క్రూర వృత్తి సుం
దరగాత్రు; లీకటకు దర్భల; నిద్దురవోవ; నోర్తురే! 251

అనియెడు గుహ వచనమ్ముల
విని లక్ష్మణుడని యెనిటు వివేచింపగ, గై
కను, మంథర, నిందింపం
బనిలేదు పురాత్త కర్మఫలమెయగు జామీ! 252

తలపగ; దుష్కృతమ్మొ; సుకృతమొ; యెవండెపుడేది; యెంత, యెం
దులకొనరించు; వానికగు దుష్ఫలమున్, సుఫలము వారి, నె
త్తుల పయి; దిండిమిధ్వనులతో, నటియింపక పోదు, వాని, న
న్యుల పయిమోపి, తన్నిరసనోక్తుల; నెందువచింప వచ్చునే ॥ 253

ఇతరులు, సౌఖ్యదఃఖముల హేతువులంట, కుబుద్ధి; దుఃఖ, సౌ
ఖ్య తతికి, దానొనర్చిన, సుకర్మము; దుష్కృతమే కతమ్ము; హల
మతి; నివి చేసినాడ; నిది మానితి; దీనినొనర్చువాడ; నం
ట, తెలివి లేని పల్కానిదృఢంబుగ దెల్పెదనో మహాశయా! 254

వీరు మిత్రులు, వీరు; నా వైరిజనులు;
వారుద్వేష్యులు; వీరు నాబంధుజనము
లనగ, గారెవ్వ రేమి, సేయంగ లేరు;
తనదు సుఖ దుఃఖముల కెల్ల దానకర్త ॥ 255

నరుడు, నిజకర్మవశుడయి; దొరయునట్టి
సుకమొ దుఃఖమొ, తానతప్పక భుజింప
వలయు, నంతట దత్కర్మ ఫలవిముక్తు
డగుచు; మనుజుడు; స్వాస్థ్యమునంది బ్రతుకు॥ 256

నాకు; దద్భోగ వాంఛ లెన్నడును లేవు;
వాని విడుచుటకును; నేను గాను గర్త;
వానియంతనె; యవియె; రావచ్చు; బోవ
వచ్చు; వానికి; నే సుంత వశుడగాను ॥ 257

ఎచటనే కాలమున; నేమి హేతువునను;
జేసిన శుభాశుభమ్ముల సిద్ధి యగుట
విశ్వకర్త యధీనమై వెలయు; దాన గలుగు
మోదము ఖేదము గాంచ దగదు ॥ 258

కృతము లైనట్టి సుకృత దుష్కృతములందు
గలుగు సుఖదుఃఖములు దేవతలకునైన
దాటరానివి; మానవుమాట; వేఱ
తెలుపనేటికి? నీకు; సుధీవరమణి! 259

పరమ సుఖమైన వెంటనే ప్రబల దుఃఖ
మొదవి యదిచనినంతనె, యొదవు సుఖము
రాతిరియు బవలట్టులు; రథము చక్ర
నేమివలె; గ్రిందు మీదుల; దిరుగు నవియు ॥ 260

సుఖము నడిమిచోట జొచ్చును దుఃఖము
దుఃఖ మధ్యమందు దూరు సుఖము
దుఃఖ సుఖములనెడి దుగ్ధయేకమై
వారికర్ద మమ్ములట్లు కలసి, మెలగు ॥ 261

అది యెఱిగి శుభాశ్శుభములు
కదియ ముదము గనక వగయుగాంచక; సకల
మ్మది; మాయ యనెడి భావన
యొదవి బుధులు సాక్షిభావ మొందుదు రవనిన్ ॥ 262

వారిరువు; రిటు; పరస్పర
సారతర వచః ప్రశంస, సలుపుచునుండ
గా; రేయి వోయి, దివసము;
చేరుట నెఱిగింప; దెసల, సీత రుచు లొదవెన్ ॥ 263

రాముఙ యాస్తరణము
విడిచి, సీతయు, దానువివవేక గరిమ
జలము స్ప్రుశియించి, పడవను సజ్జయుగను;
జేసి తెమ్మని గుహుతోడ జెప్పి పిదప ॥ 265

పరమ మిత్రమ! వినుమేను బదియునాలు
గేండ్లు దండక వనమున నుండి; పిదప
మరలి; సేమముగా వచ్చి యరయుదు నిను
రామునోట, నసత్యమ్ము రాదటంచు ॥ 266

వేకువమయ్యె; నిద్రనిక వీడుడు; లెండను భానునానతిన్
జీకటితోడ, రాజ్యమెడజేసి, వనమ్మున కేగుచుం, గృపా
లోకన పాత్రుడైన గుహు; లోలత గన్గొని; మిత్రరత్నమా!
కై కొనువాడ; నీ సెలవు గాదనకిమ్ము; శుభమ్ము; నీకగున్ ॥ 267

అనుడు; నిషాద నాధుడు; సమాకులమానసుడై; రఘూద్వహా!
ననువిడనాడి పోవగ, మనం బెటులొప్పెనొ? నిన్నుగూడి; నే
వని, కరుదెంచువాడ; నను బాయదలంచెదొ? నాదుప్రాణ మీ
క్షణమున; నేద్యజింతు; నికసందియమందకు మంచు బల్కుచున్ ॥ 268

తానుం బయనమై రఘు
సూనునితో వెడలదలచు చొప్పుగని, రఘు
క్ష్మానాధుడని యెను; గుహా!
రానుచితమె? పరిహసింపరా? నన్నుగున్ ॥ 269

ఆ నిషాద నాధుడతి భక్తి నావను
దెచ్చి, యిందుద్వరగ; దేవ; యెక్కు
మనగ, రాఘవుండు; ననుజుండు; సీతయు
నదివసింప; దాను; నధివసించె ॥ 270

పిమ్మట; దదుహుండు; తనపేర్మి గలతలట్టి జనమ్ముగూడి, శీ
ఘ్రమ్ముగ, నోడ, తాస్వయముగా, నడుపన్మదినెంచి, యెంతొ, సౌ
ఖ్యమ్ముగ; నొడ్డు; చేర్చుతరి; గంగను గన్గొని సీతయిట్లు; స్తో
త్రమ్మొనరించె; రాముడు ముదమ్మొద నొందుచు; దన్ను మెచ్చగన్ ॥ 271

దేవీ! జాహ్నవి! నీకు మ్రొక్కులివె; యెంతే; మమ్ము గాపాడుచున్
మావేశ్మమ్ముల, మమ్ముఁజేర్ప బెరిమన్ మన్నింతువా నీకు భ
క్త్యావేశమ్మున, గాన్కలన్, బలుల, బ్రీతాత్మన్ సమర్పించి, ని
న్నేవేళన్, దలపోయుచుండెదముగాదే! విష్ణుపాదోద్భవా! 272

అటు; వేడికొనెడి జానకి
పటు భక్తింగనుచు, గుహుడు పడవను, గంగా
తటి జేర్ప, వారు ముగురు
త్కటముదమున నడిగిరి గుహుని గరుణవెలయగన్ ॥ 273

కని రాఘవుండు తత్తట
మున, వానింబోవ బనిచి, మూవురు; మేధ్య
మ్మనదగు మాంసము తమ భో
.జనముగ; నానాటి నిద్రసాగించి రొగిన్ ॥ 274

రాజవరేణ్యుడైన రఘురాముడు; సీతయు, లక్ష్మణుండు, త
ద్భూజతలమ్మునన్, నిదురబోవిడి ముందుకుసాగనెంచి, గం
గాజలపానమే, తమకు గల్గిన భుక్తిగ దృప్తులై భర
ద్వాజమునీంద్రునా శ్రమ పదమ్మును, మెల్లన, జేరి, రత్తరిన్ ॥ 275

ఒకచోట త్రేతాగ్ని హోమధూమములు మూర్కొనువారి బాప ముక్తులనొనర్ప
నొక త్రేవ, సామగానోత్తిత్థిత మధురనాదము సర్వజంతు మోదమును గూర్ప
నొకవంక గురువచోనూక్త యజుర్వేద విధివాక్యములు బుణ్యవిధులు నేర్ప
నొకమూల దేవపూజోపకరణ పుష్ప తరులతా పోషకాదర మెలర్ప
వినెడి వారల చెవులకు విందొసగుచు
జూచు వారల కనులకు జోద్యమగుచు
దద్భరద్వాజు నాశ్రమ ధరణి రామ
చంద్రునకు గూర్చె నింద్రియానంద గరిమ ॥ 276

అటజని; వేద పాఠపరుడై వెలుగొందెడు; బ్రహ్మచారి, నా
దటగని, "రామలక్ష్మణుల్, దాశరథుల్, మిము జూడగోరి; వా
కిట; నిలుచుండి రంచు; మునికిన్వినయమ్మున దెల్పగోరితిన్
వటువర! విన్నవింపు" మని; పల్కిన నాతడు వోయి భక్తి మై ॥ 277

ఎందు, శబరుడు, తపముండి, ఋషిగమాతె;
నెదిమృగాకులమై ద్విజ సదనమయ్యె
నేది సుమ ఫలభరితమై యొసగునట్టి
చిత్రకూటాచల సమీప సీమనున్న
పుట్ట పుట్టువు నివసించు పట్టుచేరి
యతనికి, సభక్తి సాష్టాంగ నతులొనర్ప ॥ 284

ఆతడు, వారినారసి, ముదశ్రు పరిప్లుత సర్వగాత్రుడై
జాత వికాస విస్మయలసన్ముఖ డౌచు వచించె, రామ యీ
రీతి, జటాజినాదుల ధరించ; గతమ్మె ది, యేల వచ్చితో?
నా తపమున్ ద్రుమంబు; ఫలనమ్రము; జేయగ వచ్చినాడవో! 285

రామ! లోకాభిరామ! సర్వగుణ ధామ!
మదన సుందర! కమనీయ! మృదులగాత్ర!
యంచు గౌగిట జేర్చి; హర్షాశ్రులిప్తు
డగుచు బూజ్యాగ కాతని; కర్ఘ్యలిచ్చె ॥ 286

ఆగతి; నర్ఘ్యాదులతో
స్వాగత ముంగొనుచు; రామచంద్రుడనియె; మే
మీగతి రాగతి యెఱుగవా?
యోగి జ్ఞేయమ్ము గాని దున్నే జగతిన్ ॥ 287

జనకు, నానతి; నే శిరసావహించి
పదియు నాల్గేడు, లటవీ నివాసమింక
జానకీ లక్ష్మణులతోడ జలుప వలయు
గాన నడిగెద నొక్కటి; మౌనివర్య ! 288

నే; నివసింపగా, విమలనీర ఫలాది సమృద్ధమైన, దే
స్థానమొ? సీతతో నిలువ; సౌఖ్యకరమ్మెదొ? తెల్పుమన్న, న
మ్మౌని వరేణ్యు డిట్లనియె; మందహాసన్ముఖుడౌచు; రాఘవా!
నీ నెలవుల్, వచింపగలనె? యటులైనను గొన్ని తెల్పెదన్ ॥ 289

నీవు నివసింపదగినట్టి నెలవులెన్ని
యేమున్న యవి, వానినే దెలియను
నా యెఱిగినంత వట్టి విన్నపమొనర్తు
ననుచునిట్లనె నతడు కళ్యాణగాత్రి ! 290

ఓ గురువర! ముఖజిత శర
దాగత చంద్రులయి; దశరథాత్మజులు; భవ
త్స్వాగతముగోరి, త్వద్వా
ర్భాగమ్మున, నిలిచియున్న వారన, మునియున్ ॥ 278

పాద్యము, నర్ఘ్యము, సుఖసం
పాద్యమధు క్షీర మధుర ఫలములుగొని, లో
కాద్యుడగు రామ విభుముని
వేద్యంబగు పాదయుగము వీక్షించి; తమిన్ ॥ 279

పరమపురుష! నీవొక పరిత్వదీయ
పాదయుగ దూళిని మదీయ పర్ణశాల
బావనముచేసి; నాయిచ్చు ఫలముల, జల
ముల గ్రహింపగా, రమ్ము సమ్మోద; మెసగ ॥ 280

అని యామౌనివరుండు; స్వీయమగు పర్ణాగారముం జేర్చి; రా
ముని బూజించి, పునః పునః ప్రణతులన్మోదమ్మునం జేసి, నా
జని, ధన్యత్వముగాంచె; నా తపము; నిచ్చల్; పండె; నీ పూర్వగా;
ధనశేషమ్ము; భవిష్యముం, దెలియుదున్, ద్వత్పాదసేవా రతిన్ ॥ 281

ఏమి నిమిత్తమీవు జనియుంచితో? భాస్కర వంశమందు; నీ
వే నిమిత్తమై యడవికేగెదొ? నీవిక నేమి చేసెదో?
నీ మహనీయ భక్తిగల! నే దెలియంగలవాడ నైతి; న
ల్మోముల వాని ప్రార్ధనల బుట్టితి; మానవ రూపధారివై ॥ 282

ఇంతకంటెను దెలుపగ నేమి గలదు?
నే గృతార్ధుడనైతిని; నిన్ను జూచి
ప్రకృతికి బరుండవైన నీ పద యుగమ్ము
గాంచి, మ్రొక్కితి నీకను గ్రాహ్యజనిని ॥ 283

వారిటు పరస్పరమ్ము సంభాషణమ్ము
సలుపుచున్గొన్ని నాళులు జరుగ బిదప
రాముడొకనాడు, యమునాతరంగిణి ముని
దారకుల తోడుపాటున దాటి చనుచు ॥ 284

జగములన్నిట కుత్తమ స్థాన మీవ
సకలభూతములు నీకు సదనములగు
తలప సాధారణములైన తావులివియ
వెలదితో నుండదగు తావు తెలిపెద, నిదె ॥ 291

సకల భూత సమాత్ములై శాంతులగుచు
సర్వజంతువులందు ద్వేషమ్ము విడిచి
నిన్నె సేవించు చుండెడి నిష్ఠగలుగు
మహితుల మనంబె నీకు సన్మందిరమ్ము ॥ 292

ధర్మకర్మముల; నధర్మ కర్మములను
విడిచి తావక పదపద్మ విమలసేవ
చేయువారల హృదయమ; సీత నీవు
మసలుచున్నట్టి శోభన మందిరమ్ము ॥ 293

భవ్యమగు నీదు మంత్ర జపమ్ము గలిగి
నిరత, మేమనుజాల నన్య శరణులగుచు
సతత సుఖ దుఃఖసములు; నిష్కామచిత్త
లగుచు నేవారు వర్తింతురట్టి పుణ్య
మానవుల మానసములె నీ మందిరములు. 294

శాంతులై నిరహంకృతి స్వాంతులగుచు
రాగమును ద్వేషమును సుదూరముగ జేసి
లోష్ఠమును గాంచనము తుల్య దృష్టిగాంచు
మానవుల మానసములె నీ మందిరములు ॥ 295

మనము; బుద్ధియు, నీకు సమర్పితముగ
నిత్య సంతుష్ట చిత్తుడై నెగడు చుండి
యెవడు నిజకర్మముల దృజియించు, నీకె
యట్టి మనుజుని మనమె గృహమ్ము నీకు ॥ 296

అపకృతుండయ్యు ; ద్వేషమునందెవ్వ
డుపకృతింగాంచియును, మది, నుబ్బ డెవ్వ
డఖిల జగమును మాయగా నరయు నెవ్వ
డట్టివాని మనంబె గృహమ్ము నీకు ॥ 297

నీరస షడ్భవాది వి
కారములు శరీర గతములె గాని తదాత్మా
ధారములు గామి నెఱిగిన
వారల సన్మనమె నీకు వాసము రామా ॥ 298

ఆకలియుడప్పి; సుఖము, భయమ్ము, వగపు
మున్నగు నవెల్ల తత్ప్రాణ బుద్ధిగతము
లనుచు సంసార ధర్మములను ద్యజించు
నట్టి మనుజుని మనమె గృహమ్ము నీకు ॥ 299

అరయు; నెవ్వడు నిన్ను గుహాశయస్థు
సత్యు గేవలు జిద్ఘను; సర్వగతు, న
నంతు, నిర్లేపకుని, వరేణ్య తమరూపు
గా, నతని చిత్తమే, నీ యగార మగును ॥ 300

సతతాభ్యాస దృఢీకృత
మతులై; నీసేవలందే మది నిల్పి; మహా
మృత సమమగు నీ నామ
స్మృతి గలిగిన వాని మనమె గృహ మగునీకున్ ॥ 301

దేవా! తావక నామమ
హా విభవము తెలియ సాధ్యమా? ఎవ్వరికిన్
గావింపదొ; త్వత్ స్మృతి సీ
తావర! నను నొక్క మౌని తల్లజు గాగన్ ॥ 302

జనన మాత్రమ్మునవె, నే ద్విజత్వమంది
దుష్కిరాతులలో గిరాతుండ నగచు
శూద్ర ధర్ముడనై తుది జోరుడనయి
శూద్రి యందు బ్రజంగని బొక్కినాను ॥ 303

శర శరాసనముల బూని శమనుడనగ
వెఱపు గలుగగ, వర్తిలి, వేలకొలది
ప్రాణులకు హాని కలిగించి బ్రదిమి నెల్ల
భగ్న మొనరించితిని, రామభద్ర! వినుము ॥ 304

రామా! మత్సుతదార పోషణ మొనర్పం బూని, నేమున్ను, ని
ష్టేమన్, దారులగాచి, సర్వజనులంబీడించుచున్, తద్దన
స్తోమంబెల్ల, హరించుచున్, వెనుక ముందుల్పాప పుణ్యమ్ము, లే
వా? మానుష్య మేదో? యెఱుంగక, దురాశోపేత చర్యుండనై ॥ 305

జీవహింస లొనర్చితి, జేయరాని
చెప్పరానట్టి దుష్కృతుల్ చేసిచేసి
రేయి, పవలిది, నాక, నాచేయి కొలది
బాపధనము గడించుచు బ్రతుకుచుంటి 306

ఇటులగు చుండ నొక్కతరి, నేడ్వురు మౌనులు, నా, చరించు, న
య్యట విని, భాస్కరోపమ మహత్తర తేజులు నొచు, నాకు, ముం
గట; జనుచుండి; కానబడ; గల్గిన వారి పరిచ్ఛదమ్ముల
న్నిటి హరియింపగా, దలచి, నిష్కరుణమ్ముగ, వారి వెంబడిన్ ॥ 307

పరువులెత్తి, వారి పరికరములనెల్ల
దొంగిలింపనెంచి, దూరముగనె
నిలుడు నిలుడటంచు నీతి విహీనత
బలుకు చుండ, వారు పలికి రిట్లు ॥ 308

ఏరా! విప్రాధమా! నీ
వీరీతిన్వచ్చె దనగ; నేనిట్లంటిన్
సారమతులార! నన్నిక
మీరక యర్పించి చనుడు మీ పరికరముల్ ॥ 309

ఓ బుషులార పెక్కురు
దారసుతులు గలరునాకు తత్పోషణకై
చోరుడనై, కాననసం
చారుడనై, సతము బ్రతుకు సాగింతుననన్ ॥ 310

ఓరి! నీ విటులాచరించెదవు; క్రూరోపాయముంజేసి, నీ
దారల్ పుత్రులబ్రోవబూని; సిలుగుల్; తండోపతండంబుగా
మేరల్, మీరెడు; నీదు దుష్కృతములో నీవారు భాగస్థులై
భారమ్మెం గొనువారె? గారొ? యెపుడే బ్రశ్నించితే? వారలన్ 311

నీవచ్చు దనుక, మేమిటు
బోవక నిలిచెదము; సత్యము సుమీ! యింకన్
వేవేగ బోయి వారల
కీవిధమంతయును దెల్పి యేతెమ్మనగన్ ॥ 313

వారి నుడులు వినివడిగా
దార సుతలకడకు జేరి తద్విధ మెల్లం
గోరియడుగ; బాపమ్మున
భారము వహియింప మాకు బనిలేదు సుమా ॥ 314

మమ్ముంబోషింపగ, నిను
దెమ్మంటిమె దొంగిలించి, తెచ్చితె? నీపా
పమ్మెల్ల నీద; యందు ల
వమ్మేనియు గొనము; పలుక వలదు; చనుమనన్ ॥ 315

అదివిని, నే విషణ్ణ హృదయమ్మున మౌనుల చెంతజేరి; యో
సదయ హృదబ్జులార! ముని సత్తములార! వినుండు, "త్వత్కృత
మ్మది సకలమ్ము నీకయగు; నంతకు గర్తవు నీవటంచు బో
పొదమని పల్కినా; రివియపా! స్వకుటుంబమువారి పోకడల్ ॥ 316

అని పలికి వారి సంద
ర్శనమున జనియించి నట్టి సన్మతిచే, బా
వనభావుడనై, తత్పద
వనజమ్ముల వ్రాలి భక్తి వశత, నిలువగన్ ॥ 317

వచ్చితె? నీ దారాదిక
మిచ్చమెయిన్నీదు పాప, మేమేని గొనన్
మచ్చికను సమ్మతింపక
పొచ్చెముగా, నిన్ను గాంచి; పొమ్మని నారా? 318

అని, యామౌనివరేణ్యు లేద్వురును, నన్యోనమ్ము చింతించి, యి
ట్లని; రో మిత్రములార! వీడుకడు దుష్టాత్ముండు; దుర్వృత్తుడై
నను, జెందెన్ శరణమ్ము; వీని కెటులైన, న్ముక్తి మార్గము, చూ
పునదే, ధర్మపథమ్మటంచు గరుణా పూర్ణాత్ములై గాంచుచున్ 319

లెమ్మో! విప్రాధమ! సే
మమ్మగునిక, సత్సమాగమము; బహుతమ, లా
భమ్మొసగునందురు గదా!
నమ్ముము; నీ దుష్కృతపు దినమ్ములు గడచెన్ ॥ 320

ఔరా! విప్రకులాధమా! వినుము మోక్షావాప్తి గల్గింపగా
నా రామాక్షరయుగ్మము; స్సతము; వ్యత్యస్తముగా జేర్చి నో
రారన్, నీవు "మరా; మరా" యనుచు భక్త్యావేశ విశ్వాసముల్
మీరంబల్కుము; మేము వచ్చు దనుక; న్మేలౌను నీకాపయిన్ 321

దివ్య దర్శనులౌవారు తెలిపిన యట్లు
చనిన యంతనె; తన్మంత్ర జపము; వారు
చెప్పినట్టులె;యేకాగ్ర చిత్తుడనయి
చేసితిని నేను; బాహ్య విస్మృతి వహించి ॥ 322

కడచె నేడులు; బూండ్లు, జగంబు మరచి
సకలసంగ విరాగమ్ము సలిపి; నిశ్చ
లాకృతి వహింప; మేన, వల్మీక మలమె
మరలి వచ్చిరి; వారు నాదరికి, మఱియు ॥ 323

యుగ సహస్రాంతమున; నెమ్మి; మగిడి వచ్చి
చాలు జాలును, నీతపశ్చర్య; విడువు
మని; మునులు వల్క; వల్మీకమును విడిచితి
హిమ వినిర్ముక్తు డైనట్టి ద్యుమణి వోలె ॥ 324

వారు, ననుగృపగని, మునివర్య! మరల
నీవు వల్మీకమున జనియింప బట్టి
యింక 'వాల్మీకి' యను నామ మెనసి, వెలయు
మనుచు గృపమీర బల్కుచు జనిరి వేగ ॥ 325

దేవ! త్వన్నామ రహిత ప్రభావ గరిమ
మంది శ్రీ జానకీ లక్ష్మణాన్వితునిను
గన్ను గవవిందుగా గాంచి, కంటి ముక్తి
సంశయములేదు; నాజని సఫలమయ్యె ॥ 326

రమ్ము చూపెద నొక మందిరమ్ము నీకు
ననుచు సీతయు, రామలక్ష్మణులు వెంట
రాగ శిష్యులతో వేగమేగి శైల
గంగలకు మధ్య సీమను గాంచి యంత ॥ 327

అచట, విశాలమై వెలయునట్టి పవిత్రతలమ్ము గాంచి, మీ
రిచట వసింపుడంచు, ముని యెంచి, ఘటించె గృహ ద్వయమ్ము; త
ద్రచితములైన గేహములు, రాముడు, సీతయు, నొక్క యింట బ
ర్ణ చితతదన్యగేహమున; లక్ష్మణుడున్, వసియించి రంతటన్ ॥ 328

అట్టులుండ, వారి, కమ్మునివర్యుండు
నర్చ లిచ్చి చనియె, నంత, రామ
చంద్రుడతివతో, సురేంద్రుడు శచిగూడి
యుండి నట్టులచట నుండె; గౌరి! 329

ఆరవ సర్గ సమాప్తం



# నిర్వచన అధ్యాత్మ రామాయణం

## అయోధ్యకాండ - 7వ సర్గ

వినగదె; పార్వతీ! యవలివృత్తము నెల్ల, సుమంత్రు; డాదిన
మ్మున, రవిక్రుంకునప్పటికి; మోమున వస్త్రము గప్పి, బాష్పలో
చనడగుచున్, బురము వెలి చక్కటి స్యందనముంచి, భూవిభున్
గన జని నమ్రుడౌచు, జయశబ్దముతో వడిమ్రొక్కి నిల్చినన్ ॥ 330

మనుజవిభుండు, వచ్చిన సుమంత్రుని; గన్గొని, యశ్రుపూర్ణ లో
చనముల, విహ్వలుండయి, వెసం, దడియారిననాల్క, మాట రా
మి, నెటులోపల్కుచున్, సచివ! మిత్రమ! వచ్చితె వారి నెంత కుం
బనిచి, రథమ్ము త్రిప్పితివి; భాగ్యవిహీనుడనైతి; నయ్యయో! 331

చెడుగరినైతి, నో, సచివ శేఖర! సీతను గూడి రాముడి
ప్పు డెచట; నున్న వాడెచట, బోవిడ నాడితి నీవు? వారి; న
న్నెడసిన రాముడేమనియె? నేమనె? జానకి; లక్ష్మణుండు, క
ట్టిడినని, నన్ను నేమనె? కడిందిగ జేసితి; వంత వారికిన్ ॥ 332

హా! రామచంద్ర! లక్ష్మణ!
హా రామారత్న మైథిలాత్మజ! శమనుం
జేరునను, వీడి, కానకు
మీరిటు చనినారొ? న్యాయమే, మతి చెడితిన్ ॥ 333

అని, యిటు, లేడ్చుచున్న మనుజాధిపు నారసి మంత్రి పల్కెనో
యనఘ! మునింగి దేటికి శుగర్ణవ మందిటు లాభమున్నదా?
వినుము, వచింతు, నీ సుతుల వృత్తము; వారల శృంగ బేర ప
త్తనముదరిన్, బవిత్ర జలదాయిని గంగకు జెంత, నిల్చితిన్ ॥ 3340

అచట; రఘూద్వహుడు; మహితాశయుడైన గుహుండు; మాధురీ
రుచిరములౌ, ఫలమ్ములను, రుచ్యములై తనియించు మూలమున్
ప్రచురణముగా, నొసంగిన, గరమ్మున దాకియె గౌరవించి, వజ్ర
నుచిత జటా కిరీటము సముత్సకతన్ ఘటియించు పూనికన్ ॥ 335

సారజ్ఞా! మాకువట
క్షీరము దెప్పింపు, దాన జేయవలె, జటా
భరమకుట, మనగ నతం
డారీతి; నొనర్చె; సువినయాన్వితుడగుచున్ ॥ 336

తెప్పించిన, దానం, దన
కొప్పంతయు జడలముడిచి కొని రాముడు; సీ
తప్పయు, దమ్ముండును, దన
చొప్పున రా, వెడలునన్ను జూచి యిటులనెన్ ॥ 337

ఓ మంత్రి వర! మాకై
భూమిశుడు, మాతృదేవి పొగల, దగ దయో
ధ్యా మందిరాధికము విపి
నామల పర్ణాలయమ్మటంచు దెలుపుమీ ॥ 338

మరియు నొక్కటి వేడెద; మంత్రివర్య!
ముదుసలియు శోక సంతప్త హృదయుడునగు
నాజనకు నారటమ్ము మాన్పదగినట్టి
యూ ఊడపు బల్కులాడి, మమ్ము ద్ధరింపు ॥ 339

అనెడి, నీసుతునుడులు విన్నంత, సీత
యశ్రుజల పూరితాక్షియై యనియె నిట్లు
మంత్రివర ! పూజ్యులౌ నత్తమామల పద
ములకు సాష్టాంగ వందనములను దెల్పు !! 340

అనుచునామె, యవాఙ్ముఖీ యగుచు నేగె
నంతమూవురు నశ్రుపూర్ణాక్షులగుచు
గదలి, మెల్లగ, నోడను గదియజేరి
యొక్క రొక్కరు దానిపై నెక్కిరంత !! 341

వారు భాగీరధీ పరతీరమెపుడు
చేరుదురొ, సుఖముగనంచు, నారయుచునె
నిలిచి, యావల, నారథ్యములను గట్టి
మరలివచ్చితి, సూర్యాస్తమయము తరినె !! 342

అదివిని; కోసలాల్మజ; శుగశ్రు సమాకులయౌచు, బల్కె, నీ
ముదిమిని, గైకయాసతికి, ఆమోదముగా వరమిచ్చి, రాజ్యమా
ముదితకు నీయవచ్చు; నిజపుత్రుల గానల కన్పుటేల? యా
యది సకలమ్ము నీవలన నయ్యెగదా! యిటులేడ్చి, దేటికిన్ ॥ 343

సతిమాటల్విని, యానృపాలుడు, మనస్సంజాత చింతాంబు, దో
త్థిత బాష్పంబున, నదీ నిమగ్న తనుడై దేవీ! భవత్తీవ్ర వా
క్తతి, పీడాకరమై, వినంబడె, క్షత క్షారమ్ముగా, జావగ
ట్టితి మాటన్, బయనంబు సేయునను నేడ్పింపన్, సతీ కృత్యమే? 344

సతి; విను; మేను బాల్యమున శప్పుడ నైతిని వేటకై, వన
స్థిత మృగజాలమున్ హతము సేయుచు, బ్రీతి, వనింజరించు, చు,
న్నతరి, వినంగ వచ్చెను; నినాద మొకండది మత్తనాగ బృం
హితమను భ్రాంతి, చే, శరము నేసితి మామక శబ్ద, భేదిచే ॥ 345

అటులేసి హతుడనని యెడి
కటుశబ్ద మొకండు నాదు కర్ణయుగము, జే
రుట, కడలుచు, నాతని, చెం
గటకుంజని, వాని జూడ గడు వెఱపొదవెన్ ॥ 346

పడతీ! తత్సరయూ జలమ్ము్మలను సంపాదింపగా, మౌని, పు
త్త్రుడు, తావచ్చి; స్వకీయ కుండి; జలమందుం జేర్ప, నేనుంగు చ
ప్పుడుగా నెంచి వధించి వాని దరికిం బోవంగ నన్గాంచి, యో
జడుడా! నా తలి తండ్రులానిన పిపాసస్మాన్పగా వచ్చితిన్ ॥ 347

వినుమొక వైశ్యమునికి నం
దనుడనగుట, బ్రహ్మ హత్య తగుల, దయిన, నా
జనకుడు, శపించు, నిను, నా
తనువున నాటిన శరమ్ము; తొలగింపుమనన్ ॥ 348

అంతట; తత్పాదా
క్రాంతుడనై దశరధుడను, గజమని యెడు, దు
ర్భ్రాంతిని, వధియించితి నిను
క్షంతవ్యుడ, ననుచు, నతని, శాంతుని జేయన్ ॥ 349

ముదుసలు, లంధులౌ మునుల పుత్త్రుడ వారి కొకండ, నేను, వా
రదె! యటనున్నవారు జలమానెడి కోరికి; దాని దీర్పవే
పాదము; తదీయమైన వగపుంగడ తేర్పుము; మంచి మాటలన్
మదిగలమాట తెల్పితిని; నాతనువింక త్యజింతు" నంచనన్ ॥ 350

విని, తనువెల్లెడల, జెమరు వెల్వడి, నిల్వున నీరుగాగ, నా
జని ఫలమిట్టి దయ్యె! ముని సంతతి జంపితి నేమి సేయు వా
డని, కనటంచు జింతిలుచు, డగ్గరి, వారికి వారి నిచ్చి, త్రా
గిన పిదపన్వచించితిని ఖేదము హెచ్చగ వృత్తమంతయున్ ॥ 351

వినిచినయంతనే, యతడు, విహ్వలమానసుడౌచు, హా సుతా !
తనువుత్యజించి, నీదు తలితండ్రుల వీడితి వెట్లు? మత్పురా
జనికృత మిట్టిదయిసాగగ! నెవ్వరి నేమి దూఱగా
జను, నయయో ! విధీ ! యముని సద్మము చేర్పు మటంచు గిన్కమై ॥ 352

ఓరీ! రాజాధమ! మే
మేరీతిగ బుత్త్రశోక మెనసి, మృతులమై
నారమొ? నీవటులగుదని
క్రూరముగా బలికి, దివముగొనజని; రంతన్ ॥ 353

వారికి; దహనాదిక సం
స్కారములొనరించి; మౌని శాపనిహతికిన్
భీరుడనగుచు; నయోధ్యం
జేరితి; నిందేమి తప్పు చేసితి; దేవీ ! 354

అనుచు నృపుడు; హా రామా!
జనకాత్మజ! భాతృభక్త! సౌమిత్రీ! మ
మ్మును వీడి పోయితిరె?
తద్వని కనుచుం బ్రాణములను వదలెన్ బిదపన్ ॥ 355

అకటా! పంక్తి రథప్రభుండు; నిజ దేహత్యాగముంజేసె; నే
మికతంబో! యని, భృత్యులెల్ల; దమసామింజేరి; హా హారవ
రవమ్ము; కఠోరవమ్ముగ జేయ; నంతిపురి నంభోరాశి కల్లోల వా
రకృత ధ్వానములుప్పతిల్లెను; దెసల్భ్రాంతమ్ముగా, జేయుచున్ ॥ 356

అంతట; తెల్లవారె; జగమంతయు; మేల్కనె; బక్షిజాతి; భూ
కాంతుడు ప్రాణముల్విడువగా గతమెయ్యది యన్న జానకీ
కాంతు వియోగమే యనుచు గట్టిగ మ్రోగిన మ్రోత, తద్దిశా
ప్రాంతములంజరించె; రవిప్రాగ్గిరి కన్పడ నయ్యె! నంతటన్ ॥ 357

హా! వల్లభ! మమ్మిట్టులు
పోవిడిచితె మరల, విబుధ పుంగవుడు, నినున్
రావలెననెనొ? యనుచుగా
రావమ్ముల,నంతిపురి నిరంతరమయ్యెన్ ॥ 358

ఆ వార్త విని; వశిష్టుం
డావేశము మీర! మంత్రులందరు; వెంటన్
రావెడలి; చనియె; శోకా
రావమ్ములు పెరిగె; దత్పురము ఘూర్ణిల్లన్ ॥ 359

అంతట వశిష్టముని; య
య్యంతి పురి వసించు దశరధాధీశ్వరు స
త్కాంతల, దుఃఖాక్రాంతల
యంతిక ముంజేరి, యిట్టులనె శాంతముగా ॥ 360

ఏలా? మీరిటు లేద్వ దైవ విహితం బెవ్వారి కిందప్పునే?
చాలింపుండని; యూఅటంబలికి; తత్క్ష్మానాధుమేనొక్కచో
దైల ద్రోణిని; నిల్పి, శత్రుహరునిం, దత్కైకయీ పుత్రు; నా
వేళం, దేరగ; భృత్యులం, బనిచె; వే, వేరాగ, శాసించు చున్ ॥ 36

వినుడు; మదాజ్ఞ! మీరు కడు వేగముగా జని; మేన మామ ప
త్రనమున నున్న శత్రుహరు, దద్భరతుం, గని, మిమ్ము నేడె మీ
జనకుడు; తల్లి చూడవలె సాకులు తెల్పక వెంటరాగ, గా
రణము; నెఱుంగ గోరకయె, రండని తెల్పుడు వేగ బొండనెన్ ॥ 36

వారు, యుధా జిత్పురికి
వారువముల, వేగ, నేగి, వారింగని, భూ
దార సుతులారా! మిము దో
డ్తేరన్గురు డనుప వచ్చితిమి, వెడలుడికన్ ॥ 36

అనవిని; కైకయీ సుతుడహో! యిదియేటికి మమ్ము రమ్మటం
చను గురుడంపె; దండ్రియును,సోదర యుగ్మము; మాతలు సేమమున్
గనగ, నదేమొ కారణము గాదుగదా! యనిచింత నొందుచున్
జనె; నిజసోదరుండు; తన సన్నిధిరాగ నయోధ్య కున్వడిన్ ॥ 364

వచ్చుచు; బత్తనమ్ము, నిరువంకల గాంచి యిదేమి వింతయో
యెచ్చట జూచినన్ శుభదమేదియు గానగరాదు; పౌరులిం
దిచ్చమెయిం, జరింప, డొక డేని యటంచునె, తల్లి సౌధముం
జొచ్చి; నమస్కరించుటయుజూచి; ముదంబలరార, నామెయున్ ॥ 365

వచ్చితె; మత్తనయా! యని
ముచ్చటగా జేరి, తలను మూర్కొని; తొడపై
నిచ్చనునిచి, కౌగిలిడం
జొచ్చి; తనకు గలుగు ముదము జూప నతడనెన్ ॥ 366

అమ్మా! మమ్ము రమ్మనగ, గ
తమ్మేది? తండ్రియును, రామధరణీశుడు, సే
మమ్ముగ, నుండిరె? లక్ష్మణు
డెమ్మెయి నున్నాడు, తెలుపవే? సుఖులే గదా! 367

నా జనకుడు కన్నడడే;
మీ; జననీ! నిన్ను విడిచి; మెలగెనే? యెపుడున్
బూజార్హ! తెలుపు మన; నా
రాజీవ దళాక్షి యనె భరతుతోడ; నిటుల్ ॥ 368

అశ్వమేథాది యాగము లాచరించి
నట్టి పావనులే గతి నందినారొ?
తద్గతిని గాంచె బుత్ర నీ తండ్రి యిపుడు;
తగదు; దుఃఖము నీకు బుత్రక! వివేకి ॥ 369

ఆ పరుషోక్తికి భరతుడు;
భూపతితుం డగుచు, రాజపుంగవ దివము౦
బ్రాపించితె?; సుత వత్సల!
హా! పిత! మము బాసి పోవ! న్యాయంబగునే? 370

సీతా విభు భూపతి; నీ
చేతుల జేయకయె; యిటుత్యజించితె; యసువుల్;
నీతియె నీకిది; తండ్రీ!
యే తీరున; నిలుచు వారమిల; మేమింకన్ ॥ 371

అని మరియు భరతుడిట్లనె;
జనపతిం రాఘవుడు, జనక జాతయు; మా, ల
క్ష్మణుడును; గనరారేమి!
వినిపింపుము; కాకయున్న; విడుతునసువులన్ ॥ 372

అనుటయు నామెవల్కె; తనయా! వినయాన్విత! నీకు; మేలొన
ర్పనె; మిము బిల్చినాము; మనరాముని రాజుగనెంచి; నీ
జనకుడు; నిశ్చయింప; నిను సర్వమహీశుని జేయ నేను, నా
మునుగొని నట్టి రెండు వరముల్, మదినుంచుక, నేడు కోరితిన్ ॥ 373

అందొకటి; నీవు రాజ్యము
నొందుట; రెండవది; రాముడుర్వి విడిచి, కా
నం దవిలి పదియు నాల్గేం
డ్లందుట; దీని కేమి యందువొ? పుత్రా! 374

అంతట రాముడు; సీతా
కాంతయు; లక్ష్మణుడు వెంటగదలగ; గహన
ప్రాంతము జేరెను; నీ పిత
చింతాక్రాంతుడయి; దివము చేరెను; బుత్రా! 375

రాజ్యము నీ దయ్యెను; సుఖ
భోజ్యముగా; దీని నీవు భుజియింపుము; త
త్ప్రాజ్యమగు నయోధ్యా సా
మ్రాజ్య ధీశత వహించి; మనగదె! వత్సా! 376

అనవిని; కైకయీ సుతుడహా! యిటులయ్యెనె? యంచు, గాంతి త
ప్పిన మొగమందు గన్ను గవజేరిన బాష్పజలమ్ముగొంత, సే
పునకు బ్రవాహమై, మరియు, బూర్ణత గాంచి, క్రమాన, శోక వా
రి నిధిని జేర నాతడు ధరిత్రి; హత ద్రుమ మట్లు బోరనన్ ॥ 377

ఒడలెఱుగక పడి, మేల్కని
కడ కానగ రాని శోక కల్లోలములన్
దడిసిన చిత్తము తోగడు
చిడిముడి పాటొందవి, కనుల, జేవురువాడమన్ ॥ 378

తల్లివె? నీవొక దుర్వి ష
వల్లివి; గాకున్న; భ్రాతృ వత్సలు రామున్
జెల్లదనక; వని కమ్పదె?
యిల్లోకము తిట్ట కుండునే! నిన్నెపుడున్ ॥ 379

ఏమీ? రాజ్యమునాకు గూర్చితివె? సర్వేశుండు, వీరుండు శ్రీ
రాముం, దుర్వింనెల్లబ్రోవ దగడా! రాకాసీ! కాకెవ్వరీ
స్వామి ద్రోహము నేర్పిరా! పయిగ; దత్సత్వాబ్ధికిం, గానకే
లా? మార్గమ్మును జూపినా, వకట; మేలా? దుర్విష స్రావిణీ! 380

అనికొంతవడికి; స్వాస్థ్యము;
గొని; హా! రాఘవ! సుమిత్రత కూర్మితనయ! హా!
జననీ! జానకీ భీకర
వనములకేగితిరె? మిమ్ము బాసి! నిలుతునె? 381

వినుమిపుడే! దుర్విషముం
దినియో! అగ్ని జొరబడియొ; తీవ్రాసి, గళ
మ్మున గోసికొనియొ? ప్రాణము
లను విడిచెద, నాకు రాజ్యలక్ష్మి వలయునా ? 382

హా! పతిఘాతిని! దుష్టా!
పాపిని, నిరయమున, నీవు పడకుందవా? మే
లే? పండువంటి రాముని
బాపితి, విదియేమి కర్మ ఫలమో నీకున్ ॥ 383

అని మండిపడుచు నాతడు
చనె; నాకౌసల్య యున్న సదనమునకు; నా
తనిగని; యా మెయు రోదన
మొనరించుచు; భరత! వచ్చితో? యిటులయ్యెన్ ॥ 384

వింటివె? కైకయి చేసిన
కొంటెతనము రామ విభునకుం, గాదగు నీ
పంట వెలది తప్పెను; నీ
వింటను లేకునికి; గర్మమిటులుండెనయో! 385

నీ తండ్రి దివము చేరగ
నీ తల్లి యె కారణంబని; వచింపగ, నే
లా? తప్పునె? విధి వ్రాసిన
వ్రాత ఫలము; దీనికేల? వగవు; కుమారా! 386

అనవిని, కైకయీ తనయుడా మె పదమ్ముల వ్రాలి, మ్రొక్కి, లే
చి, నిలువ; గోసలాత్మజని, చేరగదీసి; కవుంగలించి, యో
తనయ! విషాదమేటికిటు? ధైర్యము పూనుమటంచు దెల్పుచున్
గనుగవ; నశ్రు బిందువులు కాలువలై దిగబాఱ; నేడ్చుచున్ ॥ 387

భరతా! వినయాది సుగుణ
భరితా! శ్రీరామచంద్ర పద భక్తుడవై
జరుపుము పదునాల్గేడులు
మరల; నతడు వచ్చి నిన్ను మన్నింప; డాకో? 388

అంతట రాముడు; సీతా
కాంతయు; లక్ష్మణుడు వెంటగదలగ; గహన
ప్రాంతము జేరెను; నీ పిత
చింతాక్రాంతుడయి; దివము చేరెను; బుత్రా! 375

రాజ్యము నీ దయ్యెను; సుఖ
భోజ్యముగా; దీని నీవు భుజియింపుము; త
త్పూజ్యమగు నయోధ్యా సా
మ్రాజ్య ధీశత వహించి; మనగదె! వత్సా! 376

అనవిని; కైకయీ సుతుడహా! యిటులయ్యెనె? యంచు, గాంతి త
ప్పిన మొగమందు గన్ను గవజేరిన బాష్పజలమ్ముగొంత, సే
పునకు బ్రవాహమై, మరియు, బూర్ణత గాంచి, క్రమాన, శోక వా
రి నిధిని జేర నాతడు ధరిత్రి; హత ద్రుమ మట్లు బోరనన్ ॥ 377

ఒడలెఱుగక పడి, మేల్కని
కడ కానగ రాని శోక కల్లోలములన్
దడిసిన చిత్తము తోగడు
చిడిముడి పాటొదవి, కనుల, జేవురువాడమన్ ॥ 378

తల్లివె? నీవొక దుర్వి ష
వల్లివి; గాకున్న; భ్రాతృ వత్సలు రామున్
జెల్లదనక; వని కన్పుదె?
యిల్లోకము తిట్ట కుండునే! నిన్నెపుడున్ ॥ 379

ఏమీ? రాజ్యమునాకు గూర్చితివె? సర్వేశుండు, వీరుండు శ్రీ
రాముం, దుర్వింనెల్లబ్రోవ దగడా! రాకాసీ! కాకెవ్వరీ
స్వామి ద్రోహము నేర్పిరా! పయిగ; దత్సత్వాబ్ధికిం, గానకే
లా? మార్గమ్మును జూపినా, వకట; మేలా? దుర్విష స్రావిణీ! 380

అనికొంతవడికి; స్వాస్థ్యము;
గొని; హా! రాఘవ! సుమిత్ర కూర్మితనయ! హా!
జననీ! జానకీ భీకర
వనములకేగితిరె? మిమ్ము బాసి! నిలుతునె? 381

వినుమిపుడే! దుర్విషముం
దినియో! అగ్ని జొరబడియొ; తీవ్రాసి, గళ
మ్మున గోసికొనియొ? ప్రాణము
లను విడిచెద, నాకు రాజ్యలక్ష్మి వలయునా ? 382

హా! పతిఘాతిని! దుష్టా!
పాపిని, నిరయమున, నీవు పడకుందవా? మే
లే? పండువంటి రాముని
బాపితి, విదియేమి కర్మ ఫలమో వీకున్ ॥ 383

అని మండిపడుచు నాతడు
చనె; నాకౌసల్య యున్న సదనమునకు; నా
తనిగని; యా మెయు రోదన
మొనరించుచు; భరత! వచ్చితో? యిటులయ్యెన్ ॥ 384

వింటివె? కైకయి చేసిన
కొంటెతనము రామ విభునకుం, గాదగు నీ
పంట వెలది తప్పెను; నీ
వింటను లేకునికి; గర్మమిటులుండెనయో! 385

నీ తండ్రి దివము చేరగ
నీ తల్లి యె కారణంబని; వచింపగ, నే
లా? తప్పునె? విధి వ్రాసిన
వ్రాత ఫలము; దీనికేల? వగపు; కుమారా! 386

అనవిని, కైకయీ తనయుడా మె పదమ్ముల వ్రాలి, మ్రొక్కి, లే
చి, నిలువ; గోసలాత్మజని, చేరగదీసి; కవుంగలించి, యో
తనయ! విషాదమేటికిటు? ధైర్యము పూనుమటంచు దెల్పుచున్
గనుగవ; నశ్రు బిందువులు కాలువలై దిగబాఱ; నేడ్చుచున్ ॥ 387

భరతా! వినయాది సుగుణ
భరితా! శ్రీరామచంద్ర పద భక్తుడవై
జరుపుము పదునాల్గేడులు
మరల; నతడు వచ్చి నిన్ను మన్నింప; డొకో? 388

అని, యా కౌసల్యయు దన
తనయుంతలపోసి దుఃఖతప్తయగుచు; నం
దన! మమ్ము వీడి యడవికి
జనితివె? ప్రాణముల్ నిలుప శక్యమె? యనగన్ ॥ 389

విని భరతుండు; కోపకృత వేగతనండయి; కేలగత్తి చే
కొని; వడిలేచి; నేనిపుడె, కూల్తు వసిష్ఠు; నరుంధతీయుతున్
దునిమెద; బ్రహ్మహత్యయను దుష్కృతి; నన్నిరయమ్ము; జేర్ప; ని
మ్మనుచు; వచియించుచుండ; గురుడచ్చటకుంజనుదెంచె; దవ్వలన్ ॥ 390

నిలిచి; వచించె; నిట్లు; గుణనీరథి; నీ జనకుండు వేడ్క; ని
య్యిల; జిరకాలమేలి; యిపుడిట్టులు మేన్విడనాడి దేవతా
నిలయము చేరె; ఋణ్యునతనిం, దలపోసి, విచారమేల? జీ
వులకు, జనియించుటల్, మడిసిపోవుటలున్, సహజంబకావొకో ! 391

ముక్తి భాజనుడై, దివమునకు శాశ్వ
తమ్ముగా నట్టి దేహము తొలగి యిపుడు
నిత్యమౌ నాత్మతో; నైక మత్యమున, న
శోచ్యవాతని; గూర్చి యీ శోక మేల? 392

అవ్యయుడు; శుద్ధుడజని; నా
శాది హీనుడగుచు జడమయి నట్టిదేహమును వీడి
చనిన తండ్రికి శోకింప దగువె? నీకు
జ్ఞాన దృష్టిని గనుము; దుఃఖమ్ము విడుము ॥ 393

జనకుడో, తనయుడో దేహమును ద్యజించి
నపుడు తల మోదికొనుచు మూఢాత్ములవని
రోదన మొనర్చు చుండ్రది గాదు జ్ఞాని
కది, యనిత్యము; దానికై యగునె; వగపు ॥ 394

చావు పుట్టువులన గ్రొత్త గావుజగతి
బుట్టువు గలట్టి తనువులు; గిట్టుచుండు;
నట్టి నశ్వరమైన దేహమ్ము విడిచి
నట్టి నీ తండ్రి కై వగ పంద నేల? 395

అట్టి తనువునకు నెన్నడైన నత్యయము తప్ప
దాత్మ మొక్కపుడేని, దేహమ్ముగాదు
పాంచ భౌతిక మగు దేహ పంజరమ్మె
దగ్ధమగునది గాని; నీ తండ్రి యగునే ॥ 396

అరసితివా? లేదా? యొకమాట యడిగెద నిను
దెలుప మది; నీ జనకుండు; దేహమగు నా?
యాత్మయే, యౌనా? దాని సత్యము నెఱింగి
తేని, నీ కిట్టి చింతయున్నె? కుమార! 397

నామ రూపమ్ములకు భాజనమ్మగునది
యంతయును గాంచునదియు దేహమ్మె గాని
నిత్యమౌ నాత్మ గాదది సత్యము; మరి
సచ్చిదానంద రూపము చావుగనదు ॥ 398

కర్మవశముగ దనువులు గల్గుచుండు
గాల వశముగ, నాశము గాంచుచుండు
చివికియో, చివకయో మెయి
తవులబడును; జీర్ణవసనమ్మునకుం జింత చెందనేల? 399

అశ్వమేధాది యాగమ్ము లాచరించి
యమరలోకాన; నింద్రునర్ధాసనమున
గూరుచున్నట్టి దశరథు గుఱిచి, చింత
నొందదగునయ్య! స్వాస్థ్యమునొందు మయ్య! 400

ఆ వశిష్ఠుని వచనములాలకించి
భరతుడించుక, నెమ్మది వడుచు, భక్తి
రామచంద్రుని జిత్త సారసమునందు
మనిచి; తద్ధ్యాన పూజల జలుపనెంచి ॥ 401

ఆదియును లేక; యంతమునందబోక
పాల్కడలిలోన సద్వట పత్రమందు
యోగ నిద్ర నధిష్టించి యున్న హరియె
రాముడగుట దలంపు నిరంతరమ్ము ॥ 402

అంతట వెండియున్ భరతునారసి, పల్కెఁ; గుమార! యిప్పుడే
కాంతముగా బవిత్ర నిలయమ్మున, నూని య దొనెయందు; శు
ద్ధాంత జనావృతిన్నిలిపి నట్టి భవత్పితకీవు, శాస్త్ర సి
ద్ధాంత పథానుసారి దహనాదిక సంస్క్రియలాచరింపు మీ ॥ 403

అనభరతుండు; తద్వచన మాదృతినై; శిరసావహించి త
జ్జనకున, కాహితాగ్నులకు సద్గతి గూర్చు పథమ్ముబూని యే
మొనరిచి, యా పయిం, బదునొకండవ రోజున; విప్ర కోటి, భో
జనము, సదక్షిణాకముగ; జల్పెఁ; నృపోచిత, గౌరవమ్ముగన్ ॥ 404

వేలకొలది గోవులు; వే
వేలుగ భూమ్యాది వివిధ వితరణములు; నా
ప్రోలన్ దేశమ్మున గనక
జాలిన విప్రుల కొసంగె; సంతస; మెసగన్ ॥ 405

అటు; లొసగి పితకు; సద్గతి
ఘటియిల్లగ, బాదలౌకిక క్రియలుసము
త్కట రీతి; జరపి శుచియై
పటు రామ వియోగ దుఃఖ భరిత హృదయుడై ॥ 406

రక్కసివైతివే యిహపమ్ములకీవతి దూర వృత్తి వై
యిక్కరణిన్, మహా మహుడహీన గుణాఢ్యుడు, రాముడంచు, నీ
వక్కటి కమ్మ ; చూపక, ఘనాటవులం, జరియింప, బంపినా
వక్కట ! యాతనిన్, విడుతునా ! యిపుడే చనెదన్, విను ; మింత ; కైకయీ ! 407

అని పలికి, భరతుడా
రాముని, భక్తిందలచి, కాలమును గడపగ ; నా
దిన మెటోచన రాతిరి, య
య్యెను ; వారెల్లరును, నిదుర కేగిరి ; వరుసన్ ॥ 408

7వ సర్గ సంపూర్ణం



# నిర్వచన అధ్యాత్మ రామాయణం

## అయోధ్యకాండ - 8వ సర్గ

గౌరీ ! వినగదె పితృ సం
స్కారములన్ భరతుడటులు జరపి, నిదురకున్
దూరుడగుచు, దూరుపు తెల
వారుటయున్, లేచె, రామవందనపరుడై ॥ 409

అంతట దద్గురుండు, సచివాది పరీవృతుండౌచు, దత్సభా
భ్యంతరసీమ ; వాసవుసభన్ బరమేష్ఠియుబోలెనుండి, సా
మంతులు, మంత్రి వర్గము, సమస్త జనమ్ముమను సమ్మతింప, వై
ర్యంతకుతోడ ; దద్భరతునందులకుంబిలిపించి వారికిన్ 410

భూపాలార్హాసనముల
జూపి; ముపవసింపజేసి; సూక్తిమెయి; గురుం
డీపగిది; బలికె; భరత నృ
పా! పరమార్థ మ్మొకండు ; పలికెద ; విను మీ॥ 411

నీజనకుండు; సత్యనిధి; నీ జననిం దనియింప; గల్గి, నిన్
రాజుగ జేసె గావున, ధరాభరము న్వహియింపనయ్యె; నా
రాజ; నృత ప్రియుండయివర ద్వయ మిచ్చుట నింత వుట్టి; నీ
క్ష్మా జనమెల్ల బట్టమును గట్టెడి; నీకిది సమ్మతింపుమీ! 412

పిత్రాజ్ఞాను గతుండయి
ధాత్రి వదలి, రామ విభుడు, తరలె, వనికి, ద
త్పిత్రాజ్ఞ దాటరామి; ధ
రిత్రీ రక్షణము, నినువరించె, గుమారా! 413

అనుజుండు శత్రుఘ్నుడు; నీ
మనసు దెలిసి, తోడుపాటు మసలకొనర్పన్
గొను మీ రాజ్యము; పితృ శా
సనమిది; తప్ప దికదీని; జరపుము వత్సా ! 414

అని మధు రోక్తులంబలుకు నాగురుగన్గొని కైక యీ సుతుం
డనియెను, ''రాజ్యమేల వలెనా? యభిషేకము సేయనుంటిరా?
వినుడు; మదీయ నిశ్చయము; వేకువనే యనుజన్మతోడ, రా
ముని; గనబోయెదం, తమరు మోదముతో జనుదెండి; మానుడీ ॥ 415

ఆరామవిభువలె జటా
ధారులమై; వల్కలముల ధరియించి; వనిం
జేరి, యతని మరలు మనుచు
గోరెద; మదిగాక యున్న, గూడెద, మతనిన్ 416

రామచంద్రుడు రాజాధిరాజు మనకు
మనము తత్ప్రభు సేవకమండమ్మ
నగుట; రాజ్యము పాలింపదగు నతండె
యన్న పితృసముడని; పెద్దలనగ; వినమొ ॥ 417

రక్కసి, కైకయి తప్పగ
దక్కినజనమెల్ల మద్గ తాను గతిగ, దే
రెక్కక; కాల్నడకనె; కడు
నక్కఱ మెయింబోవు వారమిది; మేల్గాదో ? 418

అని మరియు బలికె; భరతుడు
జననీ సంజ్ఞకను, దనుజసతి గైకయి, నే
దునిమిన నను రాఘవుడే
మనునొ? యను సందియమ్మ నంది, విడిచితిన్ ॥ 419

అనుటయు దత్సభాజన; మహా! యని మెచ్చుచు సమ్మతించి; యా
తని వెనువెంట బోవుటకు; దాము ప్రయాణము సేయ; సామజా
శ్వనికరముల్, హితుల్, మరియు, స్యందన కోటియు, భృత్య వర్గమున్
జనె బురలక్ష్మి; రామ జననాథుని గానగ బోవు కైవడిన్ ॥ 420

కోసల నృపజాత సుమి
త్రా సతియున్, మరియు సచితియు, గురుడు, భా
ర్యా సహితుడు, వెడలిరి, వన
వాసుని, శ్రీరాముగనెడి వాత్సల్యమునన్ ॥ 421

అంతటను శృంగబేర పురాంతికమున
జాహ్నవీ తటమున బృధు సైన్యములను
జేర్చి; శత్రు హరుండు; రక్షించు చుండ
విడిసె; భరతుడు తద్గుహు వీటి చెంత ॥ 422

అప్పటి సైన్యముంగని, గుహాహ్వయ శాబర నాధుడద్భుతం
బుప్పతిలంగ; సందియమునొంది; "యిటుల్ భరతుండు; వచ్చె; నే
చొప్పొకొ? తన్మనోగతము; సుంత యెఱింగెదనంచు గాను కల్
గొప్పగ గొంచుబోయెదనకున్, భరతున్ హితజేయ నెంచుచున్ ॥ 423

చనుచు; నతడు తన జ్ఞాతుల
గని; "మీరెల్లరును, దెసల్ గావవలయు, నే
మును చని, తదాశయము గను
గొని వచ్చెద"; నంచు గదలె, గూర్మియొదవగన్ ॥ 424

అపుడా కైకయినందనుండి; గుహు; బ్రేమానందముల్ మీరగాం;
చి, పితృ ప్రాణ సఖుండితండగుట దత్సీ తేశుని గార విం
చి; పృధు్నపేమను గాంచియుండునని తోచెన్మాకు; నట్లొటనే
నిపుడా సజ్జను సత్కరింపదగు నంచెంతే బ్రసన్నాత్ముడై ॥ 425

ఓ శబరనాధ! పూత, మ
హాశయ! యిటురమ్ము, తత్సుఖాసనమున, సం
వేశింపుము; కౌగిటి, కా
దేశింపుము నన్ను సన్మతీ! ప్రియ ఫణితీ! 426

పూత చరితు; శ్రీరామో
ర్వీతల నాయకుని, జాహ్నవీతటినిన్, నీ
వేతీరున జేర్చితో? మము
నాతండున్న కడ, కనుపుమా ప్రీతినిటుల్ ॥ 427

కోమల జల దామల రుచి
ధామున్, లోకాభి రాము, ధరణీ తనయా
ప్రేమ సురా రామున్, జిత
కామువినుత నాము, రాము, గర్వవిరామున్ ॥ 428

తలచుచు, మ్రొక్కుచు, శ్రితవ
త్సలు డగు రాఘవుడు మెలగు తావులగన, ను
త్తల పడుచు, గుహుని గనుగొని
పలికెఁ; భరతుడిట్లు శోక భరితుండగుచున్ ॥ 429

దేవియగు సీత ; శ్రీరా
మావనినాయకుడు ; లక్ష్మణానుజుండే, యే
తావుల జరియించిరో ? నా
కావిధముల, దెలుపు మనుచు, నరసియిటులనెన్ ॥ 430

అకటా ! తల్లిరో ? జానకీ ! కఠిన దర్భాస్తీర్ణమౌ శయ్యపై
వికటానేక మృగారవోదిత భయా విష్టాత్మవై, యెట్లు, ని
ద్రకు ; లోనైతివా ? నేన కారణముగాదో ? యింతకున్ దుష్ట బు
ద్ధికి ; గైకేయి కిబుట్టినాడ ; శుభకీర్తిం గాంచగా నౌదునే 431

అన్నా ! రాఘవ ! కంటక ప్రచుర దర్భాస్తీర్ణ తల్పమ్మె ; నీ
కౌన్నత్యాంబరచుంబి సౌధమృదుశయ్యా కల్పమయ్యెంగదా !
మన్నింపదగు ; నాకుగా ? నిటులు సామ్రాజ్యమ్ము వాంచించి, నీ
కున్నా కుం, ఘటియించె గష్టము, బహుక్రూరాత్మయౌ, కైకయే 432

ఎంతసుకృతియొ ? సుమిత్రా
సంతతియౌ లక్ష్మణుండు, సతతము శ్రీరా
మాంతిక చరుడై యటవీ
ప్రాంతగతుని, నతని నెడసి, వర్తిలకుంటన్ ॥ 433

నేనా రాముని దాసుల
కైనను, దద్దాస వరులకైనను, సేవం
బూని, యొనర్చిన, ధన్యుడ
గానొకొ ? నాకట్టి ఫలము గలుగ సులభమా ? 434

అన్నా ! శబరాధిప, మా
యన్న యెచట నుండెనో తదాశ్రమ సీమన్
నన్నుం జేరుపమని, కడు
విన్నందన మొదవ ; బలుక విని ; గుహుడనియెన్ ॥ 435

మిత్రవరేణ్య ! సౌ
భ్రాత్రమునకు, రామచంద్రు పదభక్తికి, జా
రిత్రమునకు, ముదమయ్యె; బ
విత్రగుణా ! మనము వేగవెడలుద మనుచున్ ॥ 436

వారిపుడు చిత్రకూటము
చేరువ, మందాకినీ విశిష్ట తటమ్మున్
జేరి, నివసించి, యుండిరి
సారమతీ ! యటకె మనము చనవలె, ననగన్ ॥ 437

వినిసంతసించి తనమా
తను దూరుచు, రామచంద్రదర్శన భాగ్య
మ్మును బొందనెంచి, సంభ్రమ
జనితమహానంద పరవశహృదబ్జుండై ॥ 438

వెడలి గుహుడు తన వెంటం
గడువడి రానన్న యున్న కడకునరుగ ; దా
నుడుగని యశ్రుజలంబుల
దడిసిన మెయి ; నొత్తి కొనుచుదడబడుచు ననెన్ ॥ 439

ఓ విమలాత్మ ! మనము
తత్పావన మౌన్యాశ్రమమ్ము దరిజేరవలెన్
గావున నధిరోహింపుము ;
నావ, ననుచు మరియుననియె నయవినయములన్ ॥ 440

నా వద్ద నైదునూఱులు
నావలుగల, వందు ; నీ యనంతంబగు సై
న్యావళి, యధిరోహించును
రావింపుముసేన, నోభరత, గుణభరితా ॥ 441

అనుచునొక రాజనావ నాతని వసింప
జేదెప్పించి, యందు వసింపు డనుచు
భరతు, నారామ మాతను, గురు వసిష్ఠు
వైరిహంతను నెక్కించి, వేఱొక తరి
భటులు గైకయి నిలువగ బనిచె ; గుహుడు ॥ 442

ఆ రీతి వెడలి, గంగాతీరమ్మును
జేరి యచట, దివ్యముని తప
స్సార భరద్వాజాశ్రమ
దూరస్థలి, సైన్యములను, దొలగ, నిలుపుచున్ 443

సానుజుడై భరతుడు, త
న్మాన్యచ్చుటయు, నగ్ని కల్పుడయిన యా
మౌనియు, వారింగని, పర
మానందముమీర, బలికె, నాదృతినిట్టుల్॥ 444

రాజకుమార ! నీవిపుడు రాజ్యమునేలక, నారలన్, జటా
రాజియు బూన నేమిటు, కరణ్యము, జేరి చరింపనేల ? యీ
యోజ కనన్విచిత్రముగదోయి ; వచింపు మనంగ దద్భర
ద్వాజునిగాంచి, మీకు విదితమ్మె సమస్తమ తెల్పనేటికిన్॥ 445

ఐనను, దావకీన మగునాజ్ఞ యలంఘ్యము, కైకయీవర
మ్మౌనుట, రామచంద్రుడు, మహోన్నతరాజ్యమువీడి, యిట్టు, లి
క్కానలలో జరించుటకు గారణమయ్యె మహాత్మ ! నాతనిన్
గానగ బిల్వవచ్చితినిగా తమ కాంచనిదా యిదంతయున్ ॥ 446

ఈ విధమే, నెఱుగను, ద్వ
త్పావన పదయుగ ము ముట్టి వచియించెద, దో
షావహుగనా ? శుద్ధుగనా ?
భావింపుమటంచు నతని పదముల బడుచున్ ॥ 447

మునివర ! రామచంద్రుడు ; ప్రభుత్వము పూనుట, కర్హుడౌట, నా
తనికొక సేవకుండనయి, తత్పదసేవ యొనర్తుగాని, నా
పనియె ? ధరావనమ్మ సలుపన్, గడునల్పుడ గాన, నమ్మహా
త్మ్మని గొనిపోయి, రాజ్యభారమున్వహియింపుమటంచు ; వేడెదన్॥ 448

అని, యెఱిగించు, నాభరతు నాశయ ; మాతని వాక్యరీతులన్,
గని, మునివర్యుడామహితుగౌగిట జేర్చుచు దచ్చిరమ్ము మూ
ర్ధాని, కడువిస్మయంపడి ; యకుంఠిత సత్త్వగుణాఢ్య ! నీదు భ
క్తిని , భవితవ్యతం, దెలిసితిం దగురీతిగ ; జ్ఞాన దృష్టిచే ॥ 449

నీవు, విషాదము నొందం
గావలదు ; సుమిత్ర సూనుకంటెను ; భక్తిం
గావింతు, రామచంద్రుని
పావన తమ పాదయుగళ పంకజ సేవన్ ॥ 450

మౌని వరేణ్యుడిట్లు, పలుమాఱు, తదీయ పవిత్ర భావముం
బూని, నుతించుచున్ విపుల పుణ్యమతీ ! భరతా ! మదాశ్రమ
స్థానమునందు, సైన్య సహితమ్ముగ నాయిడు విందు మెక్కి, యా
పైని మహాత్ముడైన రఘువల్లభు జూచెదుగాక, రాగదే ! 451

అనవిని, రామానుజుడా
తని వాక్పుష్పము తలనుదాలిచి, సేనల్
తను, వెనుకొనిరా భరతుడు
ముని యాశ్రమ సీమ జేరె ముదమున పిదపన్ ॥ 452

అటు చనుదెంచి నట్టి భరతాదుల, కాతడు గౌరవంబు గూ
ర్చుటకు ; గృశానుసన్నిధి ; విశుద్ధమతి న్విధియుక్తహోమ సం
ఘటిత తపఃక్రియాదులను, గామగవిందనియింప ; షడ్రసో
త్కట మృదుభక్ష్య భోజ్యములఖండముగా గనుపట్టె నచ్చటన్ ॥ 453

ఆ రీతి సిద్ధమగు నా
హారముల ; వసిష్ఠుడర్హుడని, యాతని, ము
న్నారాధించి పిదప బరి
వారముతో, భరతు, దృప్తివంతునొనర్చెన్ ॥ 454

ఆ దినముగడపి మౌని కృ
తాదరగారములంది, యంత, నతండు, సీ
తా దయితుడున్న తావెది
యో దెల్పుమనంగ, మునియు, నొగియిటు తెల్పెన్ 455

కమ్మని, వాత పోతములకల్మిని, బావన జాహ్నవీ తట
స్థమ్మగు చిత్రకూటగిరి, ధామముగా వసియించి, యెంతో సౌ
ఖ్యమ్ముగ, నున్నవారనగ, నాతడు సంతసమంది, తత్ప్రదే
శమ్మున, కేగి, యందుగల సన్ముని వర్గముగాంచి, యిట్లనెన్ ॥ 456

మునివరులార ! రాఘవు నమోఘనివాసము జ్ఞాతమా ? యెఱిం
గిన, వినిపింపుడీ ! యన, నకిల్బిషవృత్తులువారు, రాట్సుతా
కనుమదె , చిత్రకూటనగకాంచన శృంగ సమీపమందు, ర
మ్య నిలయులౌచు, మూవురును, హాయిగనుండిరి, నిక్కమింతయున్ ॥ 457

అనివచియింప, నా భరతుడందులకేగి మహర్షి సత్తపో
జనిత మహత్త్వ శాంత సహజాత విరోధి మృగావతమ్ము, క
మ్రనగ నివాసిపక్షకుల రావమనోజ్ఞ తలమ్ము నైన రా
ముని సదనమ్ము గన్గొని ; ప్రమోద విషాదములుప్పతిల్లగన్ ॥ 458

అదిగని యా భరతుడు , మది
ముద మొదవగ , సైన్యములను ముందుగ నొకచో
వదలి, నిరాడంబరముగ,
గదలి చనెం, దాను రాముగనుగొనెడి తమిన్ ॥ 459

కమనీయ నారికేళ మనోజ్ఞ పనసామ్రరంభాది ఫలతరు జృంభితమ్ము
పృథుల వటాశ్వత్థ పృథివీజ శీతలచ్ఛాయా పవిత్ర విశాల తలము
వకుళ పున్నాగ చంపక మల్లికాస్థల కమలాదిసుమ కుజ సముదయమ్ము
సార మహర్షి సంచారపావన మనోహర దృషదాసన సురుచి రమ్ము
నైన తచ్చిత్ర కూటాద్రి కానన గత
ముని జనాశ్రమముల నెల్ల గనుచు భరతు
డనుజ గుహ సచివులగూడి హర్ష సంభ్ర
మములు పెనగొన జనుచు భక్తి మెయినంత ॥ 460

కమలజములకు, బాల భాస్కరుని పగిది
కమ్రకుముదములకు శీతకరుని భంగి
సాగరమునకు, సంపూర్ణ చంద్రుమాడ్కి గాగ
రాముని దర్శింప గడగె, నతడు, 461

ఎపుడు రాముని సుందరాకృతిని గాంతు
నెపుడు తత్పదముల దలనిడెడివాడ
నెప్పుడాతని కౌగిటనిముడు వాడ
ననుచు భరతుడు సంభ్రమ మెనయ మరియు 462

చనుచు దూరమునందె, రాముని మనోజ్ఞ
వాసముం, బృధుశాఖాగ్ర వల్కలాజి
నాంచితము, ముని సేవ్య మానాభిరామ
మనుజ సమితమ్ముగా నతడరసెనంత ॥ 463

8వ సర్గ సంపూర్ణం



## అయోధ్యకాండ - 9వ సర్గ

దేవీ ! వినుమావలి కథ
పావనమతి భరతుడట్లు భక్తిని, దత్సి
తావిభునాశ్రమ పథమును
వేవేచని కనగ, మిగుల వేడుక పడుచున్ ॥ 464

ధరణీజాతయు, లక్ష్మణుండు, వెనుకం, దన్నంటిరా, రామ భూ,
వరుడీచోట్ల జరించెనంట, యివె, తత్పాదాంకముల్, చక్రముల్
దరముల్ పద్మము, లంకుశమ్ములు, ధ్వజస్థానమ్ములున్, నేత్రగో
చరమౌట న్ముదమయ్యె ; ధన్యులము వత్సా ! చూడు మీ తావులన్ ॥ 465

మనమిపుడు సఫలులము ; రా
ముని పదముల గురుతు, లలరు భూములిటులు, గ
న్గొన గలిగి నార్థమనుచున్
దనివిసనక కనియె, దత్ప్రదక్షిణ పరుడై 466

అమ్మౌనులకున్, వేదాం
తమ్ములకుం, దెలియరాని, తద్రాము పవి
త్రమ్ముల బద పద్మముల
గ్రమ్మిన రజమిపుడుగోచరమ్మయ్యె, నహో ! 467

అని, యచ్చెరువు ప్రమోదము
బెనగొన, దద్రామభద్రపృథుపదచింతా
వనధిమునిగి, భరతుడు, త
జ్జనితానందాశ్రుపూర సంప్లుత తనుడై ॥ 468

క్రమమున, నాతడు, రామా
శ్రమ పదమును జేరి, విపులసారసనేత్రున్
రమణీయ గాత్రు ; దూర్వా
సమనిర్మలనైల్య పాత్రు సరస నరయుచున్ ॥ 469

లోకసుందరు, నీలజటాకిరీటు
వల్కలాంబరుని, ప్రసన్నవదను, బాల
భాస్కరోపమ కాంతి విభ్రాజితతను
నాశ్రమస్థితు రాఘవునరసి చనుచు ॥ 470

జనక సుతా శోభనముఖ
వనజము గనుగొంచు, భాతృపదపద్మముల
య్యనుజుండు లక్ష్మణుడు కడు
వినయమ్మున నొత్తరామువీక్షించి, వెసన్ ॥ 471

ఎదురుగజని, భరతుడు స
మ్మద దుఃఖాశ్రువులు మరియు మరియొదవగ, ద
త్పదముల, కెఱగిన, రాముడు
ముదమున గౌగింట జేర్చి మూర్కొనె, శిరమున్ ॥ 472

అంతట మాతలు సీతా
కాంతు, బిపాసార్త ధేనుగణము జలము కై
గంతుకొని నట్లు చేరగ
సంతసమున దల్లి కతడు, సాగిలి, మ్రొక్కన్ ॥ 473

తల్లియగు కోసలాత్మజ
మెల్లగ, రాఘవుని, ప్రేమమీర, గవుగిటం
జల్లగ జేర్చును, దక్కిన
తల్లులకున్ మ్రొక్కి రామధరణిపుడంతన్ ॥ 474

శిష్టగురు వసిష్ఠునిపై
దృష్టిని సారించి, రాఘవేశుడతనికిన్
సాష్టాంగమెఱిగి, వారి య
థేష్టాసన గతుల జేసి, యెంతొ వినతిమై ॥ 475

మునివర ! సేమమ్మె ? మా
జనకునకున్ మద్వియోగసంతప్తత , నే
మనిపల్కెనొ ? మాకయ్యది
వినిపింపుమటంచు రామవిభుడడిగెవెసన్ ॥ 476

అనుటయు, నావసిష్ఠుడు, గుణాకర ! రాఘవ ! త్వద్వియోగసం
జనిత మహార్తి కోరువక, సంతత ధారగ నేడ్చి యేడ్చి, నీ
జనకుడు, రాఘవా ! జనకజాత ! సుమిత్రాసుతా ! యిటుల్ చనం
జనునె ? యటంచు, సన్మరణశయ్యబడెం, బయిమాట లేటికిన్ ॥ 477

అని కరుణమ్ముగా బలికి నట్టి గురూక్తి, నిజశ్రుతిద్వయిం
జెనకుచు దీవ్రశూలమయి చేరిన దద్రఘునాధుడక్కటా
జనక ! గతించెతే ? ప్రజల సాకుట నీకొక భారమయ్యెనా ?
యని విలపించునంత, విననయ్యె సమస్త జనార్త రావముల్ 478

హాతాత ! ఘనపరాక్రమ !
యీ తీరుగ మమ్ము విడిచి, యేగితివె, దయా
స్పీతుడవుగదా ! నిను బురు
హూతుతోడ్పడగ పిలిచెనొకొ ? మరి యనఘా ! 479

పాలించితివిల, నెంతే
కాలము ప్రజయెల్ల నిన్నుగని పొంగె, నికం
లాలించు మమ్మెవడు ? మా
బాలత్వము వాప ! నీవు భావించితివా ? 480

అనిపలు విధముల బరిదే
వనమొనరుచునగ్రజాతు వదనకమలముం
గని, యనుజులు, దత్సీతయు
వెనువెంటనె పొగిలిరటు వివేకము తొలగన్ ॥ 481

అంతవశిష్ఠుండు, మన
శ్శాంతి కరోక్తులను, రామ చంద్రుని, సీతా
కాంతను, భరతాదులను, బ్ర
శాంతుల గావించి, వేగ స్నాతుల జేయన్ 482

మౌనియు, వారింగొని, గం
గానది జలములను బూతకాయులుగా , సు
స్నానుల జేసి, జలాంజలి
దానము చేయించెనపుడు, దశరధున, కొగిన్॥ 483

జనకుని పావన దజ్జలాంజలుల దీర్చి
పిదప, నింగుదీ ఫలముల పిండి, మధువు
చేర్చి, పిండములు సమకూర్చినారు
పిండదానమొనర్చిరి, తండ్రి, కవల ॥ 484

తాత పాదులకేము, నిత్యము భుజించు
నింగుదీ ఫల పిష్టము నిటులొసంగి
నారమయ్యది, యతనికాహారమగుచు
దృప్తి కూర్చుతమని, పల్కి యేడ్చిరపుడు ॥ 485

అటు లొనర్చి పునస్నానమాచరించి
రామలక్ష్మణులాత్మీయ ధామములకు
జేరదలపగ, దక్కిన వారు మరియు
స్నానములొనరించి, యశ్రు దుస్నాతులైరి ॥ 486

వారా దివసమున, నిరా
హారులగుచు, రేయిగడవ, నమరి నదీ స
ద్వారి బునస్నానములం
దీరిచి, వెనువెంట, బయలు దేరి, రతనితొ ॥ 487

గురునిం, దల్లుల దోడ్కొని
భరతుడనుజుతొడ, రామభద్రాశ్రమమున్
దరిసి సుఖాసన గతుడగు
పరమాత్ముని రామునరసి, పలికి, వినతుడై 488

మనవి యొకండొనర్తు, వినుమా ! రఘునాయక ! యన్నవొట ద
జ్జనకునకీవు తుల్యుడవు , సర్వవిధమ్ములగాక, రాజ్యర
క్షణమొనరింపగా దగినశక్తి గలాడవుగాన, రమ్ము మ
మ్మును, బ్రజబ్రోవ, రాజ్యభరమ్మున్ వహియింప గదయ్య ! రాఘవా ! 489

ఇల జిరకాలమేలి, ధరణీశుల పూజనలనెల్ల గాంచి, వే
ల్పులకు మఖంబులం, జలిపి, భూసురులం దనియించి పుత్రపౌ
త్రులగని, యాపయిన్ ధరణిరోసి నృపాలుడు, కానజేరి, ని
శ్చల హృదయమ్మునం, దపము సల్పుట మేలని నీవెఱుంగవా ? 490

నా తల్లి మూలమున, నే
బాతకి నైతని స్మరింప వలదది, నన్నుం
బ్రీతిగనుము, జేయుదు బ్రణి
పాతమ్మిదె గొనుము, నీదుపదముల కనఘా ! 491

అనిభరతుండగ్రజుపద
వనజమ్ముల వ్రాలి, దండవత్ప్రణతుల జే
సిన, నతని దీసి, రాముడు
తనతొడపై నునిచి, సమ్మదమున నిటులనెన్ ॥ 492

తమ్ముడ ! నీవన్నది స
త్యమ్మె యగునుగాని తండ్రియానతిని నర
ణ్యమ్మున బదునాల్గేడులు
నెమ్మి నిలిచి పిదప బురికి నేనరుదెంతున్॥ 493

భరతా ! మత్సేవన లా
భరతా ! సర్వప్రజాధిపాలన దీక్షా
భరితా ! నినుబూన్చె, నిలా
భరము వహింపుమని తండ్రి పనుపు నిలువుమీ ॥ 494

ఎవ్వడు, స్వతంత్రుడై తండ్రి కెదిరి, యతని
యానతినతిక్రమించునో, యతడు, మేను
విడిచి, దుర్నిరయంబుల బడునుగాన
మనకు, నిర్వురకుం, దండ్రిమాట వలయు ॥ 495

కావున రాజ్యము చేకొని
కావుము, దండక వనమ్ము గాతుము, మేమో
పావన చరితా ! భరతా !
వేవేచని, ప్రజల సౌఖ్య విధములరయుమీ ॥ 496

అతడదివిని, అన్నా ! స్త్రీ
జితుడైకాముకత, మూఢ చిత్తుడయిన, త
త్పితమాట వలయునా ?
మతిమాలిన వానిమాట, మహినెవడు వినున్ ॥ 497

అనవిని, రాముడు వత్సా!
విను, జనకుడు, కామియు, స్వివేకరహితుడున్
వనితా జితుడగునా ? చే
సిన ప్రతినన్నిలిపె, సత్యశీలుండగుటన్ ॥ 498

జనకుడు సత్యభీరువయి, సల్పెనిటుల్, వనితా జితుండుగా
డని, మదినమ్ము యార్యులెపుడైనను దుర్గతి బొంకెమిం
చిన చెడుగండ్రు, నాకునదె, శిష్ట పథమ్మని తోచె, రాఘవుం
డన బడువాడ, సత్యవచనాదృతి చూపునా ? నమ్ము సోదరా ! 499

అనువచనమ్ము, కర్ణముల నంటిన వెంటనె కైకయీ సుతుం
డనియె మహాత్మ ! చీరవసనాదృతినేబదునాలుగేడు లి
వ్వని, నివసింతు, రాజ్య పరిపాలన మీవొనరింప మట్టు లై
న నలరువాడ ! దమ్ముడను, నాదగుకోరికి దీర్పరాదొకో ! 500

అనవిని, రాఘవుడనెనో
యనుజా ! సత్యమ్ము నిలిచెనా ? మన జనకుం
డనినది, బొంకగుగద ! కా
వున రాజ్యమ్మెల్ల నీవు, పో, పురికనినన్ ॥ 501

అనిదర్భాసనమున, దను
వునిచెం, బ్రాయోపవేశమొనరుప, దానిం
గని, రాముడు, గురునింగని
కనుసన్నల, భరతువృత్తి గాన్పించె, వెసన్ 502

గురుడా కనుసన్నంగని
భరతు రహస్యముగ బిలిచి, పలికెనిటులు, స
చ్చరితా ! వినుమొక్కటి మును
జరిగిన కథ దెలిపెద, నది సత్యమ్మె సుమీ ॥ 503

ధరణికి సంభవించిన వెతం దెలుపంజను నల్వాతోడ ని
ర్జరులు, రమా మనోహరుని సన్నిధి విన్న పముం బొనర్ప, నా
హరి, సురలార ! తద్దశ రథాధిపుసూనుడనై జనించి, దు
శ్చరిత దశాన నాదులను జంపెదనంచు, వచించె, వారికిన్ ॥ 504

వినుమా శేషుడె లక్ష్మణుండు, సతిపృధ్వీజాత యాయోగ మా
య, నిజమ్మింతయు రావణాద్య సురసంహారమ్ముగావింపగా
జనుచున్నా, రిట, గేకయాత్మజని దోషమ్మేమియున్, లేశమై
నను, లేదౌటను రాజ్యభారమును బూనన్ రమ్ము, నీవీ పయిన్ ॥ 505

చేయునె ? దుష్కృతమీ, కై
కేయి, భరత ! వినుము దేవకృత్యముదీర్పన్
నీ యగ్రజుండు వెడలుట
నాయనమరలించునాగ్రహము , విడువుమికన్ ॥ 506

కావున ననుజాడు నీవును
రావలెసైన్యమ్ముతో బురమ్మున కింకన్
బావన చరితా ! వేగమె
రావణువధియించి వచ్చు, రామవిభుడనన్ ॥ 507

అనుగురువాక్యముల్ వినిన యంతనె, విస్మితుడౌచు రామ పా
దనిహిత పాదుకల్, కడుముదమ్మున బట్టుక దేవ ! యిమ్ము దీ
ని నివియె, రాజ్యమేలుడు, ననిందిత రీతి, నటంచుబల్కి; నూ
తన మణిపాదరక్షలను, దత్పదయుగ్మము నందు బూనుపన్ ॥ 508

కని రాఘవుడా భరతుని
ఘన భక్తికి మెచ్చి, పాదుకల నొసగగ, వా
నిని, గొంచు, నతడు పురికిం
జనునప్పుడు పలికె, నిట్లు సరసతయెసగన్ ॥ 509

సదయ భవన్ని యోగమున సాగుచునుంటినె గాని, మీరలా
పది పయినాలుగేండ్ల పిదపం బనులన్నియు దీర్చి వెంటనే
మొదటిది నాన, నీదు మొగముం, దయజూపదవేని, నే ద్యజిం
చెద, నసువుల్ రఘూత్తముని సేవకుడాడడు బొంకు లెన్నడున్ ॥ 510

అతని ప్రేమోక్తులకు రాముడనుమతించి
లెమ్ము, తమ్ముడ ! యని మరలింప, మాతృ
గురు, సచివ సోదరులగూడి, భరతుడు, పుర
మునకు బోవగ, నిజ సైన్యములకు దెలిపె ॥ 512

అంతగైకయు, రామునేకాంత మరసి
గళిత దుఃఖాశ్రు నేత్రయై నిలిచి, కేలు
గవ మొగిడ్చి వచించె, రాఘవ ! త్వదీయ
రాజ్య పాలన ఘాతుక రాలనైతి ॥ 513

మాయా మోహితనై రా
మా ! యొనరించితిని దప్పు, మన్నింపు కృపా
శ్రీయుతులు ; క్షమార్పణమున
జేయరా ? మాన్యులుగ , దప్పుజేసిన వారిన్ 514

పరమాత్ముండవు, మాయా
పరుడవు నవ్యక్తుడవు సనాతనుడవు, నీ
స్థిరమాయనె, సకల చరా
చరముల ముగ్ధముగ జేసిచరియింతు, వజా ! 515

నీక ధీనములైనట్టి లోకములును
నీదు ప్రేరణముననె, దుర్నీతి, నీతి
గలిగి కృత్రిమ నర్తకీ గతినటంచు
బహువిధాకృతియౌ మాయ పలుకుబడినె 516

నీవు ప్రేరింపగా, నను దేవతలిటు
పాపకర్మ మొనర్ప లోబరచినారు
సురలకును, నాకగోచరుడ, వాద్యు
నన్నుబ్రోవగదే, జగన్నాధ దేవ ! 517

పుత్ర మిత్రాది గత మోహసూత్రచయము
ఖండన మొనర్పదగు భవద్జ్ఞానమొసగి
నన్ను మన్నింపు, నీకు వందన మొనర్తు
రామచంద్ర ! దయాసాంద్ర ! రఘుకులేంద్ర ! 518

అనుటయు, రాఘవుడనె, నో
జననీ ! మత్ప్రేరణమున, సౌపర్వార్ధ
మ్మును దీర్ప వాణియటు ప
ల్కెను నీ తప్పిందులేదు, లేశమ్మయినన్ ॥ 519

అని మరియునొకటి తెల్పెద
ననుస్మరియించుచునె, మద్గుణముల బొగడి,న
న్గని ధ్యానించిన, దుది
గనెదవు, మోక్షమ్ము, నిజము కైకయి ! తల్లీ ! 520

శత్రు మిత్రులులేరు, సర్వత్ర నేను
సముడనై యుందు గల్ప వృక్షమ్ము భంగి
మించు భక్తిని, నన్ను సేవించు నెవడు ?
తవిలిసేవింతువానిని, తల్లి ! నిజము ॥ 521

నాదు మాయను, ముగ్ధులై నన్ను నొక్క
మానవునిగా దలంతురు మందమతులు
సుఖము దుఃఖముననునవి చొరవునన్ను
ధన్యుడగువాడె, తెలియు మత్తత్వ మంబ ! 522

పూర్వ పుణ్యావశాన నిప్పుడిటులీవు
భవము తలగించుమద్భక్తి పడసినావు
కాన సతతము నను గొల్చి తేని నీవు
కర్మ కృత సర్వ దోషముల్మాంచవమ్మ ! 523

అనెడి రాముని మాటలకామె మిగుల
విస్మయానందములనంది, వివశచిత్ర
యగుచు, వలగొని, వందనమాచరించి
వెడలె, బ్రాప్త మనఃఖేద మెడలనపుడు 524

మాతలు వశిష్టమౌని, సుమంత్రుడాది
గలుగు పరివారమును సైన్యములు ననుజాడు
తోడనరుదేర జనె, భరతుండు పురికి
రామచంద్రుని శ్రీపాద రక్షలగొని ॥ 525

ధన్యుడగు భరతుండ యోధ్య కరుదెంచి
సకలపౌర నచ్చటనె నిలిపి
నిరతమా రామవిభు పాద నీరజముల
మనమునందిడి తద్ధ్యానమగ్నుడగుచు ॥ 526

ఆమహితుడంత నంది
గ్రామమ్మున రామపాద రక్షల, గమనీ
యామల సింహాసనమున
బ్రేమ నునిచి, వాని రామవిభుగ దలచుచున్ ॥ 527

గంధ పుష్పాదులను, భక్తి కలిమి నిడుచు
వెలయు రాజోప చారముల్బలిపి వాని
కర్పలొసగుచు రాజకార్యములెల్ల
నెఱుకపఱచుచు రాజ్యమునేల దొడగె ॥ 528

ఫలమూల రతి, జటావ
ల్కల ధృతి, శ్రీరామపాద కలితమతియు, దా
గలిగి యతడు మెలగుచు, ని
ర్మల హృదయుండగుచు రామరాజ్య మొనర్చెన్ ॥ 529

భరతుడటుల్, రఘూద్వహుని పాదుకలం బ్రభుగా దలంచి, సు
స్థిరమతి, దుష్ట శిక్షణము, శిష్టజనావనముంబొనర్చి, సో
దరులుగ, సత్ప్రజప్బాగని, దాంతియు శాంతియు మీఱ, రాజ్యమా
దరముననేలుచుండె, భరతప్రభుడుత్తముడన్న యెన్నికన్ ॥ 530

భరతుని బోలె బౌరులును, భక్తిగ రాముని సంస్మరించి, సుం
దరతరనీలగాత్రుని, సుధామధురోక్తి ప్రసన్న నేత్రు, సో
దరధరణీ సుతాన్వితుని, దన్ను గనుంగొనవచ్చుచుంట, శాం
తరహితమా స్థలమ్మనుచు, దండక ముంగన రాముడేగుచున్ ॥ 531

చనిచని, రాముడత్రిముని సత్తమునాశ్రమ, సీమ జేరి, చి
ద్ఘన నిజదేహదీప్తి, చయదారిత దుస్తము, నమ్మునీంద్రునిన్
గనుగొని మ్రొక్కి, రాఘవుడ గానకువచ్చితి, దండ్రియాజ్ఞ నా
జని, కడుధన్యమయ్యె, నతిశాంత తపోనిధి నిన్నుగాంచుటన్ ॥ 532

అనివచియించు, రామవిభు నాహరిగా, మదినెంచి, యత్రి, యా
తనికి, సపర్యలిచ్చి, బహుధాకృతవన్య ఫలాశనంబులన్
దనియగ జేసి, రామ ! కడుధన్యతపస్విని, వృద్ధనాధు భా
ర్యనుగన బంపులోనకి, ధరాసుత నాయనసూయ కాంచెడిన్ ॥ 533

అనుముని వాక్యముల్వినుచు నాతడు జానకి లోనికన్పి సీ
తనుగని, యామె కౌగిటను దారిచి దీవనలిచ్చి, జానకీ !
కొనుమివె, యంగరాగము, దుకూల యుగమ్మును గుండలమ్ములున్
వినుము, త్వదీయ దేహరుచి వీడదు వీని ధరించి పొమ్మికన్ ॥ 534

అని యా యనసూయ, మరియు
ననె, నోసతీ ! రాముబతినిరంతరమును దే
వునిగా దలచుచు, నాతని
వెనుకొని వర్తిలుము, సతికి విభుడె ! హరిగదా ! 535

జానకీ ! నీ పతియగు రఘు
సూనుడు, లక్ష్మణుడు నీవు సుఖులగుచు, నయో
ధ్యానిలయము చేరుటకై
యేనిడు దీవెలనలు, గొనుచు, నేగుటటంచున్ ॥ 536

తమివారు, వారి నాహా
రములదనిపి, కేలుమోడ్చి రాఘవ జ
గముల్ పొనరించి వాని బ్రోవగ
గొనెదవు బహురూపముల వికుంఠ నివాసా ! 537

సురమనుజ తిర్యగాదుల
గురుతర రూపముల దేహగుణముల గొని, త
ద్వరమాయకు జిక్కక, త
త్పరమాత్మాకారమున బ్రవర్తిలెదు హరీ ! 538

అయోధ్యకాండ సంపూర్ణం



# నిర్వచన అధ్యాత్మ రామాయణం

## అరణ్యకాండ

దేవీ ! శ్రీ రామాదుల
యావలి చరితమ్ము విను, మహాశయునత్రిన్
సేవించి, రాముడచ్చట,
నావాసరమెల్ల గడపె, నతిభక్తి మెయిన్ ॥ 1

రాతిరివో, శ్రీరాముడు
సీతానుజ సహితుడై విశిష్టగతిని, బ్రా
భాతికముల దీరిచి, సు
స్నాతుండై దండకమ్మునకుఁబయనంబై ॥ 2

మునివర ! దండకమునకుం
జనుమార్గము తెలుప, నీదు ఛాత్రునొకని, మా
వెనుకం బంపుము, పోయెద
మన నాయత్రిముని మందహాసమ్మొదవన్ ॥ 3

రామా ! సర్వమునకు, నీ
వే మార్గము చూపుచుండి, యిటులడిగెదహా !
మేమా ! పథిదర్శకులము ?
సామీ ! యనిపలికి, పనిచె, ఛాత్రగణమ్ములన్ ॥ 4

మునిశిష్యులు రామునితో
జనిచని, మార్గమున దమకు సక్తమయిన వా
హిని, దామెగడపి, తీర
మ్మును జేరిచి, మరలిరపుడె, మునికడకంతన్ ॥ 5

అటులారాఘవు డత్రిదంపతుల భవ్యార్చాదులంగాంచి, యా
దట, దన్మోనివరేణ్యు నాజ్ఞగొని, సీతాలక్ష్మణాన్వితుడై
పటుఖల్లీ భయదారవోదిత ప్రతిధ్వానా వృతమ్మద్భుతో
త్కట తామిస్రత మాలనీలరుచి హింతాల ద్రుమాక్రాంతమున్ ॥ 6

హరిగర్జనత్రస్తగిరి చరత్కరిపాద చూర్ణీకృతాఖిలక్షుద్రమృగము
దీపికాదీప్త దృగ్దృప్తమత్త వ్యాఘ్ర సూకర భల్లూక భీకరమ్ము
ఘోరదంష్ట్రా కృతి క్రూరమహానాద సంచర ద్రాక్షస సంకులమ్ము
పాషాణ కంటక ప్రాయ దుర్గమ మార్గ ధావన్మృగమృగీ సమా వృత్తమ్ము
భయదరూపారవోపేత పక్షిగణము,
తిమిర రాత్రీకృతాఖిల దివసమైన
దండకమ్మున నతండు భీరుండువోలె
జనుచు దమ్మునితో నిట్టులనియె, పేర్మి 7

తమ్ముడ ! చూచితే భయదదండక, మిత్తరి, నీవు వెన్క వి
ల్లమ్ముల బూనిరమ్ము, విలునమ్ముల బూని, గమింతు నేను ధై
ర్యమ్మున ముందు, నాత్మపరమాత్మ సదంతరవర్తి మాయ రీ
తిమ్మన మధ్యమందు జనుదెంచును జానకి యిట్లు పోవలెన్ ॥ 8

మును వింటిమి దండకవని
దనుజక్రూర మృగభయనిదానమని యటుల్
గనినార మనుచు జాన
క్యనుజులతో సార్ధ యోజనాధ్వము గడవన్ ॥ 9

వారికి నొక్కచో గనుల పండువుగా, గనవచ్చె, బద్మ క
ల్హార సితోత్పలాది సుమహారి సుశీతల వారి పూర్ణ కా
సార మొకండు, దానగల సత్సలిలమ్ముల గ్రోలి ! పూత త
త్తీరమునందు, గొంత శ్రమతీరగ, నీడల నిల్చి పిమ్మటన్ ॥ 10

గర్వ్య దంష్ట్రాకరాళ వక్త్రమ్మువాని
భుగ్న భీకర దర్శన భ్రుకుటివాని
మనుజ మేదోరుధిర దిగ్ధ తనువువాని
ధృత నిశిత శూల నిహిత మాంస తతివాని 11

నిఖిలజన నింద్య దుష్క్రియానిరవరోధు,
గృత సుజన బాధు బాంధ దర్శిత నిరోధు
సహజ సుగుణ విరోధు, దుస్సహ విరాధు
రామచంద్రుడు కనియె దుర్దనుజ నాధు. 12

కని, తమ్ముడ, పిడతి దు
ర్దనుజుడనుచు భీతివడక, ధైర్యమ్మున, ఖ
డ్గ నిశిత సాయకముల జే
కొను సీతకు, వీడు భయముగొలుపకయుండున్ ॥ 13

అనివచియించి, తానును శరాసన సాయకముల్ ధరించి ని
ల్చినగని, యట్టహాసమును జేయుచు దద్దనుజుండు మీర లి
వ్వని, కిటురాగతమ్మెదియొ ? వల్కలముల్, జడలున్ ధరించి యున్
ధనువుల, సాయకమ్ములను, దాల్చితి రెవ్వరా ? వేగ తెల్పుడీ ॥ 14

ముని వేషధరులు, బాలురు
వనితామణితోడ నేలవచ్చితిరిటు, చ
క్కని మీ మేనులు, నాదు వ
దనమునకొక కబళమగుట తథ్యముసుండీ ॥ 15

అన రాముడు నవ్వుచునవె
ననుజూడితడు లక్ష్మణాఖ్యు డదినాసతి, మా
జనకుననుజ్ఞను వనికిం
జనుదెంచితి మిచట రాత్రి చరుల వధింపన్ ॥ 16

అనుటయు వాడు వెండియును హాసమొనర్చుచు వ్యాత్త వక్త్రుడై
ఘన నిజశూలమున్, భుజయుగమ్మున ద్రిప్పుచు, విశ్రుతుండ న
న్ను నెఱుగవా ? విరాధుడ, మునుల్ ననుగన్గొని భీతులౌచు, ని
వ్వనమున, సంచరింపరు, నివాసము, సేయ రెఱుంగు, మింతయున్ ॥ 17

మీకు జీవితేచ్ఛ మిగిలినచో నీమె
విడిచి యాయుధముల విడిచి పొండు
ఇటులు చేయరేని నిరువుర మిము దిని
సుందరాంగి, నీమె జెందువాడ ॥ 18

అని విరాధుండు, జానకి గొన బరులిడ,
గాంచి రాఘవుడొక సాయకమున వాని
బాహుయుగ్మము దునుమగ వాడు మరియు
నోరు తెఱచుచు రాముని జేర నరుగ 19

పరులిడుచు నెచ్చెడి విరాధు పాదయుగము
దునిమె రాఘవుడది మహోద్భుతమొనర్చె
బాముపలె నోరు తెఱచుచు బ్రాకిరాగ
రాముడొక శరమున దచ్చిరమ్ము దునుమ ॥ 20

అనాతురుధిరార్ద్రదేహుడై పడియె బుడమి
సీత రాముని గౌగిట జేర్చి పొగడె
దేవదుందుభి నాదముల్ దెసలబ్రాకె
నచ్చరలు, గిన్నరులు పాడి మెచ్చిరపుడు. 21

అంబర గామియౌ నతనియందు గనంబడె, దేజమొందు ది
వ్యాంబరముం, బ్రతప్త కనకాంచితరత్నవిభూషణ ప్రభా
డంబర, మంత నొక్కడు విలాసగతిం జనుదెంచి సత్ప్రణా
మంబులొనర్చి రామవిభుమాన్య పదద్వయి జేరి యిట్లనెన్ ॥ 22

**అనఘా ! భక్తారి హరా !**
**వినత భవ మహోబ్ధి తరణ ! విశ్రుత కరుణా !**
**ప్రణతులొనర్చెద నీకున్**
**ననుగరుణం గనుము దనుజనాశకర ! హరీ !** 23

నీ పటుకృప మద్దుర్భర
శాపమడగి, నాదు పూర్వజన్మము గంటిన్
నీ పదముల నా చిత్తము
బ్రాపింపగ జేసినన్ను రక్షింపగదే ॥ 24

అనయము నాదు నాల్కను, మహత్తర తావక నామ మంత్ర కీ
ర్తనము, శ్రుతిద్వయిన్విమల తావక సచ్చరితమ్ము మచ్చిర
రమ్మును భవదీయ పాదనతి, ముఖ్యముగా నొనరింపు మయ్య ! వం
దనమొనరింతునీకు, సతతమ్ము, భవాబ్ధి దరింప జేయుమీ ॥ 25

రామా ! ఆత్మారామా !
సామీ ! జ్ఞాన స్వరూప శరణమొసగు, నా
ధామమున కేగెదను కరు
ణామయ నాకానతిచ్చి నను బనుపు మికన్ ॥ 26

విద్యాధరుడను, బూర్వ మ
విద్యా వృతి, శాపమొంది వికృతాకృతినై
సద్యః ప్రాప్తా సురతన్
మద్యశముం బాపికొంటి మన్నింపగదే ॥ 27

శ్రీయుత ! రఘునందన ! నీ
మాయదలగ జేసి నన్ను మన్నించి, సదా
శ్రేయ మొదవ నిను దెలియగ
జేయుము, భక్తుడను నాకు సెలవీయగదే ॥ 28

అను నా విరాధునిం గృప
గని రాముడు నిన్ను మాయగదియదు మద్ద
ర్శనమున ముక్తుడ వగుదువు
చనుమికనని వానితో బ్రసన్నత బలికెన్ ॥ 29

ఆ రీతి, విరాధుడు ర
క్షోరూపము విడిచి మరల సురలోకమ్మున్
జేరనరిగి, ముక్తింగనె
శ్రీరామునిగొల్చునతడు సిద్ధిగనడొకో ॥ 30

ఒకటవ సర్గ సంపూర్ణం



## 2వ సర్గ

తరుణీ ! విరాధుడటు, సుం
దర రూపముగాంచి చనగ ధరణిసుతయు, సో
దరుడును రాగా రాముడు
శరభంగాశ్రమము జేరె, సౌఖ్యావహమున్ ॥ 31

చనుదెంచిన సీతా ల
క్ష్మణసహితున్ రాముగాంచి, శరభంగు డెదు
ర్కొని పూజలొసగి యుచితా
సనములిడి, ఫలాదులను వెసం దనియించెన్ ॥ 32

శరభంగుండటు రామ చంద్రునకు బూజల్ సల్పి యో రామ నే
జిరమిచ్చో దపముంబొనర్చుచు భవత్సేవార్థినై యుండి, నీ
చరణాంభోజ యుగంబుగాంచుట దపస్సాఫల్య మేగంటి దు
ష్కర మత్పుణ్య ఫలంబు నీకొసగి నే జాలింతు నీ దేహమున్ ॥ 33

క్షితి సుతనిజ వామాంక
స్థితగా విద్యులతాలసిత వారిద మ
ట్ల తనరు రామాఖ్య మహ
స్తతి నాహృదయమ్మునన్ సతమ్ము నిలుచుతన్ ॥ 34

అని చితి పేర్చి యాతడు నిజాంగము నందమరించి, రామ చం
ద్రుని బరమాత్మగా దలచి స్తోత్రపరుండయి తత్పదాబ్జ చిం
తనమొనరింపబూని రఘునందను సర్వ హృదంతరస్థునిన్
ఘననిభదేహు జీరవసన ప్రియు స్నిగ్ధ జటాకలాపునిన్ ॥ 35

జనక సుతానుజాన్వితుని సంశ్రిత కల్పకు గొల్తు రాము బో
లిన ఘనదైవ మీ జగతిలేడిక నన్నుతడాత్మ భక్తుగా
గనుత మదీయ పుణ్యమునగాంచితి నిట్లవసానమందు నా
తనువు దహించి నే జనియెద బరమేష్ఠి పదమ్ము నందగన్ ॥ 36

అతడటులంచు రాఘవు సమక్షమునం దన పాంచ భౌతిక
మ్ము తనువు వహ్ని సాత్కృతిగ మోదముతో నొనరించి భారతీ
పతి సదనమ్ముజేరె బిదపన్మని బృందము వేడ్క జానకీ
పతి, దరిసింప మౌని శరభంగుని యాశ్రమ సీమ జేరగన్ ॥ 37

ఆ మౌనుల గన్గొని, శ్రీ
రాముడు లక్ష్మణుడు, తద్ధరాపుత్రియు భ
క్త్యా మోదమ్ములు మీర బ్ర
ణామములొనరించి, రతివినయ మెనయంగన్ ॥ 38

మునులాసీతకు, రామున
కనుజున, కాశీస్సులొసగి యభినందనముల్
పొనరిచి, రాముని బరమా
త్మునిగా తలపోసి సన్నుతుల్ చేసిరిటుల్ ॥ 39

పరమాత్మా ! మునుధారుణీభర మడంప న్నల్వతో వేల్పు లా
తురులై నీదరిజేరి వేడుటయు సంతోషమ్మునన్ నీవు, భా
స్కరవంశమ్మున రామనామమున సంజాతుండవై నాడ, వి
ద్ధర నీతత్త్వమెఱుంగమో ? రఘువరా ! ధాత్రీసుతా వల్లభా ॥ 40

హరి నీవు లక్ష్మిజానకి
వరచరితుడు లక్ష్మణుండు ఫణిపతియగు ద
ద్ధర చక్రమ్ము లరయ ద
ద్భరతుడు శత్రుఘ్నుడనగ ధరబొడమిరిగా ॥ 41

అరయగ నీదుపుట్టువు మహర్షుల బ్రోచువారి దుఃఖముల్
తరలగ జేయగాదొ ? యిక, దత్ఫలముల్, వృథసేయ కీవు సా
దరముగ మావసించిన పదమ్ములకుం జనుదెమ్ము మేమిదే
యరుగుచు నున్నవార మను నమ్మునులం గడు భక్తి గాంచుచున్ ॥ 42

వారి వెనుకజని చని సీ
తారాములు లక్ష్మణుడు ముదమ్మున శాంతా
గారముల దపోవనముల
నారసి యొకచోట బడిన యస్థులగనుచున్ ॥ 43

మునులారా ! యీ్రతోవను
గనవచ్చె గపాల చయము కతమెద్ది యనన్
వినుమిది మునిమూర్ధమ్ములు
దనుజ హతములై యరణ్య తలమున బడియెన్ ॥ 44

దానవు లీవనమునగల
మౌని వరుల తపములను సమాధుల జెరుపం
బూని చరింతురు మా కీ
కాననముల దిరుగ భయము గదిరెడు రామా ! 45

అని భయ దైన్యమ్ములతో
వినిపించిన మునుల మాటవిని రాఘవుడి
ట్లొనరించె బ్రతిన రాక్షసు
లను జంపి యొనర్తు మౌనులకు సేమమ్మున్ ॥ 46

రాముడటువల్కి వారి యాశ్రమములందు
గొలది వర్షములుండి యావల క్రమమున
మునివనమ్ముల గనుచు దాజనె, సుతీక్ష్ణు
నాశ్రమముగన, మౌని సమన్వితమ్ము ॥ 47

అతుల సర్వర్తు గుణయుతమైన దాని
నఖిల కాల సుఖావహమైన దాని
ఖ్యాతమౌనీంద్ర సంకులమైన దాని
రామచంద్రుడు గాంచి, హర్షమున మించె ॥ 48

రెండవ సర్గ సంపూర్ణం



## 3వ సర్గ

మౌని సుతీక్ష్ణుడు సీతా
జాని నిజాశ్రమము జేర జనుదెంచుట శి
ష్యానీకముచే విని మో
దాన నతని దోడి తేర దత్పరమతియై ॥ 49

చని యతనికి విధి వత్పూ
జనములనర్పించి భక్తి సంతోషమ్ముల్
పెనగొన బాష్పాకుల లో
చనుడై తద్రామ మంత్ర జపపరుడగుచున్ ॥ 50

ఓ రఘురామ ! తావకమహోత్తర మంత్రజపమ్ము ఘోర సం
సార సముద్ర తారకము సారస భూప్రముఖామరార్చితో
దార పదాంబుజాత ! సతతమ్ము ననున్ భవదీయ దాసుగా
నారసి నీదుమాయ నను నంటని యట్టులొనర్పుమో ప్రభూ ॥ 51

నీ మహిమం బగోచరము నీదగు మాయను దారపుత్రవాం
ఛామిత వార్ధిమగ్నులగు నాశ్రిత కోటికి దారకుండవై
యోముదు, యోగి చిత్తములనుండెదు నిన్భజియింపనట్టి దు
ష్కాముల, నీదు మాయకు వశమ్ముగ జేయుదు వార్త రక్షకా ! ॥ 52

భూనేత భృత్యులను సే
వాను గుణమ్ముగనె ప్రోచునటులు వరభవ
ద్ధ్యానపరుల బ్రోచెద వ
జ్ఞానుల మాయాబ్ధి ద్రోయగడగెదవు హరీ ॥ 53

త్రిగుణాత్మిక మాయంగొని
జగముల సృజియింప బెంప సమయింపగ నీ
వగుదువు విధి హరి శర్వుల
నగదోచెద వజ్ఞులగు జనమ్ముల కనఘా ॥ 54

భిన్న జలపాత్రలందు వి
భిన్నాకారముల సూర్యబింబములటు నీ
వెన్నేని రూపముల గొనె
దన్నా ! నీ మాయ తెలియనగునే ? యనుచున్ ॥ 55

మరియు నగస్త్య శిష్యుడగు మౌని సుతీక్ష్ణుడు పల్కె నో మహా
త్మ ! రఘువరేణ్యా ! పావన తమమ్మగు తావక నామమంత్రమున్
నిరతము నే జపించుటను నిన్ను గనుగొనగల్గినాడ బా
మరులకు నీదునామమహిమం, గననేరని వారి కబ్బునే ? 56

కందర్ప శతకోటి సుందరాకృతి ధృత శరశరాసన బాహుసరమువాని
నీలోత్పల శ్యామ నిరవద్య రుచి నిదానమ్మగు రుచిర దేహమ్మువాని
కరుణా మయావలోకన మనోహర మందహాస విరాజ దాస్యమ్ము వాని
నాకృతి రహితుడవయ్యు మాయా కృత మానవ వేషమ్ము బూనువాని
జానకీ లక్ష్మణార్చిత చరణువాని
నాద్యు జిద్రూపు దేశకాలాద్యుపాధి
వర్జితు ననంతగుణు మౌనివంద్యమాన
చరితు, నిను గొల్చెదను రామచంద్ర మూర్తి ॥ 57

సీతావల్లభ ! మాయా
తీతుడవై పామరాళి దృగ గోచరతన్
గాతువు, త్వద్భక్తజన
వ్రాతము నా హృదయమందు వసియింపు హరీ ॥ 58

నాకిపుడు చూపిన భవ
ద్రూపమునే గాంచగోరుదును నిరతము జి
ద్రూప ! మహాత్మా ! నేడిటు
నాపుణ్యమే నీదు దర్శనంబిచ్చె హరీ ! 59

అని నుతియించు మౌని వరునారసి రాముడు సస్మితాస్యుడై
మునివర ! నేడు నీహృదయముం గనుగొంటిని నిర్మలమ్ము మ
న్మనుజపమూని యిట్టి మహిమం గననైతివి గాన నిన్ను గ
న్గొన నిటువచ్చినాడ మునికుంజర ! నీమది కోర్కి తీర్పగన్ ॥ 60

మామక జపపరులై ని
ష్కామత ననుగొల్చువారి సరసకు నేనే
ప్రేమం జనుచుండెద నిది
నామదిగల నిశ్చయమ్ము నమ్ము మునివరా ! 61

సతము మదుపాసనమున ముక్తతనుగాంచి
నీవు దేహాంతమున, శుద్ధభావుడవయి
నాదుసాయుజ్యమును మునినాథ కనెద
వనఘ ! నీకన్న బ్రియుడు నాకన్యుడెవడు ? 62

నీ విపుడొనరించిన యి
ప్పావనమౌ స్తోత్ర మెవడు భక్తి జదివి, మ
త్సేవకుడగునో ? వానికి
దావగు మత్పదము వాడె ధన్యతముడిలన్ ॥ 63

మునివర ! నీ గురుండు ముని పుంగవుడైన యగస్త్యు నారయన్
జని మహనీయుడాతని వచస్సుధచే దనివొంది యచ్చటన్
దినములు కొన్ని నెమ్మిగ గతించిన పిమ్మట బోవువాడ, నా
కనుమతి నిమ్మటంచు వినయమ్మున మూవురు లేచి, నిల్వగన్ ॥ 64

మునివరుడిట్లనెన్ నృపతి పుంగవ ! రాఘవ ! నేడు నీవు పో
జనదు మహాత్ముడైన ఘట సంభవునారసి పెక్కునాళు ల
య్యె నగుట నేను సైతమిపుడే చనుదెంతున టన్న నల్వురుం
జనిరి యగస్త్య సోదరుని సద్మము మున్నుగ నాటి వేకువన్ ॥ 65

ఆ నలువురట్లు ఘట జ
న్మానుజు మందిరము చేరి యా మఱునాడా
మౌనిడగస్త్య మండల
కాననముం జేరి రతుల కౌతుక మొదవన్ ॥ 66

సకలర్తు చిహ్న పుష్ప ఫలాద్య గారమై నానామృగ గణాఢ్యమైన దాని
బహువిధ సుందర పక్షిమనోహర ధ్వాన నందన తుల్యమైన దాని
పావన బ్రహ్మర్షి దేవర్షి సేవితానూ నాలయ వ్యాప్తమైన దాని
ప్రత్యక్ష సారస భవలోక నిభఘట సంభవాశ్రమ శుభస్థలముగాంచి

వెలుపలనె నిల్చి శ్రీరామ విభుడు వల్కె
నోమునివరేణ్య ! యిచ్చట మేము నిలుతు
మీవు మారాక చక్కటినెఱుగజేయ
మున్నుగ నగస్త్యు గనుగొనబొమ్ము వేగ ॥ 67

అనుడు మహాప్రసాదమని యాతడు శిష్యయుతమ్ము రామ భ
క్త నివహ సేవితమ్ము నిరత ప్రతిపాదిత రామ మంత్ర పా
వన విపులార్ధమున్, గురు నివాసము చేరి తదీయ పాద వం
దన మొనరించి తెల్పెనిటు తద్రఘు నాధుని రాక మున్నుగన్ ॥ 68

మునివర ! మిము దర్శింపగ
ననుజాడు దారయగు సీతయు రా
జనుదెంచి రాముడాశ్రమ
వని చేరువనున్నవాడు ప్రాంజలి యగుచున్ ॥ 69

అనవిని యగస్త్యు డిట్లనె
మునివర ! తోడ్తెమ్ము వేగముగ వారల రా
ముని నే దలంతు సతత
మ్మని మునులంగూడి వెడలె నతిభక్తి మెయిన్ ॥ 70

చని రామభద్ర ! సేమమె ?
చనుదెంచితె ? యీ దినమ్ము సఫల మతిథివై
ననుధన్యు జేసితివి ర
మ్మని పలుకగ నాలకించి హర్షమెలర్పన్ ॥ 71

వినయ మెనయ రాఘవు డ
మ్ముని వరునకు మ్రొక్కుటయు బ్రమోదమ్మున న
మ్ముని రామచంద్రునాలిం
గన మొనరిచి హర్ష బాష్ప కలితాంబకుడై ॥ 72

వినతిగ నొక కేలను రా
మునిగొని స్వాశ్రమము జేర్చిముదితుడగుచు బూ
జనమొనరిచి ఫలమూలా
శనముల, మూవురనొనర్చె సంతృప్తులుగన్ ॥ 73

అంతటరామ చంద్రుని సుఖాసన నిష్ఠుగ జేసి భక్తి నే
కాంతమునందు సన్నిధిని బ్రాంజలియై రఘునాధ ! నిన్నె నా
స్వాంతమునందు నిల్పి భవదాగ మనమ్ము మదిం దలంచుచున్
సంత్రతమున్ ద్వదీయ ముఖచంద్రుని గాంచుచునుంటి రాఘవా ! 74

క్షీర సముద్ర తీరమును జేరి సరోజ భవాదు లెల్ల భూ
భార మడంప, దుర్జనుజ పంక్తి గళున్ వధియింప వేడగా
ధారుణి నీవు మానవత దాల్చి జనించెదవంచు నెంచి యీ
తీరున నుంటి నిందు భవదీయ మహత్తర దర్శనార్ది నై ॥ 75

దేవా ! సృష్టికి బూర్వము
నీవొకడవె నిర్వికల్ప నిరుపాధిక త
త్కేవలత నుండుటను సం
భావించెద రామ దుర్విభావ్యదశ నహో ! 76

## గీతమాలిక

అరయ నీ మాయయే భవదాశ్రయయు భ
వద్విషయౌచు శక్తి నాబ్రధితమయ్యె
యుపనిషద్వేత్తలు వచించుచుంద్రు మూల
ప్రకృతియు నవిద్య మాయ నా బంధమనగ
సంసృతియనంగ బహువిధ సంజ్ఞలొదవ
బలుకుచుందురు కొందరు ప్రాజ్ఞతములు
మాయ నీ చేత సంక్షోభ్యమాణ యగుచు
గనె మహత్తత్త్వమును దానగలిగె నీదు
ప్రేరణమ్మున మహదహంకారమొకటి
యది మహత్తత్త్వ సంవృతినంది వెలసె
సాత్వికము, రాజసము, తామసమ్మనదగి

తామసము నుండి పంచతన్మాత్రలొదవె
పిదప దత్పంచ భూతముల్ వెలసి, స్థూల
ములు క్రమోత్తర గుణములై వెలసె నంత
రాజ సమ్మైన విషయవర్గమ్ము సాత్వి
కమ్ములగు దేవతలును మనమ్ము గలిగె
వాని యందెల్ల సూత్రరూపమున సర్వ
గతము లింగమయి మహదాఖ్యము వెలింగె
నవల దత్స్థూల భూత సంభవత గల్గె
నా విరాట్పూరుషుం డమ్మహాత్మునుండి
జంగమ స్థావరాత్మక జగమఖిలము
కాలకర్మాను సారముగా గ్రమమున
దేవతిర్యఙ్మ నుష్యాది జీవకోటి
వెలసె నీవ రజోగుణ విలసనమున
స్రష్టవై సర్వలోక కారణమవగుదు
సత్త్వ విలసనమున విష్ణు సంజ్ఞ బూని
పాలకుడ వౌదనుచు బండితాళి దెలుపు
నీవ రుద్రాహ్వయమున సంహృతి యొనర్తు
వాది మాయా గుణౌఘ ప్రభేద హేతు
కములు నౌ బుద్ధిజాత గుణముల బొడమె
మూడు వృత్తులు వాని దెల్పెదును వినుము ॥ 77

క్రమముగ జాగరణము స్వ
ప్నము నొదవె సుషుప్తియను నవస్థలు తద్భి
న్నములై చిన్మయమగు రూ
పమునన్ సాక్షివయి వాని బరికింతు వజా ! 78

ఎపుడు ? నీవొ రఘూద్వహో యెలమిగలిగి
సృష్టిలీల నొనర్ప నూహించు చుందు
నపుడు సగుణునివలె మాయనధిగమించి
జగము వెలయించి సాక్షివై నెగడు చుందు ॥ 79

విద్య యనగ నవిద్యనా వెలయు నీదు
మాయ ద్వివిధముగ బ్రవృత్తి మార్గ నిరతు
లా యవిద్య నివృత్తి మార్గాను గతులు
విద్యను గ్రహింత్రు వేదాంత వేత్తలగుచు ॥ 81

రామ ! నీ భక్తులెల్ల విద్యామయులని
తెలుపబడుదు రవిద్యావశులు సతమ్ము
మహిభవాంబుధి మజ్జనోన్మ జ్జనముల
బడలి బహుదుఃఖముల యనుభవము గంద్రు ॥ 81

సతత విద్యాభిరతులె ముక్తత వహింత్రు
భవదమల భక్తి, త్వన్మనూ పాసకతయు
వెలయువారికె తద్విద్య గలుగుగాని
యితరులకు దుర్ల భమ్మగు నింతనిజము ॥ 82

కావున ద్వత్పాదాంబుజ
సేవా పరుడైన యతడె చెందును ముక్తిన్
దేవా ! తదన్యు నకు స్వ
ప్నావస్థను గూడ ముక్తి యలవడదు సుమీ ॥ 83

## గీతమాలిక

రామ ! వేయేల వినుము సారము వచింతు
సాధు సంసర్గమే ముక్తి సాధనమ్ము
అఖిల భూతసముల్ విగతైషణులును
దాంతులును నిస్పృహులును ప్రశాంత మతులు
రామ ! నీ భక్తులు నివృత్త కామనులును
దుల్య సుఖదుఃఖులును సంగదూర గతులు
ద్యక్త కర్మలు బ్రహ్మతత్పరులు శమ ద
మాది సద్గుణ సంపన్నులైనవార
లల్ప సంతుష్ట లును, సాధులన దగుదురు
వారి సంసర్గ మే ముక్తి ధర్మ మనఘ !
యెపుడు సజ్జన సాంగత్యమెనయనగునొ ?
యపుడె గల్గును ద్వచ్చరితాభిలాష
మంత జనియించు ద్వత్పాద చింతనమ్ము
నట్టి సద్భక్తి యొదవిన యపుడె గలుగు
విప్రల నిర్మల విజ్ఞాన విభవ మెల్ల
రామ ! తొలుతటి ముక్తి మార్గమిదె సుమ్ము !! 84

కావున రామా ! తావక
సేవా తత్పరత ప్రేమ చిహ్నమగును, త్వ
త్సేవక జన సంసర్గమె
గావింపు మనారతమ్ము గలుగ మహాత్మా ! 85

తావక సందర్శనమున
బావనమై నాదు సంభవము ఫలమందెన్
నా వివిధ క్రతువులును ఫ
లావహ దశగాంచె నేడహో ! మహనీయా ! 86

అనఘా ! నే దపమాచరించితి ననన్యాత్మ్ముండనై పెక్కు నా
ళ్ళ నివార్యమ్ముగ తత్ఫలమ్ము భవదీయాంఘ్రిద్వయార్చా కృతిన్
గననయ్యెన్ ధరణీ సుతాన్వితుడవై కారుణ్య మేపార నా
మనమందీవు నిరంతరమ్ము నిలువం బ్రార్థింతు రామప్రభూ ! 87

పరమేశ నడుచునప్పుడు
దిరముగ నున్నపుడు నీస్మృతిన్మరువక నే
నిరతమొనర్చు నటులు న
న్గరుణింపు మటంచు భక్తి కలితుండగుచున్ ॥ 88

సన్నుతాలాచరించి, ఘట సంభవమౌని వచించె నిట్టు లో
యన్న ! రమాధినాథ ! భవదర్థము మున్ను శచీధవుండు నా
సన్నిధి నుంచె విల్లు శిత సాయక తూణయుగమ్ము ఖడ్గమున్
గ్రన్నన వీని బూని దశకంఠ ముఖాసురులన్ వధింపుమీ ॥ 89

ఓ రాఘవ ! నీవీ భూ
భారమడంగింప దనుజవర్గము ద్రుంపన్
ధారిణి బొడమితి వయ్యమ
రారాధిత పదుడవై మహర్షుల బ్రోవన్ ॥ 90

వినుతగుణాఢ్య ! యొక్కమనవిన్వినుమీ ! యటవీస్థలాన యో
జనయుగమందు గల్గె విలస త్తరు మండిత రమ్య పుణ్య కా
ననమట నొప్పు బంచవటి నాబడు నాశ్రమ సీమ గౌతమీ
ఘనతటమందు నీ జరపు కార్యములందె వసించి చేయుమీ ॥ 91

అనుతత్త్వార్థ సమన్విత
మును మధురము నైన మౌని పుణ్యవచనముల్
విని రాముడు ముదితుండై
చనె సీతాలక్ష్మణులు దెసం జనుదేరన్ ॥ 92

౩వ సర్గ సంపూర్ణం



## 4వ సర్గ

గౌరీ ! విను మాపయి సీ
తారాములు పంచవటి పథమ్మున జనుచో
భూరిగిరి శృంగతుల్యా
కారుండు జటాయుషుండు కానంబడియెన్ ॥ 93

వానిని గాంచి విస్మయము వర్ధిల రాముడు పల్కె దమ్ముడా
యీనర మౌని భక్షకు నహీనతరాంగుని జూడు మిప్పుడే
వీని వధింతు నన్న రఘువీరునిగాంచి జటాయుషుండు తా
మౌనముమాని రామ వినుమా ! యనుమానము మాని నానుడిన్ ॥ 94

ఏదనుజుండగాను భవదిష్టుడ ద్వత్పిత్రు మిత్రుడన్ ద్వదా
మోదకరుండనౌట రఘుపుంగవ వధ్యుడగా దలంపగా
రాదు ననున్ బతత్రికూల రాజజటాయువుగా నెఱింగి నా
పై దయచూపగావలయు బంచవటిన్వసియింతు నెప్పుడున్ ॥ 95

ఓ రామ ! నీవొకపుడు మృగ
యారతి లక్ష్మణుని గూడి యరిగిన వేళన్
నీ రమణి రక్షణమ్మె
నారయుచు జరింతు సందియము లేదనఘా ! 96

రాముడు తద్వచనము విని
ప్రేమమ్మున గాంచి పక్షివిభుసత్తమ నా
కామోదంబె మదాశ్రమ
భూమి సమీపమున నిలువుము దయార్ద్రమతిన్ ॥ 97

అని నియోగించి తచ్ఛకుంతాధినేత
సమ్మతింప దదాలింగన మ్మొనర్చి
జానకియుదాను లక్ష్మణుతోనచనియె
బంచవటి జేర జానకీ వల్లభుండు ॥ 98

చనివారు గౌతమీ తట
మున బంచవటీ ప్రదేశమున ధీనిధి ల
క్ష్మణుడు ఘటించిన యుట జ
మ్మున నివసించిరి గిరీశ పుత్రి ! సుఖముగన్ ॥ 99

సురవాహినీ పవిత్రో
త్తర తటగత పనస సత్కదంబామ్రమనో
హరమై వివిక్తమై జన
విరహితమగు నచట రామ విభుడు ముదమునన్ ॥ 100

లక్ష్మణుడు ఫలకంద మూలములొసగుచు
శరశరాసన ధరుడయి జాగరుకు
డగుచువర్తిల సీతకు మిగుల మోద
మిడుచు రాముడు కాలము గడపుచుండి ॥ 101

వారను దినమ్ము గౌతమీ సారవారి
పూరమున స్నానములొనర్ప బోవునపుడు
వారినడుమను జానకి చేరి భీతి
దొలగి నిలిచి గతాగతములనొనర్చు ॥ 102

మరియు సౌమిత్రి మధుర నిర్మల జలమ్ము
గమ్ర ఫలమూలముల నోర్మి గలుగ దెచ్చి
యొసగుచు సతమ్ము ప్రీత మానసుడయి తగు
సేవలొనరింప నుండిరి మూవురచట. 103

ఆకరణి వారినచ్చో
లౌకిక కర్మజ సుఖమ్ములం దనుపుచు దా
నేకాంతము నారసి సీ
తాకాంతుని జేరి పలికె దమ్ముడు నెమ్మిన్ ॥ 104

పరమేశ్వర ! రాఘవ ! సు
స్థిర సౌఖ్యదముక్తి కరగతిం దెలియ
దయాకర ! సంక్షేపముగా నా
కెఱిగింపగదయ్య ! తగుదువీవ మహాత్మా ! 105

ఓ కమల నేత్ర ! నాకు జ్ఞానోదయమ్ము
గలుగ భక్తి విరక్తి సంకలితముక్తి
పథము దెలుపగ నిను బోలు వక్తయెవడు
లేడని తలంచియిటుకోరినాడ ! దేవ ! 106

అనవిని రాఘవుండు దయ నారసి తమ్మున కిట్లు పల్కెనో
యనుజ ! వచింతు నీ కతిరహస్య పథమ్మిది జ్ఞేయమైన దీ
ని నెఱిగినంతనే తొలగు నింద్య వికల్పజ మౌ భ్రమమ్ము మా
యను దదనంతరమ్ము దెలియన్ వినిపింతు నెఱుంగు లక్ష్మణా ! 107

ఆపయిని జ్ఞాన సాధన
మాపై విజ్ఞాన సహితమగు జ్ఞానముచే
నా పరమాత్మ దెలియుగతి
జూపెద నద్దాని దెలిసి సోకవు భీతిన్ ॥ 108

అస్థిరమ్ము ననాత్మమైనట్టి దేహ
మందు శాశ్వత సత్పరమాత్మ బుద్ధి
యే యగునుమాయ దాన సంసృతి ఘటిల్లు
దీని నెఱిగిన గనెదు ముక్తి ననుజన్మ ! 109

## గీతమాలిక

కొలుత మాయకు రెండు శక్తులు ఘటిల్లె
ఒరయ విక్షేపశక్తి యావరణ శక్తి
యందు మొదటిది స్థూల సూక్ష్మాది భేద
ములు వహించి జగమ్ముల గలుగజేయు
రెండవది జ్ఞానమై యావరించు, జగము
మాయ కల్పించు జగము నిర్మాయికమగు
వ లాత్మమునందు సంభావితమగు
జ్జువందు భుజంగ విభ్రాంతియట్లు
జ్ఞానదృష్టి విచారింప గలుగదెదియు

శ్రవణ సంస్కృతి దర్శనార్హమగు సకల
వస్తుజాత మసత్య మవాస్తవమగు
స్వప్న గతము మనోరథజాతమైన
వస్తు సంతతి యట్టు లభావమందు
దనువె భవతరు ధృడ మూలతను వహించు
నదియె కతముగ బుత్రదారాదిబంధ
మగుటనే వారి కాత్మకు నమరె మైత్రి
పంచభూతములును మాత్ర పంచకమ్మ
హంకృతియు బుద్ధియును నింద్రియములు పదియు
మొగి జిదాభాసము మనమ్ము మూల ప్రకృతి
తనువనంబడు నదియె క్షేత్రమన నొప్పు
దీనికి విలక్షణుండయి వెలయు జీవు
డాతడె నిరామయుడు పరమాత్మమగును
జీవ పరమాత్మలకు భేద చింత గూడ
దట్టి జీవుని గనజేయునట్టి సాధ
నముల వినిపింతు నో లక్ష్మణా ! వినుమిక
మానశూన్యత దంభహింసాది వర్జ
నమ్ము పరనిందలకు సహనమ్ము నెల్ల
వారియెడ సర్వదా ఋజు భావము మరి
వాఙ్మనస్తనువుల గురూపాసనమ్ము
సొరిది బాహ్యాంతరముల సంశుద్ధి సతత
సత్క్రియా చరణముల సుస్థైర్య వృత్తి
వాఙ్మనః కాయ శిక్షణ పరత విషయ
నిస్పృహత నిరహంకార నిర్మలమతి
జననవార్ధక మృత్యు విచార గరిమ
దార పుత్ర ధనాది నిస్సార బుద్ధి
యిష్ట తదితరముల సమదృష్టినియతి
అఖిభూతమయుండనై యలరునన్నె
త్యక్త సకలాన్య విషయుడై తలచుచుంట
పావన వివిక్త దేశ నిషేవణమ్ము

ప్రాకృత జనౌఘ సంగ విరక్తియుక్తి
ఆత్మ చింతన నిరతప్రయత్న వాంఛ
యుపనిషద్వచనార్థ బోధో దయమ్ము
దీనిచే జ్ఞానముదయించు గాని యెడ వి
పర్యయమ్మగు సంసార బంధమెయగు
ప్రాణబుద్ధి మనస్తను ప్రముఖములకు
నల యహంకృతికి భిన్నమైన నను జి
దాత్ముడను నిత్యశుద్ధుడుననెడి తెలివి
యే కనుంగొన జ్ఞాన సంజ్ఞాకమగును
దాని యనుభవమే సువిజ్ఞాన మనుజ !
ఆత్మ సర్వత్ర పూర్ణ ! మవ్యయము మరియు
సచ్చిదానంద సుప్రకాశ మహితమ్ము
ధీముఖోపాధి రహితమ్ము నామరూప
వర్జితమ్మను బరిణామ వర్జితమ్ము
స్వప్రభమ్మద్వితీయ మపావృతమయి
స్వప్రకాశముచే దేహ సమితి వెలయ
జేయుచును వాని కెల్ల సాక్షియయి వెలుగు
జ్ఞాన విజ్ఞానముల చేత గాన నగును
దివిరి సద్గురు శాస్త్రోపదేశమహిమ
జీవపరమాత్మలకు నైక్యసిద్ధి యెపుడు
కలుగునపుడె యవిద్య స్వకార్యకరణ
సహితముగ నాత్మనందుసంసక్తమగును
నాయవస్థయే ముక్తినానలరు నిదియె
యాత్మనందౌప చారికమగుట నిజము
తమ్ముడా ! యిదె మోక్షరూపమ్ము సుమ్ము
జ్ఞాన విజ్ఞాన సహితమౌ దీని తెలియు
దుర్లభమ్మిది మద్భక్తి దూరులయిన
జనుల కని నమ్ము దర్శన శక్తి మిగుల
గలిగినను మానవుడు దీపకాంతిలేక వస్తువుల
గానలేనట్లు పరమునన్ను జ్ఞాన విజ్ఞాన శూన్యులు గానలేరు

నాదుభక్తికి దగుకారణముల వినుము
సతతమద్భక్త సాంగత్య సక్తమతియు
మరియు మద్భక్త సేవయు హరిదినోప
వాస సంప్రీతి మత్పర్వ వాసరేచ్ఛ
మత్కథా శ్రవణాసక్తి మామకీన
చరిత పాఠ సమాఖ్యాననిరత మతియు
మత్సపర్యా మదీమ నామస్మృతులును
గలుగువారికి మద్భక్తి గాంచనగును
దానిమించిన జ్ఞాన సాధనములేదు
దానగలుగును జ్ఞాన విజ్ఞాన గరిమ
తగు విరక్తియు : దానముక్తత లభించు
దావక ప్రశ్నములకు నుత్తర మొసగితి
ముక్తి భాజనమగును దమ్మీడ నిజమ్ము
వినుప దగదిది మద్భక్తి విముఖ మతికి
బిలిచి యేనియు నాదుభక్తులకు వినుపు
మెవడు భక్తి సమన్వితుడగుచు సతము
దీని బఠియించువాడు విజ్ఞాని యగుచు
నజ్ఞతాధ్వాంతముక్తుడై యలరు నసుజ ॥ 110

సంతత మామకీన పదసక్తులు యోగులు శాంత నిర్మల
స్వాంతులు మత్ప్రితౌఘహిత చర్యులు మచ్చరితాభిలాషుల
త్యంత పవిత్రవర్తనులె యర్హులు ముక్తికి నట్టి వారి నా
యంతిక సీమజేర్తు వినుమా యిది సత్యము నమ్ము సోదరా ! 111

4వ సర్గ సంపూర్ణం



## 5వ సర్గ

గౌరీ ! రామవిభుండు పంచవటి నక్కాలమ్ము సాగించుచో
ఘోరాకార మహాబలాఢ్యయగు రక్షోదామ తద్గౌతమీ
తీరమ్మందు జరించుచుండి కడుప్రీతిం బద్మ వజ్రాంకుశా
కారాన్వీత రఘూత్తమాంఘ్రి యుగముల్ గన్గొంచు విభ్రాంతమై ॥ 112

కనుగొని యాపె తచ్చరణ కంజ మనోహర రూప సంపదన్
దనియుట గామరూపమును దాల్చి మహత్తర మోహవశ్య యై
చనిచని తత్పదాంకములు సాగిన భవ్యనివేశనమ్ము నొ
ల్లన జొరబారి జానకిని లక్ష్మణు రామునిగాంచి ప్రీతయై ॥ 113

కందర్ప సుందరుని రా
ముందరిసి తదీయ రూపమునకు వలచి యా
మందమతి దనుజ యతనిం
జెందం దలపోసి యిటువచించె పెరిమమై 114

ఓయీ ! మానవ ! యెవ్వడ
వీ యడవికి నెచటనుండి యేతెంచితి వ
య్యా ! యీ వల్కలములు జడ
లీయనువున నీవు దాల్ప నేటికి జెపుమా ! 115

రావణాహ్వాయ రాక్షస రాజభగిని
నైన నను శూర్పణఖ యను దానవసతి
గా నెఱుంగుము భ్రాతయౌ ఖరునితోడ
బంచవటి కాననమ్ముల సంచరింతు ॥ 116

ఈ వనమునెల్ల రావణుడిచ్చె మాకు
నిందు దిరుగుచు దాపస బృందమె తగు
నోగిరముగాగ మెలగుచునుండి యిపుడు
నిను దెలియవచ్చితిని దెల్పుమనఘ ! నిజము ॥ 117

అనవిని రాఘవుండు దనుజాంగన నారసి యిట్లు వల్కెనో
వనిత యయోధ్య కేలికగు పంక్తిరథక్షితిపాలు నగ్రనం
దనుడను నీమె నాకు సతి తమ్ముడితండగు లక్ష్మణుండు నా
పనియెదియేని గల్గునెడ బల్కదగున్ భువనైక సుందరీ ! 118

అనుటయు నారక్కసి యి
ట్లనె నోకందర్ప సుందరాకార ! నినున్
గని మదన శరాహతనై
తిని నాతోగలిసి కోర్కె తీర్పదగునిటల్ ॥ 119

మన మీగిరి కాననముల
మనసు మనసు గలిపి సతము మదనక్రీడా
జనిత సుఖంబుల గాంచం
జను నిను నెడబాసి బ్రతుక జాలను జూమ్మీ ! 120

అదివిని రాఘవుండు స్మిత మానన సీమ జనింప జానకీ
సుదతిని భావగర్భముగ జూచుచు రక్కసి జూచి పల్కె నో
ముదితరొ ? నాదుచెంత నొక ముద్దియ యున్నది తన్నుబాసి నిన్
గదియగనీదు నీదు మదిగల్గిన కోరికి యెట్లు తీరెడిన్ ॥ 121

వినుము దశాననానుజ ! వివేకినివై చను ద్వార భూమి నా
యనుజుడు సుందరుండు గలడాతనికిన్ సతిలేదు నన్ను మిం
చిన యువకుండు నీకుదగుచేతల జేయగలాడు వాని కీ
వనుగుణ వౌట బల్కితి యథార్థము నానుడి నమ్ము పొమ్మికన్ ॥ 122

చెవులు ముక్కు మొగము సవురుగలట్టి ని
న్గనియెనే నతండు గవయకున్నె ?
కాక నీవు పంక్తికంఠుని యనుజవు
నయమొ భయమొ కాదనంగ నగునె ? 123

అనినంత శూర్పణఖ ముద
మున సౌమిత్రి దరిజేరి మోహన ! పతివై
నను నెనయుము నీయగ్రజు
పనుపున వచ్చితిని నన్ను బాలింపగదే ॥ 124

అని తనకోర్కి తెల్పి మదనాతురయై దరి జేరవచ్చు నా
దనుజను గాంచి లక్ష్మణుడహా ! పరికింప వివేక హీనవై
కనబడెదీవు నన్గదియగాదగ దేను దదీయ దాసుడన్
జనకజ కీవు దాసివగు చక్కటి నీకగు నన్ను గూడినన్ ॥ 125

దాసునకు బత్నివైనచో దాసివగుచు
దాస్యమొనరింప వలయు దత్పత్ని కంత
కంటే దుఃఖము భువి వేఱొకండు గలదె ?
కాన మరియును రాముని గవయ బొమ్ము ॥ 126

ఆతని వచనమ్ములు కా
నాతి కనలి రామునంతికమునకు గ్రోధా
న్విత యయివచ్చి ! యిటులే
లాత్రిప్పుట ? యెవతెగా దలచితొ ? నన్నున్ ॥ 127

అరయు మిపుడె నిను నీ సో
దరు నిన్నీతరుణినిదె యధాకాలముగా
దొరకిన యోగిరముగ దిని
యరిగెద నేనలతినౌదునా ? మతిహీనా ! 128

అనివిని వికటాకారమున్మై
జనకజ దరిజేర రామచంద్రుననుమతిన్
గొని లక్ష్మణుడొక యసి చే
కొని దానవి ముక్కు చెవుల గోసె గడువడిన్ ॥ 129

అక్కరణి గోయబడి యా
మ్రుక్కిడి రుధిరార్ద్రయగుచు మొరవెట్టుచు పెన్
రక్కసుని ఖరుని చెంతకు
గ్రక్కున జని చూపె గృతవికార వదనమున్ ॥ 130

దానిన్గని ఖరుడనె నో
సీ ! నీకీవికృతి నెవడు చేసెను దాగా
లానలమున బడ మృత్యువు
నాననమున జొరగ దలచెనా ? దుర్మదుడై ॥ 131

అనుటయు నారక్కసి యి
ట్లనె నోదనుజేశ ! రాముడట ! సీతను ల
క్ష్మణుగూడి తిరుగు నిక్కా
ననమున గౌతమి తటమ్ముననను నిర్భయుడై ॥ 132

ఆరఘుసూనులందొకరు డగ్రజుడాతని యాన దమ్ముడీ
తీరుగ జేసె నాకు వికృతిం దగువీరుడవేని రాక్షసా
ధారుడవేని వీరినిక దత్క్షణమే వధియింపు కానిచో
జేరెద గాలుమందిర మిసీ ! బ్రతుకేటికి నింక సోదరా ! 133

భ్రాతవు రావణునకు సం
త్రాత వనుజవర్గమునకు ధైర్యస్థైర్యో
పేతుండవరాతి జన వి
ఘాతమొనర్పక యశంబు గడియింతు వెటుల్ ॥ 134

అన్నరకీటమ్ముల నా
యన్నముగావించి వారి యసృగంబువు నా
కున్న పిపాస నడప నో
యన్నా ! కావలయు నీ సహాయము వీరా ! 135

అది విని ఖరుడు కుపితుడై
పదినాలుగువేల దానవ ప్రముఖుల దు
ర్మదుల నరసి యారాముని
గదిసి వధింపుడని పల్కె గటము లదరగన్ ॥ 136

తన తమ్ములు త్రిశిరుడు దూ
షణుడు జనుదేర యుద్ధ సన్నాహముతో
జని పంచవటిని విడుయుట
విని తమ్ముని జూచి రామవిభుడిట్లనియెన్ ॥ 137

తమ్ముడ ! వింటివె ? యానా
దమ్మది రక్కసుల రాక తలపించెడి ని
క్కమ్ముగ వారలతో యు
ద్ధమ్మగు మీ వదినె గావధగు వేఱొకచో ॥ 138

చేయుమటులని నిన్ను శాసించుచుంటి
గాన నాయాజ్ఞ ద్రోయగా గాదు నేనొ
కండ వారిని జంపగలాడ నిజము
పొమ్ము నీవాగుహాసీమ దమ్ముగుత్తి ! 139

అని రాఘవుండు యుద్ధ
మ్మునకుం దగుపరికరమ్ము బూని ధనువు చే
కొని యక్షయ శరతూణము
లినుమడిగా గాబట్ట చనియె నెద ధృతి యొదవన్ ॥ 140

అంత రక్కసుల్ బహువిధాయుధముల్ తరుపంక్తి నశ్మముల్
సంతత వర్షధారగ నశాంతగతి స్గురిపింప వాని నిం
తింతలుగాగ బాణములనేకముగా నిగుడించి త్రుంచి యా
యంతకు జేర్చె నసహాయత రాముడు విక్రమోన్నతిన్ ॥ 141

దానికా ఖరుడల్కమై దమ్ములైన
త్రిశిరుదూషణునింగొని తేకువమెయి
రామునెదిరింపగా నరజామునందె
వారినెల్ల వధించె నవార్య శక్తి ॥ 142

గహ్వరా వాసియైన లక్ష్మణుడు జనక
సుతయు రాఘవ విక్రమస్ఫూర్తినరసి
విస్మయంబంద నాతడు వెడలి వచ్చె
సీత రామునకప్పుడాశ్లేషమిచ్చె ॥ 143

ఆరీతి సీత కౌగిట
జేరిచి రాముమెయినున్న శితశరఘాత
స్ఫోరకములైన వ్రణముల
నేరుపునం దుడిచె దనదు నెనరు కనబడన్ ॥ 144

అంతట నాదనుజ శుగా
క్రాంతయగుచు హతసమస్త రక్షస్తతి వి
భ్రాంత యయిగనుచు రావణు
నంతికముంజేరి యతని యడుగుల బడియెన్ ॥ 145

పదగతియగు చెలియలి దశ
వదనుడు గని ఏమె ? తల్లి ! భయవిహ్వలవై
రుదిత మొనర్చెదు నీకీ
కుదశం గలిగించినట్టి కుత్సితుడెవడో ? 146

వాసవుడో ? యముండొ ? యలపశ్చిమ దిక్పతియో కుబేరుడో ?
నాసిక గోసి కర్ణదళనమ్మొనరించె నెవండు ? ప్రాణముల్
వాసి చనంగ నాతడు తలంచెనొ ? తెల్పుము వానినిప్పుడే
నే సమయింతు నోర్వగలనే ? యిటు గల్గిన నీదు వంతకున్ ॥ 147

అనుటయు నాపె వల్కె దనుజాధిప ! నీవెటు రాజవౌదు ? స్త్రీ
జనవిజితుండవై మదము సంధిల బానమొనర్చి లోక వా
ర్త నెఱుగ జేయు చారుల నిరంతర వృత్తమెఱుంగకుండి షం
డునిగతి నున్న మూర్ఖుని నినుం బరుసంబుల బల్క నేటికిన్ ॥ 148

ఖరుడు నశించె దూషణుడు గండడగెం ద్రిశిరుండు చచ్చె దు
స్తరమగు వారి సేనయు హతమ్మయిపోయె క్షణమ్మునందె నీ
వరయమి దండకాటవి భయమ్ము నెఱుంగక మౌనులందఱున్
దిరుగుచున్నవారు కడుతేకువ హేతువు నీ యసడ్డయే ॥ 149

పాలకుల లోపముండిన నేలకెట్లు
గాననగుసౌఖ్య ? మా జనస్థానమెల్ల
దనుజ రహితము తన్మోని జనసహితము
గాగ నీ మౌఢ్యమే మూలకారణమ్ము ॥ 150

విక్రమ ధనాఢ్యుడై ని
ర్వక్రమముగా దిరుగుచుండె రాముడచట భూ
శక్రుడ సురారియై కా
లక్రమమున జంపు నసురులను మేల్కనుమీ ॥ 151

అనవిని కుపితుడయి దశా
ననుడనె రాముండెవండు ? ననుదెలియక యా
దనుజాలం ద్రుంపగతమ్మేది ?
వినిపింపు మదెల్ల వాని చే త్రుంతు ననన్ ॥ 152

దనుజాధీశ్వర మొన్న నేనల జనస్థానమ్మునందుండి నిన్
గనగా వచ్చుచునుండ గౌతమి తటానన్ మౌని బృందాశ్రయ
మ్మున దత్పంచవటిం గనంబడె శరమ్ముల్ విల్లు చేబూని త
మ్మునితో రాముడు సీతగూడి కడపున్మోదమ్మునం గాలమున్ ॥ 153

వాని యిల్లాలు చక్కని వారిలోన
జక్కనిది దేవగంధర్వ సతులమించు
మానవాంగనలందు నద్దాని బోలు
వారులేరని తెల్పగవచ్చు నన్న ! 154

వేయివచియింప నేటికి ? వినుము నీకు
దగినదది దానికన్నిట దగుదువీవ
బంగరువు తావిగాంచిన పగిదియగును
మీదుకలయిక జగముల మేలొసంగు ॥ 155

దానింగదియవదేని, ద
శానన ! నీ జీవితమ్ము వ్యర్థమగుచు నీ
దానవ రాజత్వమునకు
గానబడదు ఫలము పంక్తికంఠ ! నిజము సూ ॥ 156

ఐనను రామచంద్రు డసహాయ పరాక్రమ శాలి నీ వికన్
వాని జయించి తత్సతిని వశ్యగ జేయుట కష్ట సాధ్య మే
దేనొక మాయ త్రోవ గొనియే గడియింపుము దాని గానిచో
నానళినాక్షి చిక్కదు దశానన నానుడి నమ్మి చేయుమీ ॥ 157

అట్టి సవురుగల్గినట్టి సీమంతిని
గనియు వినియు నెఱుగ దనుజనాథ !
దాని నీకు గూర్పదగునని నే బోవ
వాని యనుజుడిట్లు గానొనర్చె ॥ 158

అంతటి వెతకోర్వక ఖరు
చెంతకరిగి మొఱలువెట్ట జిడిముడి వై
ర్యంత మొనరింతుమని చని
యంతము తామొందిరా ఖరాదులు తండ్రీ ! 159

వేయి వచింపనేల ? రఘువీరుడు చిత్తమునం దలంచినన్
మాయగ జేయులోకము సమస్తము నొక్క క్షణమ్ము నందె అ
న్నా ! యిక సీత పత్నియయినన్ సఫలమ్మగు నీదు జీవిత
మ్మా యువతీలలామకయి యత్నము సేయుము రాక్షసాధిపా ! 160

అనవిని దశాననుడు తన
మనమున జింతించి దానమానమ్ముల దా
నిని జేర్చి నిజగృహమునకు
జని సెజ్జను జేరె నిద్ర సమకురకుండెన్ ॥ 161

రాముడు మానవుండొకడు రాక్షస వీర ఖరాదులో బలో
ద్దాములు వానిచే నెటులు దర్పము వీర్యమడంగి చచ్చి రా
హా ! మనుజుండుగా డసురమర్దనకై పరమేష్ఠి వేడ దా
నీమహి మానవత్త్వము వహించి జనించిన విష్ణుడేయగున్ ॥ 162

ఆ పరమమె ననుజంపిన
బ్రాపింతు వికుంఠమందిరము కాక యతం
డే పాలిసిన నారాజ్య
మ్మే పునబాలింతు రామునెదిరింతు నికన్ ॥ 163

ఇటులు చింతించి తద్రాక్ష సేశ్వరుండు
రాము హరిగా నెఱింగి వైరమతి నతని
జేరువాడను భక్తిచే జేరనీడతండు
నన్నుచునె నిశ్చితమ్మొనర్చె ॥ 165

5వ సర్గ సంపూర్ణం



## 6వ సర్గ

అని యటునిశ్చయించి దనుజాధిపుడల్లన సెజ్జనుండి వే
గినతఱి లేచి బుద్ధినొక కృత్రిమ మార్గము బూని సాగర
మ్ము నవలితీరమందు దపముంగొని యాత్మ సమాధి నున్న మా
మను గన నేగ గొంతకు సమాధి ముగించి యతండు మెల్లనన్ ॥ 165

కనుగవ విప్పి రావణుడు కన్పడ వానికి దన్మరీచి నం
దనుడు యథోక్త పూజన మొనర్చి ఫలాశన తృప్తుజేసి యా
సనగతుజేసి భక్తిమెయి సన్నిధిచేరి వచించె నొంటిమై
ననుగనరా గతమ్మును వినందగు నేని వచింపు మల్లుడా ! 166

నీ మొగములగన నిప్పుడ
దేమో ? యొకచింతబూని యేతెంచినటుల్
నా మదికి దోచె దెల్పుము
సామీ యది తగినదేని జలుపగలాడన్ ॥ 167

మౌని నయియున్న నాకుం
బూనందగు కార్య మెదియు బొనరించెద సా
మీ ! నీనుడి కాదందునె ?
నేనెఱుగనా ? రాక్షసేంద్ర ! నీ ప్రభుశక్తిన్ ॥ 168

అనవిని దశాననుడు తన
మనమునగల కోర్కి తీర్ప మాయావిదుడై
పనియెట్టిదేని దీర్పం
జను నితడటంచు రాముచరిత మిటులనెన్ ॥ 169

మామా ! దశరధ భూపతి
రాముని నగ్రసుతు భీకర పరాక్రమునిన్
సౌమిత్రిని సీతను వన
భూమికి బంపించె నతని పోకడ వినుమీ ॥ 170

ఆతడు విపినవసతియై
గౌతమికడ నాదుభగిని గనుగొని తన్నా
సాతత్కర్ణములను ని
శాతాసిం దునిమి విడిచె సాహస మెసగన్ ॥ 171

మరియు వినుము వాడు ఖరా
సురుని నిరపరాదు దదనుజుల ద్రుంచి నిశా
చరుల దునిమి నిర్భయుడై
చరియించెడి బంచవటిని సౌఖ్యాన్వితుడై ॥ 172

వాని సతి లోకసుందరి
కానంబడదట్టి దీజగంబున నెచటన్
దానింగొని తేరగ మా
మా ! నీ తోడ్పాటు నొసగుమా యాప్తుడవై ॥ 173

వారులేనట్టి తరి బోవలయునటకు
గాన మాయామృగాకార మూని యెటులో ?
నీ వెనుకగొని పొమ్ము వాని నెటులేని
నా మనోరధ మీడేఱు మామ ! వినుము ॥ 174

ఆ యిరువురు లేనితరి
న్మాయామునినగుచు నేను మసలకయటకున్
బోయెద దానిందెచ్చెద
నీ యనువునగాని మామకేచ్ఛ పొసగునా ? 175

అనవిని మారీచుండి
ట్లనె నోదనుజాధినాథ ! యసదుపదేశ
మ్మొనరించె నీకెవండో
వినిపింపుము నీవ కను వివేకయుతుడవై ॥ 176

తలచె ద్వద్వంశ మూల ఘాతమ్మొనర్ప
దులువ యెవ్వండొ ? వాడు ధూర్తుండమిగుల
వాడె నీకొక వధ్యుడౌ వైరిముఖ్యు
డగుట నిక్కము రాముపై నలుగ దగదు ॥ 177

అనుచు వచించి వెండియు నహో ! రఘురాముని పైకి బోవగా
జన దల గాధినందనుని జన్నమున న్నను నాశుగాశుగ
మ్మున బడద్రోసె వారినిధి మున్గియు మెల్లగా లేచివచ్చి యా
తనినె తలంచుచు న్వెఱచి దండకమందె వసింతు నెప్పుడున్ ॥ 178

అని మరియున్వచించె నిటులాతడు రావణ నేను బూర్వపుం
గినుకను రాముపై గదియ గృష్ణ మృగాకృతి నేణ సంఘమున్
గొని చన నన్ను గాంచి యొక కోలనుదూలగ జేసె రాముడా
వననిధి మున్గియు న్మరలవచ్చి తపంబొనరింతు నిచ్చటన్ ॥ 179

అది మొదలు వెఱగుచే నా
మది నిరతము రామచంద్రు స్మరియించుచు నె
మ్మది గలుగ దపమునిట చే
సెద నాతని పేరు వినిన జెందెద భయమున్ ॥ 180

రాజరత్న రమా రథ రామణీయ
కాది రావర్ణయుత పదరాజి చెవుల
బడిన స్వప్నమునందేని భయము గలిగి
నిదురవీడుదునో దశవదన ! నిజము ॥ 18

ఘనుడతడు వచ్చు నను శంక గలిగి యిచట
భద్రమగునని తలచియే నిద్రయందు
నైత మాతని మరువక భీతిగదిరి
బాహ్య కార్యములన్నింటి వదలినాడ ॥ 182

కావున రావణ ! నీవు దు
రావేశము వదలి యింటి కరిగి యతని నే
భావింపుము నీకులముం
గావుము నామాట హితముగా గైకొనుచున్ ॥ 183

రామచంద్రునియెడల వైరమ్ము విడిచి
మది భజింపుము భక్తి దత్పదయుగమ్ము
నతడు పరమ దయాళుడై యరయునిన్ను
బరమపూరుషుడతడు నా పల్కు నమ్ము ॥ 184

మున్ను నేనిదియంతయు మునుల వలన
విన్నదియె నీ వెఱుంగ దెల్పెదను వినుము
దనుజులను ద్రుంప నల్వ ప్రార్థనమున భువి
నవతరించిన యప్పరమాత్ముడతడు ॥ 185

మానవుడు గాడు దశరథ సూనుడవని
భారమడగింప బుట్టిన హరియె సుమ్ము
కపట మానవ వేషము గలిగి తిరుగు
గాన నాతని నెన్నడు గదియ దగదు. ॥ 186

అనిన రావణుడిటు పల్కె వినుము మామ !
అతడు పరమాత్ముడైన హరియ యేని
నలువ ప్రార్థనమున రక్కసులను దునుమ
నవతరించి ననుం దునుమాడు నేని
నంతకంటెను వేఱె సౌఖ్యమ్మె లేదు ॥ 187

వాని భార్య దేర మానను యత్నము
తెచ్చి లంకలోన జొచ్చి యుందు
నతడు యుద్ధమునకు నరుదెంచి చంపెనా ?
వీరలోకమేను జేరువాడ ॥ 188

కాదేని యుద్ధమున నా
భూదయితుని జంపి సీత బొందెద మామా !
కాదనక నాదు కోరికి
వేదీరుప లెమ్ము రమ్ము వేయేలయికన్ ॥ 189

ఇటులు గాదను నేని నాచటులకుటిల
పటుతరాసిని నీతల బగులగొట్టు
వాడ గావున గపటపు లేడి వగుచు
గాదనక నాకు దోడ్పాటు కడగి చేయు ॥ 190

అది విని యామరీచి సుతుడాత్మదలంచె నితండు నన్ను జం
పెదనని పల్కుచుండె నదిమేలగునే ? రఘునాధు చెంతకే
గెద మృగ రూపినై యతని కేలనశింప లభించు ముక్తి దు
ర్మదుడగు వీని చేతి మృతి మంచిది గామి నొనర్తు నింతయున్ ॥ 19

వీని చేత దనువు వీడిన నిరయము
సంభవించు లేదు సందియమ్మ
టంచు దలచి తావకాజ్ఞను దలనిడి
చనెడువాడ వలదు కినుక మామ ॥ 19

అనవిని దశాననుడు రథ
మున నాతని నునిచి వేగముగ బంచవటిన్
గనజని రామాశ్రమముం
గని దూరమునందె నిలిచి కపటాకృతియై ॥ 19

రజతమయ దేహ బిందువుల్ రత్నశృంగ
ములును సన్మణిమయ ఖురములును నీల
రత్నలోచనములు దటిత్ప్రభయు ముద్దు
మోము వెలయగ బంగరు ముద్దయగుచు
నిలిచె మారీచుడాశ్రమనికట భూమి ॥ 19

వింతగ గంతులిడుచు ద
శ్రాంతములంగనుచు ద్రుళ్ళిపడుచు జనకజా
కాంతకు ముద్దు గొలిపి యా
చెంతల దిరుగాడె గపటి శేఖరుడగుచున్ ॥ 1

## ౮వ సర్గ సంపూర్ణం

## 7వ సర్గ

గౌరీ ! వినుమాకరణిన్
మారీచుని గూడి కపట మార్గమ్మున దా
జేరెం బంచవటి దురా
చారుడు రావణుడు రామచంద్రునెఱిగియే ॥ 196

ఆ రావణు చెడు చెయువుల
నారసి రాఘవుడు సీత కనె నోదేవీ !
చేరును దశవదనుడు మా
యారూపము బూని భిక్షువగుచు నినుగొనన్ ॥ 197

కావున నాయానతిగొని
నీవావహ్ని జొరబారి నీ ఛాయకిటన్
దావిచ్చి లోనికరుగుము
నీవని భ్రమియించి వాడు నినుగొనిపోవున్ ॥ 198

అది కారణముగ వానిని
దుదముట్టగ జేసి వేడ్కతో నిను మరలన్
గదిసెద గొలది దినమ్ముల
బదిలముగా నా నియుక్తి బరికింపుమనన్ ॥ 199

ఆ సతి పతియానతి మా
యా సీతను ద్వారభూమియందిడి యనలా
వాసాంతర్ధిగ ద్వాదశ
మాసము లందుండె నోయుమా ! మరి వినుమా ! 200

అంతనామ్మాయ లేడి మాయామహీజ
చెంత దిరుగగ నామె వీక్షించి దాని
సొబగునకు జొక్కి రాఘవు జూచి నాథ !
దాని జూచితే ? యెంత యందమ్ము గలదొ ? 201

ప్రాణముల తోడ దానిని బట్టి తెచ్చి
ప్రేమ నొసగితివేని గ్రీడామృగముగం
జేసి కాలము వెడల బుచ్చెద నటంచు
వినయమధురోక్తియై సీతవించి ॥ 202

చిత్ర మృగమదె గనుము పవిత్ర చరిత
చిత్ర బిందుయుతమ్ము తద్గాత్ర మెల్ల
గనక రత్నాంచితమ్మయి కానిపించే
దెచ్చి యిచ్చిన నాచెంత దిరుగుననగ ॥ 20

రాముడు తమ్మునిగని యో
సౌమిత్రీ ! యిచట రాక్షస వ్రజముండున్
భూమిసుత నిష్ప్రమాదము
గా మనుపగవలయు నెట్లు కాచెదొ ? యనగన్ ॥ 20

వదినె న్మెలకువ మెయి గా
చెదగాని విశేషమొకటి చెప్పెద మారీ
చ దనుజుడు మృగాకృతి యై
గదిసెను సందియములేదు గనుమోయన్నా ! 20

అనవిని రాముడు సోదర !
వినుమారీచుండెయేని విదళించెద వం
చన లేక మృగమయేనిం
గొనివచ్చెద దీనికీవు కొంకకు మనుచున్ ॥ 20

అఖిలమోహిని మాయ యదాశ్రయయగు
నట్టిపూర్ణుడు నిర్వికారాత్మ రూపి
భక్తులను బ్రోవనెంచి సర్వజ్ఞుడయ్యు
మాయలేడిని గొనగ నాత్మనిడి వెడలె ॥ 20

తాను దెలిసియు నతడు సీతాప్రియమ్ము
జేయ మాయా మృగము దేర సిద్ధపడియె
గానియెడ వేత్తయును బూర్ణకాముడునగు
నాత్మునకు మృగమేల ? భార్య పనియేల ? 20

కలయగ దిరుగుచు మాయా
విలసనముల జూపి మిగుల వింత గొలుపుచున్
మెలగు మృగముగని విలు న
మ్ముల గేలంబూని రామవిభుడు చలముమై ॥ 20

అటువెడల నా(శమము చెం
గట దిరుగుచు ధరణి జాతకన్నుంగవ కు
త్కట మోదమిడుచు మాయా
నటనము జూపెను మరీచినందనుడెదురన్ ॥ 210

గరికి గొఱుకు మిషమున గడు
దరిజేరుచు బట్టబోవ దలగుచు మరియుం
గరగతమై తలగుచు బరి
పరివిధముల రాము దూరపథ గతుజేసెన్ ॥ 211

అమ్మాయ దెలిసి రాముం
డమ్మారీచునొక వాడి యమ్మున దునుమన్
సొమ్మసిలి ధరనొరగి (ప్రా
ణమ్ము లెడల సహజ తనువునం, గననగుచున్ ॥ 212

హా ! మహాభుజ ! లక్ష్మణా ! హతుడనగుచు
నున్నవాడను వేవచ్చి నన్ను బ్రోవ
వలయునని రాఘవుని గళస్వనముదోప
బిగ్గరగ మ్రోగి దనుజుడు విడిచె దనువు ॥ 213

పామరుడేనియు నెవ్వని
నామము మరణావ సరమునం దలప దదీ
యామల సమరూపముగొను
నామహితుని స్వరముతోడ నఱచె గపటియై ॥ 214

ఆహా ! సురలెల్లరుగన
శ్రీహరి గనుగొనుచు నతనిచే హతుడగుచున్
దేహమ్ము విడిచి రాముని
దేహమ్మున గలిసె సద్గతికి గఱవగునే ? 215

కనుగొన మారీచుడు చే
సిన కర్మమదేది ? వాడుచెందినదెది ? రా
ముని నామమహిమ యెట్టిదొ ?
కనుడీ ! రామునిస్మరింపగా ముక్తియగున్ ॥ 216

మరణసమయమున రాముని
స్మరియించుచు నెవడు భక్తి జచ్చునొ ? వాడా
హరి జొచ్చుట నిజమని యా
సురలన్యోన్యము వచించుచుం దొలగి రటన్ ॥ 217

అంతట రామచంద్రుడిటు లాత్మదలంచెను వీడు నేడు ప్రా
ణాంతమునందు నావలెనె హా ! యనుజా ! యని కూసె దీనికిన్
వంతవహించి యేవిధమునన్ విలపింతురొ ? సీత తమ్ముడున్
జింతల పాలుగావలసెనే ? యిపుడక్కట ! ఏమి సేయుదున్ 218

అనివడి నిజాశ్రమమునకు
జనుస్రోవంబట్టి మరలి సౌమిత్రిని గ
న్గొని జానకిపల్కెను ల
క్ష్మణ ! మనకిపు డెట్టికీడుగలుగునొ ? కనుమీ ॥ 219

నా దక్షిణ నేత్రమదరు
గాదె నీయన్న యార్తకంఠ రుతివినన్
లేదా ? భీతిల వాతని
కే దనుజునివలన నేమియెగ్గు గలిగెనో ? 220

పోగదె ! రామునిచెంతకు
వేగముగా ననుచు మొఱలు వెట్టెడి వదినెన్
దాగని లక్ష్మణు డిటులనె
నోగాదిలితల్లి ! వెఱపు నందక వినుమీ ॥ 221

జననీ ! నీవిటు రాఘవ ప్రభునికై సంతాపముం బూనగా
బని లేదాతడు రాక్షసాంతకుడు కోపమ్మూనెనా ? లోకమె
ల్లను భస్మమ్మొనరింప గా గల డిదేలా ? సంశయ మ్మెవ్వడో
దనుజుండిట్లఱచెం దదీయగళ నాదమ్మూని మాయావియై 222

అసుర సంహారమొనరింప నవతరించి
నట్టి రామునకా ? దనుజాధముండు
హానిగూర్చుట ? రాముడు దీనదశకు
బాత్రుడగునమ్మ చింతింప వలదనంగ 223

వరదగ గంటినీరు దిగవారగ నేడ్చుచు సీత వల్కె దు
ర్భరదురవస్థ గల్గెనిటు రాముని నాశము గోరుచున్న త
ద్భరతుడు పంప మావెనుక వచ్చితే ? నిన్ స్పృశియింతునే ? సహో
దరుడని నమ్మినందుకు గృతఘ్నత చూపితి విట్లు దుర్మతీ ! 224

ధర్మ పథము పరికింపక
నిర్మాయికుడైన రామునికి వెతగలుగన్
దుర్మతి నిటులైతివి నా
కర్మమని తలంతు నేమి గానున్నదియో ? 225

రాముని నాశము గనుగొని
సౌమిత్రీ ! నన్నుబొంద జనుదెంచితి వే
మో? మరణించెద నిదె యని
యామె స్వబాహువుల గంఠమందిడి యేడ్చెన్ ॥ 226

అప్పరుసముల విననొల్లకతడు చెవుల
గప్పికొని దుఃఖితాత్ముడై కదల నెంచి
చండి ! నను దూఱితివి పరుసములు వల్కి
దానికగు దుష్ఫలమ్ము నొందవొకొ ? యిపుడె ? 227

అని మదినొచ్చికొంచు జనకాత్మజ దద్వనదేవతాళి క
ప్పన మొనరించి దుఃఖమయవారిధి మున్గుచు రాముజేర మె
ల్లన జనగాంచి రావణుడు లక్ష్మణహీనము పర్ణశాల సీ
తనుగొని పోవ భిక్షుకత దాల్చెద నిత్తరి వంచకుండనై ॥ 228

అని దండకమండలువుల
గొని యోగివిధాన సీతకుం గనబడ నా
జనకజ వానింగని వం
దనమొనరిచి పూజనమ్మొనర్చి సుమతియై ॥ 229

వంచన తెలియక ఫలమూ
లాంచ త్కరయగుచు జంతకరిగి మునిని మ
న్నించి ఫలమ్ము లివే వీ
క్షించి గొనిభుజింపు మౌనిశేఖర ! యిచటన్॥ 230

అవ్వచనమ్ముల న్విని దశాననుడాద్భుతిమీర బల్కె నీ
వెవ్వతెవౌదొ ? నీదుపతి ఎవ్వడొ ? తెల్పుము భీతిమాని యో
జవ్వని రక్కసుల్ మెలగు చక్కటి నిందు వసించితేల ? నీ
యవ్వలి దైన్యవృత్తము సమస్తము దెల్పుదు గాక నెమ్మిమై ॥ 231

అనుటయు సీతయిట్లనె మహాత్మక ! పంక్తి రథుండయోధ్య నే
లు నతనియగ్రపుత్రుడతులుండగు రాముడు నామగండు స
జ్జనుడగు తమ్మునిం గలిసి సన్నుతి గాంచగ దండ్రి యానతిం
గొని చనుదెంచె నిట్లిచటకున్ నను జానకియండ్రు భూజనుల్ ॥ 232

తండ్రి యనుప నావిభుడీ
దండకమును జేరె నన్ను దమ్ముని గొని యిం
దుండును బదునాల్గేండ్లు ఘ
నుండవు నా పున్నెమున నినున్గనుగొంటిన్ ॥ 233

అనవిని దశవదనుండనె
ననబోడీ ! నే బులస్త్య నందనుడను రా
వణుడ నినువలచి యిట్టులు
చనుదెంచితి వినుము రాక్షస విభుడ బ్రియా ! 234

మునివేషియైన రాముని
గొనిన ఫలంబేమి ? నన్నుగూడి సుఖములం
కనుము వనిన్వెతలను జెంద
దనగునె ? వినుమో ! సరోజదళ పృథునయనా ! 235

అదివిని జానకి భీత్యా
స్పదయై దుర్జాత యిట్లుపల్కెద వికజ
చ్చెదు క్షణముండిన నావిభు
డదెవచ్చెడి నన్నుజూడనగునే కుమతీ ! 236

నా విభుని శక్తి తెలియక నన్ను గవయ
నెంచితివి సింహకాంతగా మించినట్టి
శశము పోలికిని నీవు నాశము వహింప
గలవు శ్రీరామ శరవిద్ధగాత్రుడవయి ॥ 237

అని యామె పలుకగా విని
కినుక జనకసుతకు నిజవికృతరూపము చూ
పెను రావణుండు ద్వదశా
ననవింశతి బాహుయుత ఘన ప్రభతనువున్ ॥ 238

భీతిని వనదేవతలును
భూతములును గనుచునుండ బుడమి నఖములన్
బాతగలిచి దశవదనుడు
సీతాసతి రథమునందు జేర్చికొని చనెన్ ॥ 239

భీమతదాకృతి గనుగొని
రామా ! సౌమిత్రి ! నన్ను రక్షింపుడు నా
బాము దలగింపుడని యా
భూమిజ ధరగనుచు వెఱపు వొడమ నడలగన్ ॥ 240

ఆ యాక్రందనము విని జ
టాయువు తన్నగ నివాసియై యాధ్వని సీ
తాయువతిగ దెలిసి యో
రీ ! యెవడవు ? సీత నపహరించెదు నిలుమీ ॥ 241

దాశరధి లేనితరి నీ
వా శునకము మంత్రపూతమై వెలయు పురో
డాశముగొని చనునటులో
యాశర ! కొనిచనుదె ? రామునాలిని గుమతీ ! 242

అని తనతీక్ష్ణతుండమున నాదశకంఠురథమ్ము బిండిగా
నొనరిచి వాజుల న్నిజ పదోగ్ర నఖమ్ముల ద్రుంచి వైచి త
ద్ధనునొనరించె జూర్ణముగ దానవుడంతట సీతవీడి యొ
క్క నిశిత ఖడ్గముం గొనుచు ఖండితపక్షునిగా నొనర్పగన్ ॥ 243

అంత ప్రాణావశిష్టుడై యాజటాయు
వవని దొరగగ రావణడన్య రథము
నందునిచి యేడ్చుచుం దన్ను నిందసేయు
జనకజాతను గొని చనె దనదుపురికి ॥ 244

హా ! రఘునాథ ! హా ! రఘుకులాభరణా ! మునిచిత్తగోచరా !
హా ! రమణా ! మనోహరతరాకృతి నిర్జితకోటిమన్మథా !
యారయవేమి ? నన్ను దనుజాధముడిట్లు బలాత్కరించి నే
డీ రథమందునుంచి గొని యేగుచునుండెను బ్రోవరాగదే ! 245

ఓ సౌమిత్రీ ! నీపై
దోసమిడుట తత్ఫలముగ దుఃఖమొదవె గా
దే ! సుజన దూషణమ్మున
గాసి గలుగకున్నె ? నన్ను గరుణనరయవా ? 246

ఆ మహిజ మొఱకు దలకక
రామాగమ శంకనుండి రావణుడు త్వరన్
గామార్తుడగుచు జానకి
నామునగొనిచనె విహాయ సాధ్యమున దమిన్ ॥ 247

వదనము లైదు నైదుగని వారిజలోచన భీతిచే నధో
వదనయు నార్తయై గిరినివాసి కపీశుల గాంచి భూషలన్
వదలిచి వస్త్రఖండమున బద్ధముచేసి తదీయ సన్నిధిన్
గదియగ రాల్చె దాని నిజనాధుని రాముని జేర్ప నేడ్చుచున్ ॥ 248

కరుణా హీనత నా దశాస్యుడు రఘుక్ష్మానాధు పత్నిన్ మహా
దరబుద్ధిం బురిజేర్చి సుందరతరూద్యానమ్ము శోకమ్ము ని
ష్ఠుర రక్షోవనితా పరీవృతము నౌచోటన్ నిజాంబామతిన్
బరిరక్షించుచునుండె సీత నిజదౌర్భాగ్యమ్ము జింతించుచున్ ॥ 249

హా ! రామచంద్ర ! కరుణా
వారాశీ ! సుందరాంగ ! వల్లభ ! నన్నున్
జేరి దశవదను శమనా
గారముజేరిచి ద్వదీయ గనగెయనుచున్ ॥ 250

పరికర్మ శూన్య శుష్య
ద్వర రసనయు గార్శ్య దీనతనులతయునునై
నిరతము రామాయని రఘు
వరుదలచుచు గాలమెటులో ? పనుపుచు నుండెన్ ॥ 251

7వ సర్గ సంపూర్ణం

# 8వ సర్గ

మాయా రూపధరు న్మరీచి తనయున్ మాయించి రాముండు దా
స్వీయమ్మైన తదాశ్రమస్థల మతిక్షిప్రమ్ముగా జేరుచో
ఛాయా హీనదురార్తి పీడిత నిజాస్యమ్మే మనఃక్షోభ చిం
తాయోగమ్ము నెఱుంగజేయుననుజున్ దర్శించి దూరమ్మునన్ ॥ 252

కనుగొని రామచంద్రుడు నికామమిటుల్ తలపోసె మాయ సీ
తను సృజియించి నిల్పుట నితండకటా ! తెలియంగ జాలడీ
తనికొక యజ్ఞనట్టుల యధార్థముగా గనిపించి సంచరిం
తు నటులుగానిచో నెటులు దుష్టవినాశము సంభవిల్లెడున్ ॥ 253

దీని నెఱుగుట నేను సుస్థిరుడనగుచు
జింతిలక గృహమందు వసించియున్న
రాక్షసానీక పరివృత రావణవధ
మెట్టులగు ? దద్వధోపాయ మిదియెగాదొ ? 254

కావున బ్రాకృతునటులే
నీవనమున సీత నెల్లయెడల వెదకుచున్
రావణుపురికలిగి దనుజ
జీవిత నాశమ్మొనర్తు సీతోపధియై ॥ 255

దానవవధ మొనరుప నే
బూని నలువకోర్కి బుడమి బుట్టితి మాయా
మానవత గాన దద్వధ
మే నొనరిచి నాచరిత్ర మిల వెలయింతున్ ॥ 256

జానకిని వహ్నియందే
నేనిలిపితి మరల నామె నేగొనుచు నయో
ధ్యా నగరము జేరెద నా
మానవచరితమ్మె ముక్తి మార్గమగునిలన్ ॥ 257

మానవ రూపమ్మున నటు
లేనొక కొన్నాళ్ళు గడపి యిలమచ్చరితన్
దీనుల నాల్కల నిడు భ
క్తానీకమునకు మదీయమగుపదమిడుదున్ ॥ 258

అని తలపోసి రాముడనుజాకృతి నారసి యిట్లు వల్కెనో
యనుజ ! భవద్వధూని జనకాత్మజ నవ్వని వీడి వచ్చితే ?
దనుజులు సీతప్రాణములు దక్కగ నిత్తురె ? లేక యామె జే
కొనిచనరే ? యిదేమిపని ? కూడునె ? నీకిది తెల్పు ? తమ్ముడా ! 259

అదివిని లక్ష్మనుండు జనకాత్మజ వాల్శిత సాయకాళి నె
మ్మది దలపోసి చింతిలి నమద్వదనుండయి పల్కె నేమి చె
ప్పెద భవదార్త నిస్స్వనము వీనులసోకగ భీతియొంచు మా
వదినె త్వదీయ సన్నిధికి బంపగ వచ్చితి నిట్టులగ్రజా ! 260

అన్నా ! నావదినెకు నే
నెన్నో విధముల భవన్మహిమదెల్పితి నా
యన్నుడుల వినక వినరా
నన్ని పరుసములను బల్కి యార్తి ఘటించెన్ ॥ 262

తెల్పగ జాలను వాని న
నల్పములు వచింప రానివయి వినబడె దు
ర్జల్పములవె మీయానతి
జల్ప నటులొనర్చె నన్నుసాకు మనంగన్ ॥ 262

రాముడనియె సోదరా ! యెటులైన నీ
చేత యనుచితమె ? స్త్రీవచనము
సత్యమని తలంచి సాధ్విని సీత న
రణ్యమందు విడిచి రానుచితమె ? 263

అని విలపించి రాముడు నిజాశ్రమ సీమను జేరబోవుచు
న్వనరుచు సీతజాడలు కనంబడమిం బరితాప మంది త
మ్మని గని లక్ష్మణా ! జనక పుత్త్రిక నవ్వడి గాన రాదయో !
దనుజులు క్రూరవర్తనులు దానికి హాని ఘటించి యుండిరో ? 264

అని యవ్వని వరయుచు నో
యనుజా ! యెచ్చటను సీత యగపడదేమీ !
దనుజుల పాలయ్యెనొ కా
దని యెందే దాగెనో ? మహార్తి గలిగెడిన్ ॥ 265

జనక మహారాజసుతా !
వనజానన ! ప్రాణవల్లభా ! నను నిముస
మ్మును పీడక కడుదనిపితి
వనఘగుణా ! యిపుడు వాయనగునే నన్నున్ ॥ 266

అని యెల్ల యెడల వెదకుచు
వనదేవతలార నాదు పత్నిని మీరల్
కనలేదా ? తరులారా !
వినిపింపుడు దాని దీనవృత్తమెఱిగినన్ ॥ 267

తెలుపరేమి సీత మెలగెడి జాడలు
ఖగములార ! జంతుగణములార !
చూపరేమి ? నాదు సుదతిని సీతను
బలుకరేమి యా యభాగ్యజనికి ॥ 268

సకలజ్ఞుడయ్యు దన జా
నకి గానక వగల మిగుల నలగె సదానం
ద కలితుడయ్యును రాముడు
వికలతగనె నచలుడయ్యు వెడలె వెదకగన్ ॥ 269

నిరహంకృతి నిర్మము డన
వరతానందుండు నరునివలె దుఃఖితుడై
కరమేడ్వ దొడగెను దలో
దరికై బహుగతుల రామధరణి విభుడహా ! 270

అటు రాఘవుండు మాయా
నటనమ్మున సక్తుడైన నరుడయ్యెను లం
పటులకు సక్తువలె నలం
పటులగు వేత్తలకు గానబడు బ్రహ్మముగన్ ॥ 271

అటువెదకుచు జనుచున్మం
గట వికలాంగమ్ము బతితసాయకమ్మున్ సం
త్రుటుత హయము రథముంగని
జటుల గతిం బలికె రామచంద్రుడనుజుతో 272

అనుజ ! కాంచితె ? యీ స్యందనాది విధము
నెవ్వడో జానకి హరించి యేగుచు నాడొక
వీరుతో బోరి యవ్వాని నోరిచి మన
జానకిని గొనె నొకడను జాడదెలిసె ॥ 273

అటు మరియు వెదకుచున్ ముం
గటగనె రాఘవుడు పతితఘనకాయు సము
త్కట శౌర్య గేయు రావణ
పటుశర వికలాసువాయు భవ్యజటాయున్ ॥ 274

కని రఘుపుంగవుండు గిరికల్ప మహోన్నత కాయునాతనిన్
దనుజాగా మదిందలచి తమ్ముడ చూచితె ? వీడు జానకిన్
దిని శకునాకృతిం గొనుచు దృష్టివహించి పరుండె వీనినిన్
దునిమెద నిమ్మ వింటనొక తోరపుసాయకమున్ ఘటించుచున్ ॥ 275

అది విని జటాయువెంతయు
బెదరి రఘూద్వహుని గాంచి ప్రియుడను రామా !
వదలకు నాపై సాయక
మిదె తెలిపెద నాదు వృత్తమెల్ల మహాత్మా ! 276

ఏ నొనరించు కర్మముననే మరణించుచునున్న వాడ నా
జానకి రావణుండు కొని సాగుచునుండ నెదిర్చి వానితో
బూని రణమ్మొనర్చి తుది బుష్టి తొలంగి దశాస్యుచేత నా
ప్రాణము లుజ్జగింప హత పక్షుడనై పడియుంటి రాఘవా ! 277

అని దీనముగా బలికిన
విని దుఃఖితుడగుచు రామవిభుడా మహితుం
గని జానకిని దలచి శు
గ్జనితాశ్రు జలమ్ము కనుల జాఱ నిటులనెన్ ॥ 278

నాయన ! మానిమిత్తము ఘనమ్ముగ వైరి నెదిర్చి ప్రాణము
ల్వాయగ నుంటివో మహితవర్తన ! ప్రత్యుపకారమేమి ? నే
జేయగలాడ ! నంచుదరి జేరిచి మేను స్పృశించి దువ్వి నా
జాయ నెవండు కొంచు జనె సజ్జన తెల్పుము ప్రాణబాంధవా ! 279

అనుడు జటాయుడు దీన
ధ్వనియై రక్తము స్రవించు వదనమ్మున రా
మునిగాంచి పలికెను దశా
ననుడు భవత్పత్నిగొని చన న్గనుగొంటిన్ ॥ 280

భీమ విక్రముడై పృధివీసుత గొని
దక్షిణాభిముఖమ్ముగ దరలె వాడు
దేవ ! యింతకు మించి దెలుపజాల
నేనిదే ప్రాణములవీడి యేగుచుంటి ॥ 281

ఆర్య ! నాపుణ్యమున నిన్ను నంతిమ దశ
నరయు భాగ్యమ్మొదవె బరమాత్మ ! నాకు
శ్రీపతివె నీవు మానవరూపము గొని
యిట్లు ప్రత్యక్షమైతి నీవింతకంటె
జేయు ప్రత్యుపకృతి యెదొ ? చెప్పుమనఘ ! 282

రామా ! మరియు స్పృశింపుము
నామేనిదె నీదు పదవనజయుగ్మము
నా మానసమున నిలిపెదనన
ప్రేమను మరియును స్పృశించి విడిచె గృపమెయిన్ ॥ 283

మునిమానసగోచరు రా
మునిధ్యానించుచు దదాభిముఖ్య మొదవగన్
దనువు త్యజించె జటాయువు
వనితా ! వాడెంత పుణ్య వర్తనుడొ ? గదా ! 284

అదిగని రామచంద్రుడు దయామయుడౌటను బక్షిరాజు వే
డ్క దమకు జేసినట్టి యుపకారము నెమ్మది నెంచి వాని మే
ని దహనముంబొనర్చి ఫలనీరములం బరలోక సౌఖ్య సం
పదనిడు పైత్యకక్రియ గృపంబచరించి యొనర్చి దృప్తుగన్ ॥ 285

ఓ పక్షిరాజ ! మత్కృత
మౌ పైత్రుక విధుల దృప్తినందికొనుము మ
ద్రూపము లోకముగనగా
బ్రాపింపుము నాపదమని రాముడు పలుకన్ ॥ 286

దివ్యరూప ధరుండయి తేజుమిగుల
బక్కితేడు విమానము నెక్కి శంఖ
చక్ర పద్మగదాది భూషల ధరించి
పీత వసనావృతిని రవివిభాతి వెలిగె ॥ 287

నాల్గు భుజములతో రమానాధుబోలు
పార్షదులు నల్వురు భజింప బరమయోగి
గణములు నుతింప రాఘవాజ్ఞ గొని మింట
నిలిచి రాఘవునిటు భక్తి వెలయ బొగడె ॥ 288

అగణిత గుణాఢ్యు నాద్యుని నప్రమేయు
సృష్టిపాలన సంహార హేతుభూతు
నతుల శాంతిధనుం బరమాత్మ భూతు
సతతము భజింతు శ్రీ రామచంద్ర మూర్తి ॥ 289

నిరవధి సుఖు శ్రీ సఖునిన్
సురపతి సరసిజ భవాది శోకహరుని దు
ర్భర చాపభూషిత కరు
న్వరదుని భజియింతు రాఘవ ప్రభు సతమున్ ॥ 290

భువన కమనీయ రూపుని
రవిసన్నిభతేజు శ్రితవర ప్రదు నీడ్యున్
దివిజ తరుమూల వాసుని
సవన ఫలప్రదుని రామచంద్రు భజింతున్ ॥ 291

భవవిపిన దవానలునిన్
భవహరు దేవాదిదేవు బరమ కరుణు దా
నవ శతకోటివినాశున్
రవితనయానీలవర్ణు రాముభజింతున్ ॥ 292

ధరణి ధర ధారు భక్తమందారు ధీరు
సురగణాసుర సేవిత చరణకమలు
సురవరదు రఘునాయకు సూరతేజు
సతతము భజింతు శ్రీరామచంద్ర విభుని ॥ 293

పరధన పరాంగనాదూర భావులకును
నన్య సద్గుణ భూత్య సూయారహితుల
కిత రహిత కార్యతత్పరమతి ధనులకు
సేవ్యుడౌ రామచంద్రు భజింతు నెపుడ ॥ 294

స్మిత విరాజిత వదనాబ్జు నతప్రసన్ను
శక్ర నీలాసితుంగుని సరసిజాక్షు
సత్ప్రసన్న విశాలలోచనుని రామ
చంద్రు బరమేశు సతతము సంస్తుతింతు ॥ 295

భాత్పహరి శంభు రూపభేదముల బూని
నీవ త్రిగుణాను వృత్తుడవై వెలయుచు
వారిపూరిత కలశబిందు గతరవుల
పగిది దోచెడు సురపతి వంద్య ! రామ ! 296

మదన శతకోటి సౌందర్య సదనగాత్రు
శతపథ శ్రుతి గోచర సత్వరూపు
ప్రవిమల యతీంద్ర హృదయ విభాసమాను
శ్రిత జనార్తి హరుని రాము మతి భజింతు ॥ 297

అటులు నుతియింపగ బ్రసన్నతార్ద్రబుద్ధి
పక్షివర ! నీకు సతతము భద్రమగుత
విష్ణుసాయుజ్యమును గాంచి వెలయగలవు
పొమ్మని వచించె శ్రీరఘు పుంగవుండు ॥ 298

గిరిసుతా ! దీనినెవ్వడు నిరతము విను
నెవడు పఠియించు మద్భక్తి నెవడు వ్రాయు
వారు మామక రూపము వడయుదురని
పలుకు రాఘవుభాషితములకు నలరి ॥ 299

రాముని సారూప్యముగని
యామహితుడు పక్షిపతి విహాయసమున భ
క్తామల ముక్తిద హరిపద
మామోదము మీర నొందియరిగె భవానీ ! 300

8వ సర్గ సంపూర్ణం

# నిర్వచన అధ్యాత్మ రామాయణం

## అరణ్యకాండ - 9వ సర్గ

శ్రీ రాఘవు డనుజునితో
వేఱొక విపినమ్ము జేరి విహ్వలుడై సీ
తారమణిని వెదకుచు నొక
చో రక్కసునిం గబంధు జూచి యిటులనెన్ ॥ 301

తమ్ముడ ! వాని జూచితివే ? దానవుడెవ్వడొ ? దీర్ఘబాహు యు
గ్మమ్మును జూచి దానినడుమన్మనలం గదియించి మ్రింగ య
త్నమ్మొనరించు నట్టులు గనంబడె వానిని ద్రుంపబోలు ఖ
డ్గమ్ముల జిత్రమియ్యది మొగంబును గాళులు గానరా వనన్ ॥ 302

సౌమిత్రి యనియె నగ్రజ !
తామిపుడన్నటులు వాడు తడవెడు బోవం
గా మనకు దెరవెదీ ? మన
సేమము వలెనన్న వీని జెండవలయుగా ॥ 303

వాని మొగంబు బాదములు వక్షమునం దడగన్ భయంకరా
నూనకబంధమాత్రమ కనుంగొన నయ్యెడి వాడు ప్రాణి హిం
సానిరతి న్వనాంతర వసన్మృగమానవ దంతి జంతు సం
తానము గంఠగహ్వరమునం బడవేయుచు నిందువర్తిలున్ ॥ 304

అనరాఘవుడుత్సుకుడై
యనుజుని బ్రేరించి తాను నసిగొని వడిగా
దునుమ గబంధుని భుజముల్
ఘనసాలములట్లు భూమిగములై పడియెన్ ॥ 305

ఎంతయు విస్మితుడౌచు న
రాంతకుడా వీర వరుల నారసి తేజో
వంతులగు మీ రెవరొ ? దను
జాంతకులారా ! వచింపు డాత్మ చరితముల్ ॥ 306

ఈ విధముగ మద్భుజముల
దేవతలకు నేని దునుమ దీంద్రమగుట మీ
రేవారో ? దేవతలకు
దేవతలనవచ్చు మిమ్ము దెలియనడిగితిన్ ॥ 307

అనుటయు సుప్రసన్న వదనాంబుజుడై రఘుపుంగవుండ హో !
దనుజవరేణ్య ! తద్దశరథ క్షితిపాలకుమార రామ ల
క్ష్మణులము మేము నాదు సతిజానకి నివ్వని నుంచి వేటకై
చనగ నెవండో ? బల్మిగొని సాగుట నామెను గాంచ నెల్లెడన్ ॥ 308

తిరుగుచు దావక బాహ్వాం
తరమున బడి ప్రాణరక్షదలచి యిటునినున్
నఱికితిమి నీవెవండవొ ?
యరుదగు నీవికృత రూపమంద గతమెదో ? 309

అనవిని కబంధుడిటులనె
నను ధన్యుని జేవచ్చి నాడవిటకు నా
మునిపటి పున్నెమదెట్టిదొ ?
వినుమో రాఘవ ! మదీయ వృత్తము వినుతున్ ॥ 310

రామ ! నేనొక గంధర్వ రాజనగుట
దర్పితుడనయి యన్యకాంతా ప్రియుండ
నగుచు దపమున నల్పమెచ్చగ నొనర్చి
యతడొసంగు నవధ్యత్వ మంది పిదప ॥ 311

ముని నష్టా వక్రుని గని
వినయమెడలి వానిరూప వికృతికి హాస
మ్మొనరింప నతడు శపియిం
చెను నను దనుజత్వమీవు చెందుమటంచున్ ॥ 312

శాపమొదవుటను బశ్చా
త్తాపముగని మౌనివరు పదంబుల వ్రాలన్
గోపముడిగి ఓరీ ! నీ
శాపమడగు ముందు రామచంద్రుని వలనన్ ॥ 313

వెన్నుడు రాఘవుండయి భువిన్ జనియించి మహోగ్ర దానవా
భ్యున్నతి రూపుమాప దలపోసి వనంబుల సంచరించుచున్
నిన్నొగి జెందు నాడడగు నీదగుశాపము పొమ్మటంచు బ
ల్కెన్నను దాన నేనిపుడు కేవలు నిన్గని నాడ నోప్రభూ ! 314

మరియు నొకపుడింద్రునిపై
గరువమ్మున వెడల నతడు కనలి నిజాసిన్
శిరమున వైవగ గుక్షిం
జరణమ్ములు శిరమడంగి సంతృప్తుడనై ॥ 315

పరమేష్ఠివర బలంబున
మరణములేనట్టి నన్ను; మాన్యులగు దయా
పరులరసి; శక్ర! వీడో
గిరమెటు దిని బ్రతుకు? వీని గృపగను మనగన్ ॥ 316

వీని శిరము కుక్షిగత,
మ్మైనను, బహు దీర్ఘమౌ జరాయత భుజయు
గ్మానితాహారముచే
మేను నిలిపికొనునటంచు, మెచ్చునబలుకన్ ॥ 317

నాటినుండి కబంధ సంజ్ఞను వహించి
వనముల జరించుప్రాణుల దినచు నిట్లు
నిలిపికొను చుంటి మేను, మన్నించి నన్ను
సాకగదవయ్య! శ్రీ రామచంద్రమూర్తి ! 318

అట్టి నాభుజముల బడగొట్టి నాడ
వింక నామేని, నింధనా వృత మగు క్షితి
తలమునందుంచి; వహ్ని దందహ్యమాను
జేయు; నీ సతి తెర, వెల్లజెప్పగలను; 319

అన వని శ్రీరాముడు ల
క్ష్మణునిన్నియమించి వాని కాయముగర్త
మ్మున నుంచి దానిపై నిం
ధనములనిడి దగ్ధమగు విధమ్మొనరించెన్ ॥ 320

దాని కాహుతియై కబంధదనుజుండు
భవ్య విద్యా ధరాకృతి వడసి, భూషి
తాంగుడై లేచి ; రామపాదార వింద
ములకు సాష్టాంగమెఱగి, తాబలికె ; నిట్లు ॥ 321

కేలు గవమోడ్చి, విమల భక్తిమొలకెత్త,
దేవ ! రాఘవ ! నిన్ను నుతింప నాదు
మనసు తత్తర పడుచుండె గనుము కరుణ
రామచంద్ర ! దయాసాంద్ర ! రఘుకులేంద్ర ! 322

## గీతమాలిక

వాఙ్మనోతీత ! మాద్యంతవర్జి తమ్మ
నంత మవ్యక్తము తను ద్వయాతిగమ్ము
నగుభవత్సూక్ష్మ రూపమసుగమ మరయ
తలప దృక్కది యితరమంతయును దృశ్య
మగుటనె, జడమ్మ నాత్మకమగుచునుండు॥
వ్యక్తమునకంటె భిన్నుడ వైన నిన్ను
స్వాంతమో ! జడమౌటగాంచగలదెట్లు ?
బుద్ధికి దదాత్మ ప్రతిబింబమున, కభేద
బుద్ధి మెదిగల దదియె జీవుడన బరగు;
నీవు బుద్ధ్యాదులకు సాక్షివై వెలసెడి
బమ్మ మతయౌదు నిర్విషయమ్ము నిర్వి
కార మఖిలాత్మ రూపముగా వెలుగుదు
బ్రహ్మమగునిన్ను దెలియమి భ్రాంతి వలన
నీపయి సమస్తమును సమారోపిత మగు
రామ ! నీ సూక్ష్మ తనువు, హిరణ్య గర్భుడ
నదగును స్థూలము విరాట్సమాఖ్యమగును
భావనాగమ్యమో రామభద్ర నీదు
సూక్ష్మరూపముధ్యానించు సుజన తతికి
మంగళము మూడు కాలములంగలిగెడి
జగములనీ సూక్ష్మతనువున నగపడియెడి

నుత్తరోత్తర గుణముల నొప్పెడి మహ
దాది కమ్మావరింపగనైన తావ
కాండ కోశగతత్ స్థూలకాయమందు
నలరు వైరాజమగు ధారణాశ్రయమ్ము
అఖిలకైవల మీవ మహాత్మ రామ !
లోకములు తావకాంగములు రఘునాధ !
అంఘ్రి మూలము పాతాళమగును నీకు
పూత తావక పార్ష్ణి మహాతలమ్ము
తాత ! నీగుల్ఫములు తద్రసాతలమ్ము
సుమ్ము నీజానువులు సుతలమ్ము రామ !
నీ తొడలు వితలమ్మగు నీరజాక్ష !
భూతలాతములు నీదు భూరి జఘన
మయ్యెడి నభమ్మె నీనాభియగును దేవ !
తావ కోరస్థలము స్వర్గధామ మగును
నీదు గళము మహర్లోక మైదనరెడి
సత్యలోకమునీదు శీర్షణ్యములగు
వాసవాదులెనీదగు బాహు వితతి
చెవులు దిక్కులు నాస లశ్విసురయుగము
ఆశ్రయాశుడు నీ యాస్యమగు గృపాబ్ధి
సవితనీదృష్టి నీమది చంద్రుడగును
బుద్ధి వాక్పతి కాలము భ్రూభ్రమణము
నీ మహంకృతి రుద్రుడు నీదు వాక్కు
లగును ఛందస్సమితి కోఱలగును యముడు
దంతములు నీకు నక్షత్ర సంతతియగు
మోహకృన్మాయ నీహాసము మహనీయ
సృష్టియగు దావకా పాంగవీక్షణమ్మె
నీపురస్థలి ధర్మము నీదు పృష్ఠ
దేశమె యధర్మ మగునని తెలియబడును
నీదు దృష్టి నిమీలనోన్మీలనములె
రేయి పగలగు జలరాశులే యుదరము

నదులు నాడులు జానకీనాథ ! నీకు
రోమములు తరులతలు రేతోమయమ్ము
వృష్టి తలపగ జ్ఞాన సమిష్టి నీదు
మహిమ నీస్థూల తనువు రామ ! యిది తెలియ
దలచి యేవాడు దీన జిత్తమ్ము నిలుపు
వాని కగుముక్తి శ్రమమించు కేనిలేక
దీని నెఱుగని వాడు భవానలమున
జతికిలంబడు నోరామచంద్ర మూర్తి !
సామి ! దేనిని దలప సరోమపులక
మైన ప్రేమ రసప్రవాహమ్ము దొరగు
నట్టి నీ స్థూల రూపము ననవరతము
దలతు నీకృపచే ముక్తి గలుగుగాత 323

మాయచే మూఢులై యెల్ల మానవులును
గావకోత్తమ తత్త్వ చింతకులుగారు
రామచంద్ర ! నమస్తే 2—స్తు రామభద్ర !
తేనమోస్తు సురేంద్ర వందిత యటంచు 324

పొగడి మరియును శ్రీరఘుపుంగవుగని
హర్ష సంజాతపులక సమంచితుడయి
అమర నిరతార్చితా ! అయోధ్యాధినాథ !
నన్ను మాయా వృతునిగా నొనర్పవలదు ॥ 325

అనుచు నుతియించు గంధర్వు నరసికరుణ
"దేవ గంధర్వ ! మోదమంది తినినీదు
భక్తి కట్టులౌట గొనుము నాపరమ పదము
యోగి గణమాత్రగమ్య సాయుజ్య మనఘ ॥ 326

భక్తి నీవిపుడీరీతి బల్కినట్టి
సంస్తుతి నెవండు పఠియించు జపమొనర్చు
వానికిజ్ఞాన సంభూతమైన భవము
తొలగశాశ్వత మోక్షము గలుగునిజము ॥ 327

౨వ సర్గ సంపూర్ణం

# నిర్వచన అధ్యాత్మ రామాయణం

## అరణ్యకాండ - 10వ సర్గ

పార్వతి ! వినుమావలికథ
సర్వమెఱింగింతు రామచంద్రుండా గం
ధర్వుని దయగన నాతడ
గర్వముగా రామునాజ్ఞగని ముదితుండై ॥ 328

రామవిభుడొసంగిన వరంబు గ్రహించి విమానగామియై
వ్యోమపథంబునం జనుచు నోరఘునందన ! ఇందెతత్పుర
స్సీమ సదాశ్రమమ్మొకటి చేరువ గన్పడు నందు భక్తి నీ
నామము సంస్మరించు చొకనాతి వసించు బవిత్రమూర్తియై ॥ 329

నరసిన కేశపాశము జనస్తుత వృత్తియు, సాధు వాగ్గతుల్
నరనెఱిగించు నంగములు నమ్ర ముఖమ్ము కషాయ కోమలాం
బరము నమత్కర ద్వయము మాధవ సంస్మరణమ్ము గల్గి శా
బరకుల భూషణా వెలయున్ భావిత తావక సద్గుణౌఘమై ॥ 33

దాని వలన నీకు జానకి వృత్తము
సకల మెఱుగ నగును జనుమచటకు
దావకాంఘ్రి సక్త బావన చరిత్ర
నామె శబరి యనుచు బ్రాజ్ఞులంద్రు ॥ 33

అని తెలిపి యర్కతేజో
వినుత విమానమ్మునెక్కి విష్ణు పదముచే
రెను గంధర్వుడు శ్రీరా
మనిరత భక్తులకు గలుగు మార్గమిదె సుడీ ॥ 33

ఆ రాఘవు లిరువురు ఘో
రారణ్య పదమ్ము దాటి యరుగుచు శబరీ
సారాశ్రమమ్ము మెల్లన
జేరగ నామెయును విమల చిత్తాంబుజయై ॥ 33

ఎదురేగి వినయమున ద
త్పదములపై వ్రాలి రామభద్ర మదీయా
స్పద మరుదెంచితె ? స్వాగత
మెదెయని మోదాశ్రు పూర్ణ దృగ్యుగయగుచున్ ॥ 334

రామ ! నీ దయకు వర్షము గోరి వదనము చాచు చాతకముగా వేచియుంటి
రామ ! నా దరికి నీరాకకై కర్షకుల్ ఘనమునకై వలె గాచియుంటి
రామ ! నీదైన దర్శనమునకున్ బిడ్డ తల్లి కైవలె దల్లడిల్లుచుంటి
రామ ! నీ మృదువచశ్శ్రవణమునకు జకోరము వెన్నెలకు వలె భ్రమయుచుంటి
ఎపుడు నీ దయగల్గునో ఎపుడు నీవు
వత్తువో ? వచ్చి నా కంటబడెదో? ఎపుడు
నీ మృదూక్తుల నాకు విన్పింతొ యనుచు
శబరి రాఘవునెడ భక్తి సలిపి మరియు ॥ 335

వినతి పురస్కృతిగ సుఖా
సనమిడి కూర్చుండువారి యంఘ్రుల బ్రేమ
మ్మున గడిగి తజ్జలమ్ముల
దనువు దడిపి భక్తిమై నతని బూజించెన్ ॥ 336

అమల చరిత్ర ! తచ్ఛబరి యవ్విధి నవ్విభు షోడశోప చా
రముల, సపర్య చేసి మధురమ్ములు దివ్య సుధాసమమ్ములున్
సుమ మిళితమ్ములై యతని జొక్కగ జేయు ఫలమ్ములెన్నొ పూ
ర్వమె గొని యుంచినట్టివి సభక్తిగ నిచ్చి వచించె నీగతిన్ ॥ 337

ఓ రఘునాథ ! ఇచ్చట గురూత్తముడైన మతంగమౌని సం
సార విదూరుడై తపము సల్పుచునుండగ వాని సన్నిధిన్
జేరి తదీయ సేవలను జేయ గతించె ననేక వర్షముల్
వారు పరమ్ము నొందుతరి పల్కిరి నన్గరుణార్ద్ర చిత్తులై ॥ 338

ఓ యోగినీ ! నిలుము నీ
వీ యాశ్రమమున సమాధి నెనసి పిదప నో
సీ ? యిటకు వచ్చు రాముం
డై యాపరమాత్ముడతని నరయగ వలయున్ ॥ 339

అతడు సనాతనుండు దనుజాధముల న్వధియింప మౌని సం
తతి మనుపం దలంచి యిటు దానరుదెంచును జిత్రకూట ప
ర్వతమున నుండె నేడికను వచ్చెడినంతకు దత్పరాత్పరు
న్మతి నిడి దేహరక్షణ మొనర్చిన నాతని జూడనయ్యెడిన్ ॥ 340

ఆ పరమాత్ముని గని నీ
వాపయి నీ పాంచ భౌతికాంగము వహ్ని
ప్రాపితముచేసి కాంచెద
వాపరమ పదమటంచు నన నిటులుంటిన్ ॥ 341

నిన్ను ధ్యానించుచునె యిందు నిలిచి యుండ
మద్గురూక్తి ఫలించె రామ భవదీయ
దర్శనంబయ్యె మూఢ చిత్తను బడతిని
గురుజనాలభ్య నిను గనుగొంటి నిటులు ॥ 342

హీనకులజను నీదు దాసానుదాస
దాస తద్దాసదాసుల దాస్యమునకు
దగని నాకయ్యె దావక దర్శనంబు
వాఙ్మనోతీత ! నన్ను గాపాడదగదె ? 343

అనుడు నామెకు రాఘవుడనియెనిట్లు
స్త్రీ పురుష భేదములు నామరూపజాతి
భేదములు లేవు యోగినీ ? నాదు దయను
గాంచినను జేర ! మద్భక్తి కారణమ్ము ॥ 344

యజ్ఞ దాన తపోధ్యయనాది కర్మ
ముల నొనర్చియు భక్తి వైముఖ్యముగల
జనుల కబ్బరు నాదు దర్శనము నిజము
గాన యోగిని భక్తిమార్గమె వచింతు ॥ 345

ముక్తి హేతువు తెలియ మద్భక్తి సుమ్మి
దాని సాధనముల దెల్పెదను వినదగు
సాధు సంగతి తొలుతటి సాధనమ్ము
తక్కు నెనిమిది విను తెల్పెదను గ్రమముగ ॥ 346

రెండవది మత్కథాలాపమంద్రు మరి తృ
తీయమౌ మద్గుణౌఘ నుతి ప్రసక్తి
మద్వచన వివరణ తీవ్రమతి చతుర్ధ
మగును మద్బుద్ధితో గురూపాసనమ్మొ
నర్చుటయె పంచమమ్మ పుణ్యమతి యమము
మొదలుగా గల యష్టాంగములును నన్ను
బూజ సేయుటయును షష్ఠముగ వెలయును
సాంగమన్మంత్ర నిష్టయే సప్తమమగు
మామకాశ్రితులందు ప్రేమమును సకల
భూతమద్బుద్ధి బాహ్యార్థముల విరక్తి
యష్టమమ్మగు మామకమ్మైన తత్త్వ
మును విచారించి తెలియుట చను నవమము
స్త్రీ పురుషులకు మరియు బక్షి మృగసంఘ
మునకు మద్భక్తియే శుభముల నొసంగు
నా యెడను భక్తిగలుగు నంతనె మదీయ
మైన తత్త్వాను భవసిద్ధి యగుటె భక్తి
యదిగలుగు నంత దజ్జన్మమందె ముక్తి
గాన భక్తియె ముక్తికి గారణమ్మ
మొదట సజ్జన సంగతి యొదవనేని
గ్రమముగా దక్కినవి యెల్లగలుగు నిజము
నీవు మద్భక్త వగుటనే నిన్ను జూడ
వచ్చి యిట్టులు దర్శన మిచ్చినాడ
గాని యెఱుగుదువేని మా జానకి గతి
యామె యెటకేగె ? నెందుండె ? నయ్యొ ? దాని
నెవ్వడు హరించె ? దెల్పుమో యవ్వనీవు ॥ 347

అనవిని యాశబరి వచిం
చెను సర్వజ్ఞుండవు రఘుశేఖర యిట్టుల్
నను నడిగె దెఱుగనట్టులు
కనగా లోకానుసారి గతి యిదియేమో ? 348

అయ్యొ ! నీ సతివిధము నన్నడిగితీవు
గాన దెలిపెద వినుము తజ్జానకి యిపు
డసుర రావణ లంకాపురావసథమె
వసతిగానుండె మరియొండు పలికెదవిను ॥ 349

ఆర్య ! ఇచ్చోట పంపాసమాఖ్యమగు
సరోవరమ్ముగల దతి పావనమ్ము
ఋశ్యమూక సమాఖ్య గిరీంద్రమొకటి
దాని చేరువనుండె; నుత్తమతమమ్ము ॥ 35

ఆవసుధాధరమ్మున సమర్థులు నల్వురు మంత్రులై సదా
సేవలొనర్ప నిల్చె గపిసేనల నేలుచు వాలిభీతి సు
గ్రీవుడు వానిచే నిఖిలకృత్యము నీకగు నందువాలికిన్
బోవగరాదు మౌని జనపూజ్యమతంగ మహర్షి శప్తతన్ ॥ 35

ఏను మదంగ మగ్ని శిఖనేర్చెద దావక సన్నిధానమం
దోనరనాధ ! యంతకును నుండుము నీవిట నగ్ని దగ్ధ నై
నీ నిలయమ్ము జేరెదను నీరజ నేత్ర ! త్వదీయ తత్త్వ వి
జ్ఞానము గల్గ జేసి నను గావగదే పరమాత్మ రాఘవా ! 35

అనవరతము దావకాంఘ్రి ద్వయాసక్తి
సతము నీదు నామ సంస్మృతియును
గలుగ, దేవ ! నన్నుగని నే బునర్జన్మ
మందకుండ నభయ హస్తమిమ్ము ! 35

అని యామె పలికి యనల
మ్మున నిజదేహమ్ము వేల్చి ముక్తయగుచు వి
ష్ణుని పదము నొందె శ్రీరా
ముని భక్తులు పొందుటరుదె మోక్షము ? దేవీ ! 354

జగదీశుడైన రాఘవు
డు గరుణమై గాంచెనా కడునధమ కులుడున్
దగు మోక్షమ్మున కర్హుం
డగు దానికి శబరియే మహాసాక్షియగున్ ॥ 355

కామ దుఘాంఘ్రి ద్వయుడున్
శ్యామాంగుండీశ హృదయ సద్మగతుండౌ
రాముడు కల్పము జనులా
రా ! ముక్తియె వలయునేని రాము గొలువుడీ ॥ 356

## ఫలశ్రుతి

అధ్యాత్మ సంజ్ఞరామాయణమును విన్న వారికి నెల్లపాపములు దలగు
నధ్యాత్మ సంజ్ఞరామాయణము పఠించువారధనులు ధనవంతులౌదు
రధ్యాత్మ సంజ్ఞరామాయణము వ్రాయువానికి నిజరోగపీడదొలగు
నధ్యాత్మ సంజ్ఞరామాయణ నిత్య సద్భక్తి యుక్తుడు భవముక్తిగాంచు
నధ్యాత్మ సంజ్ఞరామాయణ పారాయణార్థి విద్యానిధి యగు
నధ్యాత్మ సంజ్ఞరామాయణ పరులకు ధనమిచ్చు, నతని బంధనముతొలగు
నధ్యాత్మ సంజ్ఞరామాయణ పఠిత దుర్జయ శత్రుసంహార సంపదగను
నధ్యాత్మ సంజ్ఞరామాయణ కథకుండు, ధనయశఃపాండిత్య ఘనత గాంచు

రామచరిత, భవాబ్ధి తారకము నిజము
రామచరిత ముభయ విదారకము నిజము
రామచరితము దుఃఖవారకము నిజము
లేదు సందియ మిందొక లేశమేని

అరణ్య కాండ సంపూర్ణము



శ్రీ మదాకుండ్యన్వయ పవిత్ర, ఆత్రేయ సగోత్ర,
మహాకవి వేంకటకవి పౌత్ర, పంచకావ్య
అధ్యయన తత్పర రామజోగిశాస్త్రి పుత్ర,
విద్వత్కవి బిరుదాంకిత విద్వజ్జన విధేయ,
విజయనగర సంస్కృత కళాశాల ప్రధాన
ఆంధ్రోపాధ్యాయ వేంకటశాస్త్రి
నామధేయ ప్రణీతంబైన
నిర్వచన అధ్యాత్మ
రామాయణాంతర్గత
**బాల, అయోధ్య**
**అరణ్య కాండలు**
సర్వం సమాప్తం.
**ఓం తత్ సత్ శ్రీరామచంద్రార్పణమస్తు.**

# రామాయణ రచనలు, విశ్లేషణలో ఆకుండివారి ఆసక్తి



| గ్రంథకర్త పేరు | రచనా కాలం | రచనా ప్రక్రియ | గ్రంథం పేరు |
|---|---|---|---|
| ఆకుండి వేంకట కవి | 1820 | పద్యకావ్యం | 'తత్త్వ సంగ్రహ రామాయణం' (6 కాండలు) విజయనగరం ఆంధ్రవిజ్ఞాన సమితివారిచే బాలకాండ ప్రచురిం[illegible] |
| ఆకుండి వేంకటశాస్త్రి | 1953 | పద్యకావ్యం | 'మాలికా రామాయణం' ('బాల కాండ') (షట్కవి ప్రణీతం) విజయనగరం కౌముదీ పరిషత్ ప్రచురణ. |
| ఆకుండి సూర్య నారాయణ శాస్త్రి | 1991 | పద్యకావ్యం | 'ప్రత్యక్ష రామాయణం' |
| ఆకుండి సూర్య నారాయణ శాస్త్రి | 1998 | గద్యకావ్యం | 'శ్రీమదధ్యాత్మ రామాయణం' (6 కాండలు) |
| ఆ[illegible]ండి వేంకటశాస్త్రి | 1958 | పద్యకావ్యం | నిర్వచన అధ్యాత్మ రామాయణం' (6 కాండలు - 3000 పద్యములు) (బాల, అయోధ్య, అరణ్య కాండలు మాత్రం ప్రచురణ) |
| ఆకుండి రామశర్మ | 1996 | వ్యాససంకలనం | 'శ్రీమద్రామాయణ సుధా మాధురి' (6 అధ్యాయాలు 140 పుటలు - 1997 లో ప్రచురితం) |
| ఆక[illegible]డి రామశర్మ | 1998 | విశ్లేషణ | 'రామాయణంలో ఆర్ష ధర్మాలు' (బాలకాండ నుండి యుద్ధకాండ వరకు [illegible] రామాయణం లో 250 శ్లోకాలు - విశ్లేషణ - అముద్రితం) |